# మా యా మ యి

## 1

ఆ సుకుమార సుందర యువతి ఎవరైనది తెలియనంత వరకు ఆమెను వనకన్య అని పిలవటం మంచిది.

వనకన్య నెమ్మది, నెమ్మదిగా సేనాపతితో కలిసి యువరాజు వున్న చోటికి వచ్చింది. అక్కడ ఆగి వెనుదిరిగి చూచింది. ఆమెతో పాటు మరొక యౌవనవతి చేతిలో ఒక చిత్రాన్ని పుచ్చుకొని నడుస్తున్నది. ఆమె వనకన్య తనవైపు చూడటం గమనించి ముందుకు వచ్చింది. వనకన్య తన పుస్తకాన్ని ఆమె కిచ్చి, ఆమెచేతి చిత్రాన్ని తాను తీసుకొంది.

చిత్రాన్ని చూచి వనకన్య గట్టి నిట్టూర్పు విడిచింది. కళ్ళనుండి జలజలకన్నీరు రాల్చింది. ఇంతలో యువరాజు దృష్టి చిత్రంమీద పడింది. వనకన్య దూరంగా వెళ్ళిపోయేవరకూ యువరాజు కన్నార్పకుండ ఆమెకేసి చూచి సేనాపతితో "ఈమెఎవరో నీకు తెలుసా?" అని అడిగాడు.

"నాకు తెలియదు, కాని ఎవరో రాజకుమారియై ఉండవచ్చు."

"ఆమె చేతిలో ఉన్న పుస్తకం నాకు ప్రయాణంలో లభించినదే"

"అయితే అది యీమె చేతిలోకి ఎట్లా వచ్చింది!"

"అదే ఆశ్చర్యంగా వుంది. అంతకంటే ఆశ్చర్యం మరొకటుంది గమనించావా ?"

"లేదు, ఏమిటది ?"

"ఆ చిత్రంకూడా నాదే !"

"అయితే మీరు ఇంకా ఆశ్చర్యం గొలిపే సంగతి చెప్పారు !"

"నాకేమీ తెలియకుండా వుంది. వాళ్ళు ఎక్కడికి వెళ్ళుతున్నారో వెను వెనుకగా వెళ్ళి చూద్దాం నడవండి."

ఇద్దరూ నారీ బృందం వెళ్ళిన దిక్కుగా వెళ్ళారు. కొద్దిదూరం వెళ్ళేసరికి వెనకనుంచి పిలుపు వచ్చింది. తిరిగి చూస్తే అతడు తేజసింహుడు ! అతడు దగ్గరకు వచ్చిన తరు వాత "ఏమిటి యీ వేషం వేసుకున్నావు?" అని అడిగాడు యువరాజు.

తేజసింహుడు "ఏముంది ఇక నేను శాశ్వతంగా మీనుండి విడిపోతున్నాను." అతడు అంతకంటే ఎక్కువ మాట్లాడలేకపోయాడు. కంఠం గద్గదమైంది. కళ్ళల్లో నీళ్ళు నిండాయి. తేజసింహుని మాటలు విని అతని పరిస్థితి చూచి యువరాజు నిరుత్తరుడైనాడు. కాని తేజసింహుడు ఆ విధంగా ఎందుకైంది అర్థంకాలేదు.

వతహాసింహుడు వాళ్ళ నిద్దరిని చూడలేక కన్నీరు వొత్తుకుని తేజసింహునితో "ఏం జరిగిందో చెప్పు" అని అడిగాడు. తేజసింహుడు "ఇంద్రజాలం పుస్తకం ఇక మనచేతికి దొరకదు. నేనిక వాగ్దానం ప్రకారం తల గొరిగించుకొని మీకు దూరమైపోతాను." అన్నాడు విచారంగా.

ఇంతలో అక్కడికి దేవీసింహుడూ, జ్యోతిషికుడూ తిరిగి తిరిగి వచ్చారు. జ్యోతిషికుడు "తేజసింహా! భయ పడకు. ఆ పుస్తకం మీకు దొరక్కపోయినా వాళ్ళకీ దొరకలేదు. అది నేను చెప్పినట్లు మూడవవారి చేతిలో ఉన్నది." అని అన్నాడు.

అంతట తేజసింహుడు కొద్దిగా కుదుట బడ్డాడు. యువరాజు "భలేవాడివయ్యా నీవు ఏడ్చింది కాక, నన్ను కూడ ఏడ్పించావు! ఆ పుస్తకం చేజిక్కించుకొన్న వారిని నే చూచాను. నన్ను చెప్పనివ్వకుండానే నువ్వు ఏడ్పు ప్రారంభించావు." అన్నాడు.

తేజసింహుడు కుతూహలంతో "ఎవరి చేతి లో చూచావు? వాళ్ళు ఎక్కడ ఉన్నారు?" అని అడిగాడు.

యువరాజు "ఎక్కడున్నారో నేనేమీ చెప్పను? కని పిస్తారేమో పోదాం పద!" అని ముందుకు దారితీశాడు. వెనుక మిగతావారు నడుస్తున్నారు. అతడు ఎటువైపు వెళ్ళు తున్నాడో సేనాపతికి తప్ప మిగతావారికి తెలియదు.

రాకుమారుడు ఒక జాముకాలం నలుదిక్కులా వెతికి ఫలితం లేకపోగా ఒకచోట నిలబడిపోయాడు. తేజసింహుడు "అసలు సంగతేమిటో చెప్పండి" అని అడిగాడు. యువరాజు "ఇక్కడ నేనేమి చెప్పను" అని స్కంధావారానికి అందరినీ తీసుకొని వెళ్ళాడు. అక్కడనుండి అందరూ శిథిల గృహం లోనికి వెళ్ళారు. అక్కడ వారికి బదరీనాథుని ముఖా మెదు రైంది.

యువరాజు "బదరీనాథుడు ఎట్లా విడిపించుకొన్నాడో" అన్నాడు తేజసింహునితో.

"చాలా విచిత్రమైన విషయం" అన్నాడు తేజ సింహుడు,

"ఒక వేళ వీళ్ళ చేతికి పుస్తకం దొరికిందేమో" అన్నాడు దేవీసింహుడు.

"వీళ్ళ చేతికిమాత్రం దొరకలేదు. తర్వాత దొరుకు తుందేమో చెప్పలేను. కొద్దిసేపటిక్రింద అది ఇంకొకరిచేతిలో ఉండటం చూచాం" అన్నాడు సేనాపతి.

అంతలో బదరీనాథుని ముఠా దగ్గరికి వచ్చి "ఏమి తేజసింహా ఓడిపోయావా?" అన్నారు.

"మే మెందుకు ఓడతాం" అన్నాడు తేజసింహుడు.

"ఎందుకు ఓడిపోవు? నేను పుస్తకం ఇవ్వకుండానే విడిపించుకున్నాగా?" అన్నాడు బదరీనాథుడు.

"పుస్తకం మాకు దొరికింది. నువ్వు విడిపించుకుంటే ఏమి? మేము విడిపిస్తే విడుదలైతే ఏమి? ఇక నీవు శివదత్తుని విడిచి మా యువరాజు పక్షాన చేరాలి" అన్నాడు తేజ సింహుడు.

బదరీనాథుడు:– ఏదీ ఆ పుస్తకం చూపించు! ఇప్పుడే మీ పక్షాన చేరతాను."

తేజసింహుడు :– నీవే ఎందుకు చూపకూడదూ ? నీ దగ్గఱ లేనప్పుడు అది మాదగ్గరేవున్నట్లే లెక్క.

బదరీనాధుడు:- అదా సంగతి! అయితే ఆ పుస్తకం నీ దగ్గర లేదని తేలిపోయింది. మేము భయపడినట్లుగానే అది ఇంకొకరి చేతిలోకి వెళ్ళిపోయినదన్నమాట.

దేవీసింహుడు అయితే ఎవరు ఓడిపోయారో చెప్పు.

బదరీనాధుడు:- ఎవరూ ఓడలేదు.

రాజకుమారుడు:- సరేకాని నువ్వు ఎట్లా విడిపించుకున్నావూ ?

బదరీనాధుడు:- ఆ భగవంతుడు విడిపించాడు. మేము మాత్రం తెలిసి ఏ ఉపాయమూ చేయలేదు. పన్నాలాల్ ఆ రాతిమానిసి శిరస్సుమీద ఒక కట్టను పెట్టాడు. అతడు నన్ను విడిచి ,ఆ కట్టను పట్టుకున్నాడు. అంతే! అతని చేతిలో ఆ కట్ట యిప్పటికీ ఉన్నది.

యువరాజు:- మంచిదే అయింది. ఇద్దరిమాటా దక్కింది.

బదరీనాధుడు:- రాజకుమారా! నాకూ మీతోనే ఉండాలని కోరిక. అకారణంగా శివదత్తునికి ద్రోహం చేయ లేకుండా ఉన్నాను. సెలవిప్పించండి.

యువరాజు:- మంచిది వెళ్ళరా

జ్యోతిషికుడు:- మాతో ఉండకపోతే పోయావుకానీ, మాయాజాలాన్నైనా కట్టిపెట్టు

దేవసింహుడు:- ఆఖరికి బ్రాహ్మణుడ వనిపించుకున్నావయ్యా! మాయాజాలానికి భయపడటమా? వాళ్ళ శక్తి వంచన లేకుండా శక్తిని ప్రదర్శించనీ!

పన్నాలాల్:- సరే చూద్దాంలే! జై మాయామయికీ!

తేజసింహుడు:— జై మాయామయికి

బదరీనాథుని ముతా వెళ్ళిపోయింది. యువరాజుకూడా వెనక్కి తిరిగి డేరాలోకి వచ్చాడు. రాత్రికి అంతా సమావేశమైనారు. తేజసింహుడు యువరాజుని పుస్తకం సంగతి వివరీకరించమన్నాడు.

యువరాజు "ఆమె ఎవరో చెప్పలేనుకానీ, ఎవరైనప్పటికీ ఆమె చంద్రకాంతకు ఏమాత్రం తీసిపోదు; ఆమె సౌందర్యం ఆమె చేతిలోనుంచి నన్ను పుస్తకాన్ని లాగుకోనకుండా చేసింది"

తేజసింహుడు ఆశ్చర్యపడి "చంద్రకాంతకూ పుస్తకానికీ, సంబంధమేమిటండీ! అర్థమయ్యేటు చెప్పండి." అన్నాడు.

రాజకుమారుడు "ఏమిచెప్పను ! నాపరిస్థితి విచిత్రంగా తయారైంది." అని గట్టి నిశ్వాసం విడచి మౌనం దాల్చాడు.

"మీ విచిత్ర పరిస్థితి నాకేమీ అర్థం కావటంలేదు. (ఘతహాసింహునితో) మీరుకూడా వెంటవున్నారుగా. మీరైనా చెప్పండి. ఆయనైతే పన్నెండుసార్లు ఊపిరితీసుకోని ఒకటి స్వరమాట చెపుతున్నాడు. ఎక్కడపడితే అక్కడ ఈయనకు ప్రేమ పుట్టుకొస్తుంది. ఒకటింకా పూర్తయినా కాలేదు. అప్పుడే రెండోది కొనితెచ్చుకోవటానికి సిద్ధమౌతున్నాడు!" అన్నాడు తేజసింహుడు.

పతహాసింహుడు జరిగిన సంగతంతా తెలియజెప్పాడు. తేజసింహుడికి ఆమె యెవరో? ఇంతకు ముందే ఆమె రాజకుమారుణ్ణి యెక్కడ చూచిందో? యెప్పుడు ప్రేమించిందో?

అప్పటి కప్పుడే చిత్రాన్ని కూడా యెక్కడ సంపాదించిందో ? ఇవేమీ అర్థం కాలేదు.

జ్యోతిషికుడు వివరాలు యెక్కువగా చెప్పలేకపోయినా ఒక రాజకుమారి అనిమాత్రం చెప్పాడు. చివరకు యేవిధంగా నైనా ఆస్త్రీని వెతకాలనే నిశ్చయానికి వచ్చారు.

ఆరాత్రి అందరూ విశ్రాంతి తీసుకొనటానికి వెళ్ళారు. రాకుమారునికి వనకన్యా వియోగం వల్ల కంటి మీద కునుకు పట్టలేదు. తెల్లవార్లూ మంచంమీద అటూ యిటూ దొర్లి ఒక ఝాము ప్రొద్దెక్కినా ముసుగు తన్ని పండుకొన్నాడు.

తేజసింహుడు వచ్చి చూచాడు. యువరాజు ముఖం మీద చెప్పటి తడిసివుంది. వనకన్య మీద ప్రేమ బాగా తల కెక్కినట్టుగా తేజసింహునికి అర్థమైంది. ఇప్పుడు ఉపదేశాలకు కూర్చున్నా లాభంలేదనుకొని "మీరు మేలుకుని వున్నారా? నిద్రిస్తున్నారా ?" అని కేకేశాడు.

"మేలుకొనే వున్నా !" అని యువరాజు ముసుగు దీశాడు.

"ఇంత ప్రొద్దెక్కేవరకూనా పండుకోవటం. రోజూ ఈపాటికి స్నానాదులు ముగించుకొనేవారుగదా !" అన్నాడు తేజసింహుడు.

యువరాజు నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొన్నాడు. అందరూ అప్పటికే సిద్ధమైవున్నారు. అంతా వనకన్యను వెత కటానికి ప్రయాణమైనారు. యువరాజుకూడా "నేనూ వస్తా" నన్నాడు. అందరూ 'మీరువస్తే మా పనికి ఆటంకం కలుగు తుంది. వద్దు' అన్నారు. 'అయితే నేను సేనాపతితో అటూఇటూ

తిరుగుతాను' అన్నాడు. రాజపుత్రుడు "అందుకుకూడా తేజసింహుడు శివదత్తుని ఇంద్రజాలికులు మోసగిస్తారు" అని చెప్పి "యెక్కడికీ వెళ్ళవద్దు" అన్నాడు. యువరాజు వినలేదు. అతణ్ణి సేనాపతినీకూడా తీసుకొని అందరూ అడవి దిక్కుగా వెళ్ళారు.

అడవిలో కొంతదూరం వెళ్ళిన తర్వాత యువరాజును సేనాపతిని ఒకచోట కూర్చోబెట్టి ఇంద్రజాలికులు ముగ్గురూ వనకన్యను వెతకటానికి మూడుదారులా వెళ్ళారు. వాళ్ళు వెళ్ళిన తర్వాత యువరాజు సేనాపతితో వనకన్యను గూర్చి తప్ప ఇతర విషయాలేవీ మాట్లాడలేదు.

## 2

రాజకుమారుడు సేనాపతితో కూర్చుని మాట్లాడుతూ వుండగా వారి ముందునుంచీ యౌవనవతియైన ఒక మాలిని అడవిపూలు బుట్టలో వేసుకొని వెళ్ళుతుండటం కనిపించింది. ఆమె వెళ్ళుతూ వెళ్లుతూ "ఇవాళ అడవిపూలు దండ గుచ్చటం ఆలస్యమైంది. బహుశః రాజకుమారికి కోపంవచ్చి ఉంటుంది ఏమౌతుందో!" అనుకొంటున్నది.

ఆమె మాటను ఇద్దరూ విన్నారు. రాకుమారుడు సేనాపతితో "ఈమె యెవ్వరో రాజకుమారి మాలినిలాగా వుంది; పిలిచి అడుగు!" అన్నాడు. పతహాసింహుడు పిలిచాడు. మాలిని ఉలిక్కిపడి వెనుదిరిగి చూచింది. సేనాపతి చేయెత్తి మళ్ళా పిలిచాడు. ఆమె భయంతో వణకుతూ దగ్గరికి వచ్చింది. సేనాపతి "ఎవరికోసం పూలదండలు తీసుకొని వెళుతున్నావు? ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"కావటానికి నేను మాలినినేగాని నేను ఇవి ఎవరికోసం తీసుకొని వెళుతున్నానో నాకే తెలియదు. నేను ఎవరిదగ్గర ఉంటున్నానో కూడా చెప్పలేను. నిరుపేదను. నన్ను విడిచి పెట్టండి! నన్ను చంపితే మీకేమి వస్తుంది? చేతులెత్తి మ్రొక్కుతా! నా ప్రాణం తియ్యకండి" అని మాలిని వేడు కొన్నది.

ఆమె పూలబుట్ట క్రిందపెట్టి ప్రాణంతీసినట్లు పెద్దపెట్టున యేడ్వసాగింది. ఆ పూలవాసనలు ఆప్రదేశాన్నంతా గుబులు కున్నవి. అంతలో అశ్వారూఢుడైన ఒక ముసుగు మనిషి అక్కడకువచ్చి యువరాజు దిక్కుగా నిలిచి "మీరు దీనివలలో పడకండి! ఇది మాయావిని. ఇంకొంచెంసేపు మీరా పువ్వుల వాసన చూచారంటే స్పృహ తప్పిపోతారు." అని హెచ్చ రించాడో లేదో వెంటనే మాలిని అక్కడనుండి పారిపో సాగింది. కాని సేనాపతి వెంటనే చెయ్యి పుచ్చుకున్నాడు. ముసుగుమనిషి మాత్రం అప్పుడే వెళ్ళిపోయాడు. యువరాజు "నాకు ఉపకారం చెయ్యటానికి తలపెట్టిన ఆ ముసుగు మనిషి యెవరో? అవసరమేమిటో?" అన్నాడు. సేనాపతి సమాధా నంగా "ఆ సంగతి తెలుసుకోవటం చాలా కష్టం. యెవరై నప్పటికీ మనకు చాలా సహాయం చేశారు. లేకపోతే ఈపాటికి ఎక్కడవుండే వాళ్ళమో!" అన్నాడు.

"అవును; దీనిని తీసుకొని వెళ్దాం పద! అక్కడకు వెళ్ళి దీని సంగతి చూద్దాం" అని యువరాజు మిగతా యిద్దరితో శిబిరానికి చేరి "ఇప్పుడు దాని పేరేమిటో అడుగు" అన్నాడు.

సేనాపతి "అంత తేలిగ్గా నిజం చెప్తుతుందా?" అని వేడినీళ్ళు తెప్పించి ముఖాన్ని కడిగించాడు. అప్పుడా మనిషి బదరీనాథపండితుడని తేలింది. "ఇప్పుడు నిన్నేం చెయ్యాలి? అన్నాడు యువరాజు.

"మీ యిష్టం వచ్చింది చెయ్యండి" అన్నాడు మాయావి.

"తేజసింహుడు వచ్చేవరకూ జాగ్రతపరచు. అతడే ఈ వ్యవహారమంతా తేల్చుకుంటాడు" అన్నాడు సేనాపతితో యువరాజు.

రాత్రికి తేజసింహుడు సపరివారంగా తిరిగి వచ్చాడు. ఆ రోజల్లా వ్యర్థమైన సంగతి యువరాజుకు చెప్పాడు.

యువరాజు నిట్టూర్పు విడిచి "అయితే; ఏం చెయ్యాలి?" అన్నాడు.

"ఇవాళ కాకపోతే రేపు అదే తెలుస్తుంది."

"మేముకూడా ఒక మాయావిని పట్టుకున్నాం" అన్నాడు యువరాజు.

"ఎవరిని? ఎక్కడున్నాడు?"

"ఫతహాసింహుడి అధీనంలో, పిలిపించి యెవరో చూడు!" అని యువరాజు అన్నాడు.

దేవీసింహుణ్ణి పంపి ఆ ఐంద్రజాలకుణ్ణి తెప్పించాడు. బదరీనాథుణ్ని చూచి సంతోషపడి "యిప్పుడు నీ అభిప్రాయం యేమిటి?" అని తేజసింహుడు అడిగాడు.

బదరీనాథుడు:- మొదట యేమిటో యిప్పుడూ అదే!

తేజసింహుడు:- ఇప్పుడైనా శివదత్తుని వదులుతావా? లేదా?

బదరీనాదుడు:- ఎందుకు విడిచిపెట్టాలి?

తేజసింహుడు:- అయితే నువ్వు ఖైదీ వౌతావు!

బదరీనాథుడు:- ఏమైనా కానీ!

తేజసింహుడు:- నీ శిష్యులు నిన్ను విడిపిస్తారనుకుంటున్నావేమో! మా ఖైదు ఖానా సంగతి నీకు తెలియదు!

బదరీనాథుడు:- అంతా తెలుసు; అక్కడికే పంపించరాదూ; చూద్దాం!

దేవీసింహుడు:- ఎంత నిర్భయంరా!

తేజసింహుడు సేనాపతితో "ఇతనిని గట్టి జాగ్రత్తలలో వుంచు. రేపు పెద్దయింటికి చేరవేద్దాం" అని చెప్పాడు. సైనికులు బదరీనాథుణ్ణి తీసుకొని వెళ్ళిపోయారు.

ఇంతలో కాపలావాడు వచ్చి "ఒక ముసుగుమనిషి గుఱ్ఱాన్ని యెక్కి వచ్చి ఈ ఉత్తరాన్ని రాజకుమారునకిమ్మని యిచ్చాడు." అని చెప్పి ఉత్తరాన్ని యిచ్చి పోయాడు. తేజసింహుడు లేఖను చూచాడు.

"వీరేంద్రసింహ యువరాజు చరణకమలముల సన్నిధికి—" అని మొదలైంది, ఆపైన చదవకుండా యువరాజుకిచ్చాడు. అతడు చదువుకొన్నాడు:

గీతం:

"ఎవనికై విడనాడితి నవని సుఖము
అతడు నిర్మమతన్ నను అరయడేని
రాజ్యభోగాలు వీడి విరాగిణినయి
విరహవేదనా నలమున పరితపింతు.

—ఒక విరాగిని"

ఉత్తరాన్ని చదువుకొని ఆపుకోలేని దుఃఖంతో "ఉత్తరం తెచ్చినవారిని లోపలకు పిలువు" అన్నాడు యువ రాజు. కాపలావాడు బైటికివెళ్ళి తిరిగివచ్చి "లేరు" అని చెప్పాడు.

యువరాజు మరెంత దుఃఖంతో ఉత్తరాన్ని తేజసిం హుని చేతికిచ్చాడు. అతడు దానిని చదువుకొని "ఈ వుత్తరం మనం ఎవరికోసం తిరుగుతున్నామో వారిదగ్గరనుండే వచ్చింది. దీనిని చదివితే ఆమెకూడా నీమీద యెంతగా ప్రేమను పెంచు కొందో అర్థమవుతుంది. నువ్వు విచారించవలసిన అవసరం నాకు కనుపించటంలేదు."అన్నాడు.

యువరాజు ఈ ఉత్తరం ప్రేమాగ్నిలో ఘృతంపోసి నట్లుగా వచ్చిపడింది. "అయినా మీరిక వెళ్ళి విశ్రాంతి తీసు కోండి రేపేమౌతుందో చూద్దాం" అన్నాడు.

## 3

నిన్నటిరాత్రికంటే యీ రాత్రి రాజకుమారునికి మరీ కష్టంగా గడిచింది. ఎన్నోసార్లు ఆ గీతాన్ని చదువుకున్నాడు. ఉదయం త్వరగా కాలకృత్యాలు తీర్చుకొని, అడవికి వెళ్ళ టానికి తేజసింహునికి కబురంపించాడు. అతడు వచ్చి 'ఇవాళకూడా ఎక్కడికీ నువ్వు బయలుదేరవ' ద్దన్నాడు. అతడు వినలేదు. అప్పుడు తేజసింహుడు ఇంద్రజాలపు పువ్వులలో నుండి గులాబి పువ్వును నీళ్ళలో కలిపి యువరాజుచేత సేనాపతి చేత, త్రాగించాడు. దానివల్ల ఎవరూ వారిని స్పృహతప్పించి

తీసుకొనిపోలేరు. కాని బలవంతంగా తీసుకొని వెళితే చెప్ప లేము.

ఐదుగురూ అడవికి వెళ్ళారు. ఒకచోట సేనాపతినీ, యువరాజును విడిచిపెట్టి మిగతా ముగ్గురు వేఱు వేఱుగా వెళ్ళారు. రాకుమారుడు సేనాపతితో అటూ ఇటూ తిరుగ నారంభించాడు. ఒకచోట అతనికి ఇద్దరు ముసుగు మనుష్యులు గుఱ్ఱాలమీద రావటం కనుపించింది. రాజకుమారునికి కొంచెం దూరంలో ఒక ముసుగుమనిషి గుఱ్ఱాన్ని దిగి నేలమీదవిదో పెట్టారు. రాజకుమారుడు ఆవైపు వెళ్ళాడు. దగ్గఱకు వెళ్ళిన తరువాత ఆ వచ్చినవారు "ఈపుస్తకాన్ని ఉత్తరాన్నీ తీసు కోండి" అని చెప్పి వెళ్ళిపోయారు.

అది ఇంద్రజాలపు పుస్తకం. దానిమీద ఒక పత్రం ప్రక్కగా కలము, సిరాబుడ్డికూడా ఉన్నాయి. రాజకుమారుడు సంతోషంలో ఆ పుస్తకాన్ని తీసుకొని సేనాపతితో "వాళ్ళు ఈ పుస్తకం ఇచ్చి ఎందుకు వెళ్ళి పోయారో తెలియటం లేదు. వాళ్ళమాటలను బట్టి స్త్రీలని తెలుస్తోంది. ఉత్తరంలో ఏముందో చూద్దాం" అని లేఖను చదవటం ప్రారంభించాడు. అందులో—

"నాహృదయం నీతో ఐక్యమైంది. నీవుకోరిన యువతి పాపం ఇంద్రజాలంలో చిక్కుకొనివుంది. ఆమెకు ఏదైనా కష్టం కలిగితే నీహృదయం బాధపడుతుంది. నీఆనందమే, నాఆనందం. అందుకని పుస్తకాన్ని నీకు అప్పగిస్తున్నా. వ్యూహాన్ని ఛేదించు. చంద్రకాంతను రక్షించు. నన్ను గుర్తుంచుకో. నీకుప్రేమపాత్ర

మైన దానిమీద ఒట్టేస్తున్నా. నాఉత్తరానికి సమాధానం వ్రాసి పుస్తకంతీసుకున్నచోటే పెట్టు.

—ఒక వియోగిని."

ఉత్తరాన్ని చదివి వెంటనే రాకుమారుడు సమాధానంగా—

"ఒకనాడు ఈ ఇంద్రజాల పుస్తకాన్ని పుచ్చుకున్న నిన్ను చూచాను. ఆనాటినుంచీ నిన్నుకలుసుకోవాలని నాహృదయం ఆరాటం చెందుతోంది. ఏనాడు నాకళ్ళు నా ప్రేయసుల చూచి చల్లబడతాయో ఆనాడు నన్ను నేను అదృష్టవంతుణ్ణిగా భావించుకుంటాను. కాని, నీకు నాసూపం అసమ్మత మౌతుంది.

నీ ప్రియేంద్రుడు."

అని వ్రాసి అక్కడే ఆ ఉత్తరాన్ని పెట్టాడు. రాకుమారుడు దూరంగా వెళ్ళిన తరువాత మునుగు మనుష్యులలో ఒకరు వచ్చి ఆ ఉత్తరాన్ని తీసుకొనివెళ్ళిపోయారు. రాకుమారుడు కూడా సేనాపతితో కలిసి శిబిరానికి చేరుకున్నాడు.

కొద్దిరాత్రి అయిన తర్వాత, తేజసింహుడు, దేవీసింహుడు, జ్యోతిషికుడితో కలిసి యువరాజు శిబిరానికి చేరుకున్నారు. తేజసింహుడు ఇవ్వేళ కూడా వ్యర్థమయింది. కాని మునుగుమనుష్యులు అటు, ఇటు తిరిగిన జాడ కనుపించింది, నేను వాళ్ళ వివరాలు తెలుసుకోవాలనుకున్నా గానీ, చతురులైన వాళ్ళముందు నాఆటలు సాగలేదు. రేపు వాళ్ళ సంగతి తేల్చుకుంటాను" అన్నాడు.

యువరాజు 'నీవల్ల ఏమీ పని జరగక పోయినా నేను మాయాజాలం చేసి పోగొట్టుకున్న వస్తువుల్ని తిరిగి తెచ్చాను.' అని ఇంద్రజాల పుస్తకాన్ని తేజసింహుని ముందుంచాడు.

తేజసింహుడు "మీరు చేసిన మాయాజాలం నాకు తెలుసు. కాని ఇది మీ చేతికి ఎట్లా వచ్చిందో చెప్పండి" అని అడిగాడు యువరాజు పుస్తకాన్ని సంపాదించిన ఘట్టాన్ని పూర్తి వివరాలతో చెప్పాడు. ఆ ఉత్తరాన్నికూడా చూపించి దానికి తాను వ్రాసిన సమాధానాన్ని వినిపించాడు.

జ్యోతిష్కుడు "ఆమె ఉన్నతకుటుంబానికి చెందినది. యువరాజుకు దుఃఖాన్ని కలిగించటం ఆమె అభిమతంకాదు. ఈ ఉత్తరంవల్ల ఆమెకు రాకుమారుని వృత్తాంతమంతా తెలిసినట్లు అర్థమవుతోంది. కాని ఆమె ఎవరో మాత్రం మనకు తెలియరావటంలేదు" అన్నాడు.

యువరాజు.— అందుకు సిగ్గుపడవలసింది తేజసింహుడు. కారణం ఏమంటే మాయాజాల పండితుడై వుండికూడా, ఇతడు నలుగురి ఆ స్త్రీల వివరాలు తెలుసుకోలేకపోయాడు.

తేజసింహుడు:— తొందరపడతారెందుకు ? నేను వివరాలు తెలుసుకున్నమీదట మీరు ఎంతగా సంతోషిస్తారో చూద్దుగాని ఇప్పుడు పుస్తకం దొరికితే ఇంద్రజాలాన్ని పూర్తి చేద్దామని ఆ విషయాన్ని గురించి ఆలోచించలేదు.

యువరాజు:— అప్పటిదాకా వాళ్ళు కూర్చుంటారా?

తేజసింహుడు.— అయితే ఇప్పుడుమీకు చంద్రకాంతను గూర్చిన చింతలేదా ?

యువరాజు:- ఎందుకులేదు? ఆమెపై నాకుగల ప్రేమ నరనరాలలో జీర్ణించుకుపోయింది. కాని యీమె ప్రేమకూడా త్యాగపూరితమై ఉన్నప్పుడు న్యాయాన్ని కలిగించవద్దా? ఈమె నాపై ప్రేమ కలిగివుండటంవల్ల చంద్రకాంతను నాకంటే కూడా మిన్నగా భావించింది.

తేజసింహుడు :- నేను ఆమె ప్రేమను గురించి ఆలోచించవద్దని చెప్పటంలేదు. కాని వ్యూహాన్ని గురించి గట్టిగా ఆలోచించాలని మాత్రం కోరుతున్నాను.

రాజకుమారుడు:- అయితే రెండు పనులు సానుకూల మయే పద్ధతి చేద్దాం.

తేజసింహుడు:- సరే! అల్లాగైతే పగలు ఇంద్రజాలాన్ని ఛేదించేపని చూచి, రాత్రి ముసుగు మనుష్యులను గురించి యోచిద్దాం.

ఆ రాత్రి ఆ విధంగానే గడిచింది. ఉదయం అందగానే ఇంద్రజాల గ్రంథంతో శిథిలగృహంలో ప్రవేశించారు. ఆ పుస్తకంలో వ్రాసివున్న ప్రకారం శిథిలగృహాన్ని ఛేధించటానికి పూనుకున్నారు. గ్రంథంలో "ఇంద్రజాలాన్ని ఛేదించేవారు ఒకజాము ప్రొద్దు మిగిలివుండగానే బైటికి వచ్చివేయాలి. ఆ తరువాత ఇంద్రజాలాన్ని ఛేదించే పని ఏదీ చెయ్యరాదు" అని ఉన్నది.

# 4

వాళ్ళు రాతిమానిసి వున్న వసారాలో ప్రవేశించారు. రాకుమారుడు అక్కడనుంచే తన పని ప్రారంభించాడు.

రాతిమానిసి ఉన్న అడుగుకి తలవైపున ఐదుజానల దూరంగా యువరాజు స్వయంగా భూమిని త్రవ్వాడు. ఒక బారెడు లోతు త్రవ్వేసరికి పట్టుకోటానికి లోహపు కొక్కెమున్న ఒక తెల్లని రాతిబండ కనిపించింది. కొక్కెము పట్టుకొని రాతిని ఎత్తి బైట పెట్టాడు. ఒక చీకటి గది కనిపించింది. దాని లోపలికి వెళ్ళటానికి మెట్లున్నాయి.

తేజసింహుడు బాణాసంచా వెలిగించాడు. అందరూ లోనికి వెళ్ళారు. ఆ గది విశాలంగా వున్నది. దానికి మధ్యగా పాలరాతితో చెక్కబడిన అందమైన బొమ్మ ఒకటి ఉన్నది ఆ బొమ్మ ఒక చేతిలో మేకు, రెండవచేతిలో సుత్తి పుచ్చుకుని నిలబడివుంది. రాకుమారుడు బొమ్మ చేతులలోని వాటిని తీసుకొని దాని యెడమ చెవిలో మేకుపెట్టి సుత్తితో గొట్టాడు. వెంటనే ఆ బొమ్మ పెదాలు కదలి నోటిలోనుండి రాగాలాపన చేయసాగింది. చూస్తే ఆ బొమ్మ పాడుతుందా అనిపించింది. కొంతసేపు అట్లాగే ఉండి ఆ బొమ్మ అవయవాలు విరిగి కూలిపడింది. తరువాత పొట్టలోనుండి పూలతో నిండిన ఎనిమిది అంగుళాల్ల గులాబి పెట్టె బైటికి వచ్చింది. దాని కొమ్మకు ఒక తాళపుచెవి వ్రేలాడుతున్నది. దానితోపాటు ఒక రాగిరేకు కూడా దొరికింది. ఆ రేకుమీద-

"ఈ చెట్టును మా దగ్గరవున్న అజాయబదర్ఖాను అనే వైద్యుడు ప్రేలుడు దినుసులతో తయారుచేశాడు. ఈ పువ్వుల నుండి మామూలు గులాబి వాసనలు బయలుదేరి చాలా దూరంవరకు వ్యాపిస్తాయి. దర్బారులో అందంగా పెట్టుకోవటం కోసం యీ చెట్టును కానుకగా వైద్యవంశీకుడు మీకు సమర్పిస్తున్నాడు" అని వ్రాసి ఉన్నది.

యువరాజు దానిని చదువుకొని సంతోషంగా జ్యోతిష్కుణ్ణి చూచి "నాకు మంచి వస్తువే దొరికింది. చూడండి! ఇప్పుడుకూడా ఎట్లా పరిమళం ముసురుకుంటున్నదో!" అన్నాడు

తేజసింహుడు:— అవును సందేహం లేదు.

దేవసింహుడు:— ఒకదాన్ని మించిన వరొక శిల్ప చాతుర్యం కనుపిస్తున్నది.

యువరాజు మాట్లాడుతుండగానే ఆగదికి ఒకప్రక్కగా వాకిలి తెరుచుకొన్నది. అంతవరకు చీకటిగదిలో వున్న వారికి వెలుతురు కనిపించింది. బాణాసంచా ఆర్పివేశారు. అందరూ వాకిలిగుండా బైటికి వెళ్ళారు. ఒక అందమైన తోట కనిపించింది. ఈతోట ఆనాడు చపల చేరుకున్నదే!

ఇంద్రజాలం పుస్తకంలో వ్రాసివున్న ప్రకారం యువరాజు తాళపుచెవికి ఒక తాడు కట్టాడు. తాటిని చేతిలో వుంచుకొని తాళపుచెవిని నేలమీద యీడ్చుకుంటూ తోటలో తిరగసాగాడు. చెట్టు చెట్టును తాకుతూ మళ్ళలో తిరుగుతూ జలయంత్రం దగ్గరికి వచ్చేసరికి తాళంచెవి అక్కడ భూమిని హత్తుకపోయింది. వాళ్ళుకూడా అక్కడే ఆగారు. రాజకుమారుడు చెప్పినమీదట అందరూ అక్కడ త్రవ్వటం మొదలు

పెట్టారు. రెండు, మూడు బారలలోతు త్రవ్వేసరికి జ్యోతిషి-కుడు "సమయం అయిపోయింది. మన మిప్పుడు బైటికి వెళ్ళి పోవాలి" అన్నాడు.

రాజకుమారుడు తాళంచెవి తీసుకున్నాడు. నలుగురు ఆచిన్నగదిగుండా పైకెక్కారు. రాతిమనిషివున్న వసారాలోకి వెళ్ళి లోగడ తాము త్రవ్వినగోతిని పైకి తీసిన రాతితో కప్పివేసి చీకటిగది ద్వారాన్ని మూశారు. దాని అడుగుభాగాన ఒక తాళంవుంది. ఆతాళాన్ని అంతకుముందే తమదగ్గర ఉన్న తాళంచెవితో వేశారు.

అందరూ బైటికి వచ్చి రాజకుమారుని డేరాలోకి వెళ్ళారు. ఆతరువాత అందరూ వనకన్యను వెతకటానికి అడవికి వెళ్ళారు. అప్పటికి ప్రొద్దుక్రుంకటానికి ఇంకా రెండుగంటల సమయం ఉన్నది.

ముగ్గురు ఐంద్రజాలికులూ కొద్దిదూరం వెళ్ళేసరికి ఒక ముసుగుమనిషి గుఱ్ఱంమీద వెళ్ళుతుండటం కనిపించింది. దేవిసింహుడు మొదలైనవారు చెట్లచాటుగుండా ఆమానిసి వెనుక వెనుకగా నడక సాగించారు. ఆవ్యక్తి కొద్దిగా వసుమటికి తిరిగి మధ్యలో అప్పుడప్పుడు ఆగి వెనక్కి తిరిగి చూచు కుంటూ చునారగఢానికి వెళ్ళుతున్నాడు.

ప్రొద్దుక్రుంకింది. చీకటులు అలముకొంటున్నాయి. ఆ చీకటిలో మహారణ్యం మరీ భయంకరంగా మారిపోయింది. ఈ ముగ్గురూ ఎండుటాకులు గలగలమంటూ ఉండగా ముందుకుసాగారు. ఒకగంట ప్రొద్దుపోయేసరికి వాళ్ళు అడవికి ఒకప్రక్కకు చేరుకొన్నారు.

ముసుగు మానిసి అక్కడ గుఱ్ఱాన్ని దిగాడు అక్కడ ఇంకా గుఱ్ఱాలున్నాయి. తన గుఱ్ఱాన్నికూడా వాటితో బాటు కట్టివేశాడు. ఒకవైపున గడ్డిమేట ఉన్నది. అందులోంచి అతను తన గుఱ్ఱానికి మేత తీసివేశాడు. కాలినడకను ప్రయాణం సాగించాడు.

ముగ్గురు మాయావులూ ఆముసుగు మానిసిని వెంటాడుతూ ఒక జాము పొద్దుపోయేసరికి గంగానది చెంతకు చేరుకున్నారు. గంగాజలాల్లో దూరాన రెండు వెలుగురేఖలు కన్పిస్తున్నాయి. అవి రెండూ రెండు చంద్రమానాలుగా ఆభాసిస్తున్నాయి. తెల్లనికాంతులు నదీజలాలపై విస్తరించుకొన్నాయి. దగ్గరకు వెళ్ళిచూసేసరికి అలంకరించినఒకనావలో చాలామంది చక్కని యువతులు కూర్చున్నట్లు కన్పించింది. వారి మధ్యలో ఉన్నతమైన స్థానంలో ఒక సౌందర్యరాశి అయిన ఒక మనోహరాంగి కూర్చున్నది. ఆమెను చూచినవారికి మనస్సు చలించక మానదు. చంద్రబింబంవంటి ఆమె ముఖం దూరానికే అత్యంత మనోహరంగా కన్పిస్తోంది. ఆమెకు ఇరువైపులా రెండు దివిటీలు వెలుగుతున్నాయి.

ముసుగుమానిసి నదీతీరాన్ని చేరుకొని గట్టిగా ఈల వేశాడు. నావలోనుండి అనంతరంగా సమాధానం వచ్చింది. అందులో కూర్చున్న యిద్దరు స్త్రీలు లేచి నిలబడ్డారు. ఆ నావకు బంధించివున్న ఒక డింగీని ఊడదీసి ఆ ఇద్దరు స్త్రీలూ తీరానికి తీసుకొనివచ్చి ముసుగుమానిసిని అందులో ఎక్కించుకొన్నారు.

ఈ కథాక్రమాన్ని గమనిస్తున్న తేజసింహుడు "అబ్బా! ఆ నావలో దివిటీల మధ్యలో కూర్చున్న స్త్రీ ఎంత అందంగా ఉన్నది!" అన్నాడు.

జ్యోతిషికుడు :- ఈదుకొని అక్కడికి వెళదాం పదండి.

దేవీసింహుడు:- పండితులుగారూ! మిమ్మల్ని ఆ పడచులు ఎత్తుకొనిపోతే మాలో ఒకడు తక్కువవుతాడు.

తేజసింహుడు:- వీరు బహుశా మన రాకుమారుడు చూచిన బృందంలోనివారే ననుకొంటాను.

దేవీసింహుడు:- అందులో అనుమానమేమీ లేదు.

జ్యోతిషికుడు:- అయితే; ఈదుకొని వెళ్ళటానికి భయపడతారెందుకయ్యా ముసలవాళ్ళ లాగాను.

దేవీసింహుడు:- నీతో వెళ్ళితే లాభమేమిటయ్యా! గొప్ప జ్యోతిషికుడనని చెప్పుకుంటావు. ఇన్నాళ్ళనుంచీ వీళ్ళెక్కడున్నారో కనుక్కోలేకపోయావు.

జ్యోతిషికుడు:- ఏమి జ్యోస్యం చెప్పమంటావు? వీళ్ళు నాకే గురువులుగా కన్పడుతున్నారు. సొంతపేరులు మార్చుకొని కూర్చున్నారు. ఒకతె పేరు 'వియోగిని' మరొకతె పేరు 'యోగిని' ఇంకొకతె 'ఢాకిని' వేరొకతె 'శాకిని' ఈ పేరులు పెట్టుకున్నవాళ్ళ అంతు నా జోస్యంవల్ల ఎట్లా తేలుతుంది?

తేజసింహుడు :- అయితే వీళ్ళ పేరులెందుకు మార్చుకున్నారంటావు."

జ్యోతిషికుడు :- మనల్ని దద్దమ్మలుగా చేయటానికి

దేవీసింహుడు:- అయితే వాళ్ళ నిజమైన పేరులేమిటో, వాళ్ళ యిళ్ళు ఎక్కడో తెలుసుకోండి.

జ్యోతిషికుడు:- గవ్వలు వేసి వీళ్ళ యిళ్ళ సంగతి ఆరా తీయగా వీళ్ళ యిళ్ళు నీళ్ళలో ఉన్నాయని తేలింది. దానిని బట్టి వీళ్ళని జలవాసులనీ అనగా, చేపలనీ అనుకోవచ్చునంటారా?

తేజసింహుడు:- అయితే సరే వాళ్ళు జలవాసినులో కాదో చూడండి

జ్యోతిషికుడు:- 'పినవయ్యా గాలీ, నీరు, మట్టీ, నిప్పు యివి నాలుగూ గవ్వలలో లెక్క కట్టేపనికి ఎప్పుడూ ఆటంకమే!'

తేజసింహుడు:- ఆ సంగతియేమిటో వివరంగా చెప్పండి బాబూ!

జ్యోతిషికుడు:- చెబుతాగానీ, ముందు మనం ఏ పనిమీదవచ్చామో; ఆ పని చేదాం పట్టండి! ఈదటం ప్రారంభిద్దామా?"

జ్యోతిషికుని మాటమీద అందరూ నీటిలో దూకి యీదుకుంటూ నావ దగ్గఱకు వెళ్ళటం ప్రారంభించారు. మాయాజాలపు సంచులను గుడ్డలలో చుట్టి యేటిఒొడ్డున పెట్టారు. రెండు మూడు బారలదూరం వెళ్ళేసరికి వెనుకనుంచి యీల వేసిన ధ్వని వినిపించింది. ఆ వెనువెంటనే ఎవరో నావలో వెలుగుతున్న దివిటీలు ఏటిలో విసిరి ఆర్పివేశారు. ఇప్పుడంతా చీకటైంది. ఆ నావ కంటికి కన్పించటంలేదు. నీటిలో నున్న తేజసింహుడు "ఇక వెళ్ళండి యీదుకుని" అన్నాడు.

దేవీసింహుడు:— వీళ్ళెక్కడో శాకినుల్లాగా కన్పడుతున్నారే.

జ్యోతిషికుడు:— నేను ముందుగానే చెప్పాను కదయ్యా నా మాటమీద ఇప్పుడు కాని మీకు నమ్మకం కలుగలేదు.

దేవీసింహుడు:— ఇక ఒడ్డుకు పదండి! వీళ్ళు మనకంట్లో దుమ్ముకొట్టారు. బహుశా ఒడ్డున కావలా వాళ్ళు ఉన్నారనుకొంటాను. వాళ్ళు ఈల వెయ్యటం అక్కడ దివిటీలు ఆరిపోవటం లెక్కప్రకారం జరిగింది.”

జ్యోతిషికుడు:— ఈ పనికిమాలిన వాళ్ళకేం పోయే కాలం? మనం తీరా నదిలో దూకి తడిసిపోయిన తర్వాత ఈలవేశారు.

ముగ్గురు ఇంద్రజాలికులూ తిరిగి ఒడ్డుకు వచ్చారు. బట్టలకోసం వెదకపోతే అవెక్కడా కన్పించలా. దేవీసింహుడు “జ్యోతిషపండితులుగారూ అనుకున్నంతా అయింది. వాళ్ళిప్పుడు నా చేజిక్కితే సమిలి పారేస్తాను” అన్నాడు.

తేజసింహుడు:— బలేపని చేశారయ్యా!

దేవీసింహుడు:— అవునవును. ఇంకా పొగడండి! వాళ్ళలో ఒకరైనా మీ కూడ దయితలిస్తే ముందు ముందు బాధించకుండానన్నా ఉంటాడు.

జ్యోతిషికుడు:— ఇప్పుడుమాత్రం మనల్ని తక్కువేమి ఏడిపించారు! ఆఖరికి గుడ్డలుకూడా లేకుండా చేశారు.

“ఇక ఇప్పుడేమీ చేయలేంగాని తిరిగి వెళదాం పదండి” అన్నాడు తేజసింహుడు. అర్ధరాత్రికూడా దాటిపోయింది.

పాపం! ముగ్గురూ వణుకుతూ సిగ్గుపడుతూ సైన్యాలు విడిసివున్న చోటికి వెళ్ళారు.

# 5

వీరేంద్రసింహుడు మిత్రులకొరకు ఎదురుచూస్తూ ఆ రాత్రంతా మేలుకొనే వున్నాడు. రాత్రి గడిచినకొద్దీ అతనికి ఎందుచేతనో భయం భయంగానే ఉన్నది. తెల్లవారే సరికి మిత్రులు ముగ్గురూ వచ్చారు. తేజసింహుని సలహామీద ముగ్గురూ నగ్నంగానే యువరాజు శిబిరంలో ప్రవేశించారు.

యువరాజు ఆ ముగ్గురి వేషాలూ చూచి "ఏం జరిగింది." అన్నాడు ఆశ్చర్యంగా.

తేజసింహుడు:- ముందు మా ఆకారాలు చూడండి. తరవాత సంగతి కొంచెం ఆగి చెబుతాం.

ముగ్గురూ గుడ్డలు తెప్పించుకొని కట్టుకున్నమీదట యువరాజు "ఎక్కడ చిక్కుకున్నారో యిక చెప్పండి" అన్నాడు.

"జీవితంలో ఎప్పుడూ ఇట్లాంటి దెబ్బతిని యెరగం" అన్నాడు తేజసింహుడు.

"ఏమిటో చెప్పవయ్యా చంపక" అన్నాడు యువరాజు.

తేజసింహుడు:- ఎవరిమీదమనసునిలిపారో, ఎవరికోసం వెదకాలని బయలుదేరామో ఆతల్లి చూపించిన దయ యిది. ఆమెకు మీమీద సంపూర్ణంగా మనసు కలిగింది. కాని యెందుకు చాటుగా ఉంటుందో అర్థంకావటంలా.

యువరాజు:- సంగతి తెలుసుకొన్నారా ఏమిటి?

తేజసింహుడు :- తెలుసుకోవట మేమిటండీ; ఊళ్ళల్లో చూచాము. అందుకేకదా ఇల్లాంటి శాస్తి జరిగింది. వాళ్ళల్లో కూడా తలదన్నిన మాయావు లున్నారు. ఆసంగతి తెలిస్తే ముందుగానే జాగ్రత్తపడేవాళ్ళం.

"బాగా తెలిసేటట్లు చెప్పు" అన్నాడు యువరాజు. తేజసింహుడు అక్కడ జరిగిన విశేషమంతా తెలియజెప్పాడు. యువరాజు జ్యోతిషికుణ్ణిచూచి "అయితే మీజ్యోతిషాన్ని కూడా దెబ్బగొట్టారన్నమాట" అన్నాడు.

జ్యోతిషికుడు:- ఎందుకు చెపుతారులే. మాగతి కుక్కలకు కూడా పడదు.

యువరాజు:- వాళ్ళసంగతి తెలియనప్పుడు శివదత్తుడి ఇంద్రజాలికులు మీకు టోపీపెట్టారని యెందుకనుకోగూడదూ?

జ్యోతిషికుడు:- వాళ్ళకీ వీళ్ళకీ సంబంధ మెక్కడయ్యా? శివదత్తుడి మాయావులకు అసలు వీళ్ళసంగతి తెలియనుకూడా తెలియదు.

తేజసింహుడు:- జరిగినంతవరకూ బాగానే జరిగింది.

దేవీసింహుడు:- ఇవ్వేళ పగలే వెళ్ళి ఆరా తీద్దాం.

తేజసింహుడు:- అయితే ఇంద్రజాలాన్ని ఛేదించే దెవ్వడు?

యువరాజు :- ఒకరోజు పని ఆపేస్తే యేంపోయింది.

తేజసింహుడు:- అందుకే నేను మీకు చంద్రకాంతపై మక్కువ తగ్గిపోయిందని చెపుతున్నాను.

యువరాజు :- ఎప్పటికీకాదు. ఈ ప్రపంచంలో చంద్రకాంత కంటే ఎక్కువగా నేను ప్రేమించే వాళ్ళెవరూలేరు.

కాని యే కారణం చేతనో వనకన్య విషయం తెలుసుకోవాలనే ఆవేదనకూడా నాలో ఉద్భవించింది."

తేజసింహుడు నవ్వి "సరే! ఇవ్వేళ బదరీనాథ పండితుణ్ణి చీకటిగుహలో పడేసి యింకొక పని చూద్దాం." అన్నాడు.

యువరాజు:- అలాగే తీసుకొని వెళ్ళి బాధించిరా.

తేజసింహుడు:- అవును. ఇప్పుడే తీసుకొని వెడతాను. అక్కడనుంచి ఈ రాత్రికి రాత్రే తిరిగివస్తాను. అందాకా దేవీసింహుడూ, జ్యోతిషికుడూ వనకన్యను వెదుకుతూ వుండటం మంచిది.

అతని ఉద్దేశాన్ని అందరూ సమర్థించారు.

తేజసింహుడు బదరీనాథుని స్పృహలేకుండా చేసి చీకటి గుహకు తీసుకొని పోయాడు. యువరాజు జ్యోతిష్కుణ్ణి, దేవీసింహుణ్ణి వనకన్యను వెదకటానికి పంపించాడు.

బదరీనాథ పండితుణ్ణి తీసుకొని తేజసింహుడు చీకటి గుహదగ్గరకు వెళ్ళాడు. తాను లోగడ వేసిన పద్ధతిలోనే తాళం తీయబోగా రాలేదు. ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. చివరికి చేయగలిగింది లేక బదరీనాథుని బంధించిన మూట నెత్తి నెట్టుకొని తిరిగి వెళ్ళాడు.

## 6

జ్యోతిషికుడూ, దేవీసింహుడూ వనకన్యాన్వేషణ సాగిస్తుండగా ఒక ముసుగు మానిసి కన్పించాడు. ఆ ముసుగు మానిసి గొంతెత్తి "దేవీసింహా! ఎక్కడికి వెళ్ళుతున్నావు? నీ ఆటలు మా ముందు సాగవు. నిన్న జరిగింది చాలక యీ

వేళ బందీలు కావటానికి తిరిగి వచ్చారా? కొన్నాళ్ళపాటు మీరు మాకు శిష్యులై అప్పుడు మమ్మల్ని పట్టుకోవటానికి ప్రయత్నించడి" అన్నాడు.

దేవీసింహుడు జ్యోతిషికుణ్ణి చూచి "విన్నావా. సిగ్గుతో మన ముఖాలుకూడా చూడలేనివారు మన కేదో బోధిస్తారట" అన్నాడు.

ముసుగుమానిసి :- ఆయనకు చెబుతావేమయ్యా ? మా అంతు తెలుసుకోలేక అసలే అతను సిగ్గుపడుతుంటే ! పాపం ! వెయ్యిసారులు గవ్వలు విసిరాడు.

దేవీసింహుడు:- ఈ మండలంలోనే మీరు ఉండండి. మిమ్మల్ని పట్టుకుంటామో లేదో !

ముసుగుమానిసి :- ఉండక ఎక్కడికెళతాము-రోజూ మీ ముందేగా తిరుగుతున్నాం.

మాటలమధ్యలో దేవీసింహుడు ముసుగు మానిసి ముసుగు లాగేశాడు. అతనిముఖమంతా గుర్తుపట్టలేకుండా ఏదో పూసికొనున్నట్లున్నది.

ముసుగుమానిసికూడా చటుక్కున దేవీసింహుని తల పాగ ఊడబెరికి, అందులో ఒక ఉత్తరాన్ని పడవేసి, గుఱ్ఱ మెక్కి పారిపోయాడు.

దేవీసింహుడు సిగ్గుపడుతూ ఉత్తరాన్ని తీసి "వీరేంద్ర సింహ యువరాజా..." అని చదివి, జ్యోతిషికునితో "వీళ్ళె క్కడ మనుష్యులో తెలియకుండా వుంది. వీళ్ళ అతసకంటె ఘనుడు ఆచంట మల్లన్న, అన్నట్లున్నారు" అని ఉత్తరాన్ని చదవకుండానే జేబులో పెట్టుకున్నాడు.

జ్యోతిషికుడు "చూద్దాం ఏంజరుగుతుందో, ఈ ఉత్తరాన్ని ఇవ్వటానికి ముందు యువరాజువద్దకు పోదాం పద! యువరాజుపేర ఈ ఉత్తరం లేకపోతే అసలు మనమే చదివే వాళ్ళం" అన్నాడు. తర్వాత ఇద్దరూ యువరాజువద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పి ఉత్తరాన్నిచ్చారు.

ఉత్తరంలో—

"మీరెంత ప్రయత్నించినా యీదిగువ విషయాలకు తగిన సమాధానం మీదగ్గరినుండి రాకపోతే నేను మీకు కనిపించను.

1. నన్నూ చంద్రకాంతనూ ఒకేరోజున ఒకేలగ్నాన పాణిగ్రహణం చెయ్యాలి.

2. నేనుకూడా చంద్రకాంతకు సాటి అభిజాత్యం కల దాన్నే గనుక గౌరవంలో ఆమెకంటే నన్నేమీ తక్కువగా చూడకూడదు.

ఈ విషయాలపై నాకు నచ్చిన సమాధానం మీదగ్గర నుండి వచ్చినట్లయితే రేపే నేను మీ దర్శనం చేసాను. నా సాహాయ్యమూ, సలహాలూ లేకుండా మీరెంత ప్రయత్నించినా చంద్రకాంతనుమాత్రం పొందలేరని స్పష్టంగా చెబుతున్నాను."

రాజకుమారుని సైన్యం వనకన్య శక్తి సామర్థ్యాలకు ఎన్నిరెట్లో మించిఉన్నది. వనకన్య ప్రేమ చంద్రకాంత ప్రేమకు ఏమాత్రం తీసిపోనట్టిది. కాని ఆ ఉత్తరం చూచిన మీదట వనకన్యను ఎన్నో అనుమానాలు పట్టుకొని పీడిస్తున్నట్లు అర్థమవుతున్నది. అతడు ఒకే లగ్నాన ఇద్దర్నీ పెళ్ళిచేసుకోవటం

ఎట్లా సాధ్యమవుతుందని ఆలోచించసాగాడు. అన్నిటికంటే ముందు జయసింహామహారాజు ముందుగానే ఈ పద్ధతిని వ్యతిరేకిస్తాడు. ఆమె తన సహాయం లేకుండానే చంద్రకాంత లభించదనికూడా వ్రాసింది. అసలు అంతదాకా ఎందుకు ? వనకన్య లేకుండా యువరాజే జీవించలేనిపరిస్థితిలోకి వొచ్చాడు. ఈ అన్ని విషయాలూ ఆలోచించి అతడు వనకన్య ప్రశ్నలకు తగిన సమాధానాలు వ్రాసి పంపాలని నిశ్చయించుకొన్నాడు. వనకన్యను వివాహం చేసుకోవటంలో చంద్రకాంత ఆమోదం లభిస్తుందని యువరాజు ఆశించాడు. జ్యోతిషికుడికీ దేవీసింహుడికీ కూడా ఆ ఉత్తరాన్ని చూపించాడు. వాళ్ళకు ఆ ఉత్తరానికి సమాధాన మేమివ్వాలో తోచలేదు.

పగలూ రాత్రి యువరాజు ఆ వుత్తరానికి ఏమి సమాధానాలు వ్రాయాలో అని ఆలోచిస్తున్నాడు. మరునాటి ఉదయానికి తేజసింహుడు బదరీనాథపండితుణ్ణి కట్టిన మూటతో తిరిగివచ్చాడు.

“తిరిగి తెచ్చావేం?” అని ప్రశ్నించాడు యువరాజు.

“వ్యవహారమంతా తారుమారైంది.”

“ఏం జరిగింది”

“చీకటి గుహ తలుపులు తెరుచుకోవటంలేదు”.

“ఎవరైనా లోపలఉండి తాళం వేశారేమో”

“లోపల అసలు తాళం లేనేలేదు” అక్కడేవున్న జ్యోతిషికుడు “ఒకవేళ శివదత్తుడు లోపల ఏదైనా చేసికూర్చున్నాడేమో? లేక యెవడైనా కొత్తవాడు తాళం పనిచేయకుండా చేసిపోయాడో” అన్నాడు.

తేజసింహుడు:- శివదత్తుడు తాను లోపల బందీగా ఉన్నప్పుడు లోపలే ఎందుకు గడియవేసి కూర్చుంటాడు. దాని వల్ల అతనికి లాభమేముంది?

యువరాజు:- వనకన్య యేమైనా తంత్రంచేసిందేమో!

తేజసింహుడు:- "మీరూ విచిత్ర పురుషులే. ఆమెకు చీకటిగుహ సంగతేమి తెలుసు?

యువరాజు:- నీకు తెలియదనుకుంటాను. వనకన్య నాకో ఉత్తరం వ్రాసింది. అజాబులో తన సహాయం లేకుండా చంద్రకాంతను పొందలేవని ఘంటాపథంగా చెప్పింది. ఇంకా రెండు విషయాలుకూడా వ్రాసింది. వాటిని గురించే నేను ఆలోచిస్తున్నా. ఆవిషయాలుకూడా వనకన్య సహాయాన్ని పొందగలిగినట్టివే. నీవిప్పుడు తిరిగిరావటం నాకు అనుమానాన్ని కలిగిస్తోంది.

దేవీసింహుడు:- నాకుకూడా ఆమెపైన సందేహంగా ఉంది.

తేజసింహుడు:- ఆమెకు మనపై కోపము ఉంటే ఇంద్రజాలం పుస్తకం ఎందుకిస్తుంది. ఆ పుస్తకంతో బాటు లేఖను కూడా ఒకసారి చూడండి! అయినా ఆమె వ్రాసిన లేఖకు ఉత్తరమేది?

యువరాజు ఆఉత్తరాన్నిచ్చాడు. తేజసింహుడు దాన్ని చదివి, వనకన్య తెలివైన పనేమీ చేయలేదను కొన్నాడు. యువరాజు "వనకన్యపై నాకెంత ప్రేమవుందో మీకు తెలుసు. ఆమెను చూడకుండా ఒక క్షణంకూడా వుండ లేను. అయినప్పుడు నేను వనకన్య షరతులు ఆమోదిస్తా

ఎందుకు ఉత్తరం వ్రాయకూడదు? దానివల్ల మనకు సహాయం కూడా లభిస్తుందికదా!" అన్నాడు.

తేజసింహుడు :- మీయిష్టం వచ్చినట్లు చెయ్యండి. ఒకే వేదికమీద వివాహానికి చంద్రకాంత ఒప్పుకొన్నా జయసింహుడు మాత్రం ఒప్పుకోడు. ఆ వనకన్య యెవరో, యెవరి కూతురో ఎవరికి తెలుసు ?

యువరాజు:- ఆమె ఉత్తరంలో తాను చంద్రకాంత వంశ గౌరవానికి యేమాత్రం తీసిపోనని వ్రాసిందిగా !

ఇంతలో బైటనుండే "ఎవరో సిపాయి మీతో మాట్లాడాలంటున్నా"డని కబురు వచ్చింది. రాజకుమారుడు అతనిని లోనికి రప్పించాడు. ఆ వచ్చిన యోధుడు దర్పంగానే ఉన్నాడు. సన్నని నడుమూ, నల్లనిరంగూ, బిగించిన చొక్కా- పైజామా, టోపీ, డాలూ, కత్తి ధరించాడు. అతను యువరాజుకు నమస్కరించాడు.

అతనిని చూచినవారందరికీ నవ్వొచ్చింది. కానీ ఎలాగో ఆపుకున్నారు అందరూ.

తేజసింహుడు:- ఎవరవు నీవు? ఎక్కడనుండివచ్చావు?

యోధుడు:- నేను దివ్యుణ్ణి. రాక్షసమండలిలోనుంచి వచ్చాను. రాజకుమారుని దగ్గరనుంచి ఉత్తరానికి సమాధానం తీసుక పోవటానికి వచ్చాను.

తేజసింహుడు:- నీకు జ్యోతిషికుమా దేవిసింహుడు ఎట్లా తెలుసు ?

యోధుడు:- వండితులవారు ఈ లోకంలోనికి రాక మునుపే నాకు తెలుసు. ఇక దేవిసింహుడు నా మిత్రుడు.

దేవీసింహుడు :— ఏమోయ్ శకునపక్షీ! మనకిద్దరికి స్నేహం ఎక్కడ? అమర్యాదగా మాట్లాడుతావేం?

యోధుడు:—అమర్యాదగా మీరే మాట్లాడుతున్నారు. గురువును ఏమోయ్ గీమోయ్ అని సంబోధించటం గౌరవమా?

దేవీసింహుడు:— నీవు నాచేతుల్లో మృత్యువుకొఱకే వచ్చావు.

యోధుడు:— నేనే మృత్యువును.

దేవీసింహుడు:— నీదురహంకారానికి తగిన బుద్ధి చెప్పాలి.

యోధుడు:— నేను సామాన్యులు పంపితే వచ్చినవాణ్ణి కాను. తెల్లవారి లేస్తే నీవల్ల పదిహేడున్నరసార్లు సాష్టాంగ నమస్కారాలు అందుకోదగినవాళ్ళు నన్ను పంపించారు.

దేవీసింహుడు ఏమో అనబోయాడు. కాని తేజసింహుడు అతణ్ణి వారించి, "నువ్వు మాట్లాడకు. నీవు ఇంద్రజాలికుడివికదా అని ఏదో పరిహాసానికి మాట్లాడి వుంటాడు. అంతమాత్రానికే ఉలికిపడిపోతే ఎట్లా," అన్నాడు

యోధుడు:— ఇప్పటికీ మీకు తెలియకపోతే తెలియ చెప్పటానికి సంపుటం తీసుకొని వస్తాను" అన్నాడు.

అతని మాటలకు అందరూ నవ్వుకొన్నారు. కాని 'ఎవరా?' అనిమాత్రం సందేహిస్తున్నారు. చిత్రం ఏమిటంటే [illegible] అని సంగతి సందర్భాలన్నీ [illegible] తరఫువారికి తెలియటం, వాళ్ళ సంగతి సందర్భాలు వీళ్లకు ఏమాత్రం తెలియక పోవటం.

తేజసింహుడు యోధుణ్ణి అతిశ్రద్ధగా చూస్తున్నాడు. యోధుడు "అలా చూస్తారేమిటి! నేను మాయావిని కాను వేషం వేసుకోటానికి. అనుమానముంటే వేడినీళ్ళతో నా ముఖం కడిగి చూడండి. నేను నల్లగావున్నది ఇవ్వాళనుంచీ కాదు. నాలుగువందల సంవత్సరాలనుంచీ నేను ఇలాగే నల్లగా వుంటున్నాను."

అతని మాటలకు తేజసింహుడు కడుపుబ్బ నవ్వి "నువ్వెవరివైతే నేమిగాని చాలా గొప్పవాడివి. నిన్ను పరీక్షించవలసిన అవసరం నాకు లేదు. శత్రుపక్షివైతే విడిచిపెట్టక పోయేవాణ్ణి. నీవు మిత్రవర్గానికి చెందినవాడవని నాకు తెలుసు" అన్నాడు. అతని మాటలకు యోధుడు వంగి నమస్కరించి యువరాజుతో "నేను చాలాదూరం వెళ్ళాలి, ఉత్తరం వ్రాసియివ్వండి" అన్నాడు.

యువరాజు ఆ ఉత్తరానికి వెనుకభాగాన "నేను హృదయపూర్వకంగా ఆమోదిస్తున్నాను" అని వ్రాసి తన వ్రేలినున్న రాజముద్రికను అచ్చొత్తి అతని కిచ్చివేశాడు.

అతడు ఉత్తరాన్ని తీసుకొని శిబిరం వదలిపోయాడు.

౭

ఆనాడు తేజసింహుడు తిరిగి రావటంలోనూ, ఆ యోధుడికి ఉత్తరం వ్రాసి యివ్వటంలోను చాలా ఆలస్యమై మధ్యాహ్నమైంది. తేజసింహుడు బదరీనాథునికి స్పృహ తెప్పించు తగిన బందోబస్తులో పెట్టాడు. యువరాజుతో "మీరు స్నానం, సంధ్య, పూర్తిచేయండి. రెండు

రోజులనుండీ ఇంద్రజాలం భేదించేవని జరగలేదు" అన్నాడు.

యువరాజు సమావేశాన్ని చాలించి దినకృత్యాలు ముగించుకొని తిరిగి శిబిరానికి చేరుకొన్నాడు. అప్పటికి మిగతావారంతా వచ్చారు. ఇంకా దేనినిగురించీ మాటలు ప్రారంభం కాలేదు. ఇంతలో "బయట ఎవరో వృద్ధ నిలబడిఉన్నది. మీతో ఏదో చెప్పాలట" అన్నవార్త వచ్చింది. యువరాజు ఆమెను లోనికి రప్పించాడు. ఆమెను చూడటంతోనే తేజసింహుని నోటినుండి "పిశాచాలపుట్ట ఎక్కడో పగిలినట్లుంది" అన్న వాక్యం వెలువడ్డది.

అతనిమాట విన్న వృద్ధ కళ్ళెఱ్ఱజేసి తేజసింహునితో "సరే అయితే వెళ్ళొస్తున్నాను. నాకేమీ చెడిపోయేది లేదు. ఏమైనా చెడితే అది యువరాజుదే అవుతుంది" అని శిబిరం బైటికి నడిచింది.

యువరాజు ఆమెను తిరిగి రప్పించాడు. ఆ వృద్ధ అతి విచిత్రమైంది. దాదాపు ఎనభై సంవత్సరాలుంటాయి. అక్కడక్కడా వెండ్రుకలు తెల్లబడ్డాయి. సగం పైగా పళ్ళు ఊడి వున్నాయి. ఉన్న రెండు ముందుపళ్ళూ బాగా రెండంగుళాలు ముందుకొచ్చి ఉన్నాయి. అసహ్యంగా సాచి పట్టి ఉన్నాయి. కట్టింది ముదుకచీర. అదికూడా బాగా మాసిఉంది. ముక్కున ఇత్తడి ముక్కెర ఉంది. కాళ్ళకు కూడా అదేరకం కడియాలు పెట్టుకుంది.

"ఏం కావాలి?" అని అడిగాడు తేజసింహుడు.

"నీ కెందుకయ్యా, ఆ చెప్పేదేదో కాస్త అలసట తీర్చుకొని యువరాజుకే చెబుతా" అని ముసలిది కూర్చుండి పోయింది.

"నాతోనే చెప్పు ఏం చెబుతావో" అన్నాడు యువరాజు.

"నీతోనే చెబుతా లే. బలే చమత్కారమైనమాట" అన్నది ముసలిది దగ్గుతూ.

"ఇక గంటస్వర దగ్గి కాని చెప్పదు" అన్నాడు దేవీ సింహుడు.

"ఈ ప్రబుద్ధు డెవడు?" అన్నది వృద్ధ.

యువరాజు:—ఎవరూ మాట్లాడను లే చెప్పు.

వృద్ధ:—నే నేదిచెప్పినా నీ మంచికోసమే చెబుతాను. ఆ సంగతి తెలిస్తే నువ్వు తబ్బిబ్బై పోతావు. దానికి బదులు నీవు నాకు ఏదైనా యివ్వాలి.

యువరాజు:—నిన్ను సంతోషపెడతా లే!

"ముందు మీరు గానీ మీ మనుష్యులు గానీ నన్నేమీ అనరని మాట యివ్వండి. కొట్టటం తిట్టటం ఖైదు చేయటం మాత్రం చెయ్యకూడదు" అన్నది ముసలిది.

"నీవు చెప్పేమాట మా మంచికోసమే అయితే నిన్ను అనవలసిన పనేముంది" అన్నాడు యువరాజు.

"అవును అదీ నిజమే. కాని మీ ఇంద్రజాలికులు వెర్రివాళ్ళనుకున్నా కాని పనిని నేనొకటి చేశాను

అందుకని కాస్త భయంగావుంది. ఎక్కడ మీ మాయావులు నామీదకు ఉరుకుతాయో అని" అన్నది ముసలిది.

అందరూ 'ఏమిచేసిందబ్బా యీ ముసలిది!' అని ఆలోచించసాగారు. యువరాజు "నిన్నెవరూ ఏమీ అనరులే" అని వాగ్దానం చేశాడు. ఆ ముసలిది "నేను ఆ వనకన్య పూర్తి సమాచారం చెబుతా. మీరు ఒక గంటలో ఇంద్రజాలాన్ని భేదించి చంద్రకాంతను కలుసుకొనే ఉపాయంకూడా చెబుతాను" అన్నది.

ఆమె మాటలకు అందరూ సంతోషించారు.

యువరాజు:-అయితే త్వరగా చెప్పు.

వృద్ధ:-ముందు మన బహుమానం సంగతి తేల్చండి.

యువరాజు:-నీవు చెప్పినది నిజమైతే నీవు కోరుకున్నది యిస్తాను.

వృద్ధ:-అయితే అలా శపథం చెయ్యి.

యువరాజు:-నీవు కోరుకునే బహుమానంసంగతిచెప్పు.

"అబ్బే! ఏమీ లేదు. నువ్వు నన్ను చేపట్టాలి. అంతే! చంద్రకాంతనూ, వనకన్యనూ ఆ తర్వాత పెండ్లాడుదువుగాని. నాతో కళ్యాణంమాత్రం ఈ రోజే జరగాలి. ఎన్నాళ్ళనుంచో నేను నిన్ను ప్రేమించిఉన్నాను. నేటికి మిమ్మల్ని కలుసుకునేసరికి ముసలిదాన్నయ్యాను కూడా. ఇవాళ నువ్వు నా చేతిలో చిక్కావు. ఇక ఏ మాత్రం ఆలస్యం చెయ్యకు! ఆలస్యమైనకొద్దీ ఉన్న

యౌవనం కూడా హరించుకొని పోతుంది. యౌవనం పోయినతర్వాత పశ్చాత్తాప పడవలసింది నువ్వే."

ముసలిదాని మాటలకు యువరాజు ఉగ్రుడై కండ్లెఱ్ఱ చేసుకొన్నాడు. ఇంద్రజాలికులు పండ్లుగీటారు. యువరాజు వాగ్దానంచేసి వుండకపోతే ఆ సమయంలో దానికి ఏదుర్గతి పట్టేదో!

తేజసింహుడు జ్యోతిష్యుడితో "ఈవ్యక్తి ఇంద్రజాలికుడా ? నిజంగా వృద్ధురాలా ! గణితంవేసి చెప్పండి" అన్నాడు.

జ్యోతిష్యుడు ఏదో ఆలోచించి "ఇది వాస్తవంగా వృద్ధురాలే !" అన్నాడు.

తేజసింహుడికి మరింత కోపంవచ్చి "నువ్విక్కడ నుండి వెళ్ళిపో ! ఎక్కడి ఆడవాళ్ళూ యువరాజును ప్రేమించటం అలవాటైంది" అన్నాడు.

వృద్ధ "నామాట వినకపోతే మీరే చెడిపోతారు. నేను మీ పనులన్నిటినీ చెడగొడతాను. చూచావా, చీకటి గుహకు ఏ తాళం వేశానో ! నువ్వు బదరీనాథుణ్ణి మోసుకొని తిరిగి రావలసి వచ్చింది. ఇప్పుడు వెళ్ళి శివదత్తుని విడిపిస్తాను. ఇంకా ఇంకా ఇట్లాగే మీ నడుములు విరగగొడతాను" అని కోపంతో బయటికి నడిచింది.

తేజసింహుని సంజ్ఞతో దేవిసింహుడు ఆ వృద్ధురాలిని అనుసరించాడు. యువరాజు "తేజసింహా! ఈమె యెవరో

విచిత్రమైందిగా కన్పిస్తోంది. మూరు తాళం వేసింది తా నేనని చెబుతోందిగా" అన్నాడు.

"నాకేమీ పాలుపోకుండా వుంది" అని తేజసింహుడు అన్నాడు.

జ్యోతిష్యుడు:-ఆమె చెప్పింది నిజమైతే యిదెక్కడో మనకు పానకంలో పుడకలాగ అడ్డుతగిలేట్టుంది.

తేజసింహుడు:- దీని సత్యసంధత శివదత్తుని విడిపిస్తా నన్నప్పుడే తెలిసింది. దానిమాటే నిజమైతే నేను బ్రతికుండగా అది బ్రతికి తిరగలేదు.

జ్యోతిష్యుడు: అట్లాంటివాళ్ళను చంపాలిసిందే!

రాజకుమారుడు గట్టిగా నిట్టూర్పు విడిచి దీనంగా కూర్చున్నాడు.

తేజసింహుడు:-మీరు విచారపడకండి. మే మేమి చేస్తామో చూడండి. దేవసింహుడు ఆమె వెంట వెళ్ళాడుగా, దానిసంగతి తేల్చుకొనే వస్తాడు.

యువరాజు:- ఈ రోజుల్లో మీ మాయాజాల మెందుకూ పనికిరాకుండా పోయింది. ఇన్నాళ్ళనుంచీ వనకన్య సంగతి తెలుసుకో లేక పోయాను. ఇప్పుడీ పిశాచం ఎవరో కూడా తేల్చుకో లేకపోయారు.

ఆమాటలు ఐంద్రజాలికులకు ములుకుల్లా తగిలాయి. వారికి మాట పెగలలేదు. ముగ్గురూ శిబిరం విడిచి బైటికి వచ్చేశారు.

రాజకుమారుడు ఒంటరిగా కూర్చున్నాడు. అతని ఆలోచనలు ఒకొక్కప్పుడు చంద్రకాంత దుర్దశను గురించీ, మరొకప్పుడు వనకన్యను గురించీ, ఇంకొకసారి ఆ వచ్చిన ముసలిదాన్ని గురించీ పరుగెత్తసాగినాయి. అట్లాగే సాయంకాలమైపోయింది. సేనాపతిని పిలిచి "తేజసింహుడు ఎక్కడ"దని అడిగాడు.

అతడు "జ్యోతిష్యుని వెంటపెట్టుకొని ఎక్కడికో వెళ్ళా"డని చెప్పాడు.

౮

దేపీసింహుడు ఆ వృద్ధను వెనుక వెనుకగా వెళ్ళుతున్నాడు. ప్రొద్దు క్రుంకేవరకూ ఆమె నడుస్తూనే వున్నది; అతడు వెంబడిస్తూనే వున్నాడు. ప్రొద్దుక్రుంకినతర్వాత ఆ కురూపి ఒక కొండగుహలో ప్రవేశించింది. ఆ గుహ ముఖద్వారంలో ఒకమారు ఒక్కే మనుష్యుడు ప్రవేశింపగలుగుతాడు.

దేపీసింహుడు బహుశా అదే ఆ యిల్లనుకున్నాడు. ఒక చెట్టుక్రింద కూర్చుండిపోయాడు. రాత్రిఅంతా ఆ విధంగా కూర్చున్నాడు. వృద్ధురాలు తిరిగి ఆ ద్వారం నుంచి తిరిగి రాలేదు. ఉదయం కానటంతోటే దేపీసింహుడు కూడా ఆ గుహలో ప్రవేశించాడు. ఆగుహంతా చీకటి. అతను తడుముకొంటూ నడుస్తున్నాడు. చేతులు చాచితే ఆ గుహ గోడలు తగులుతాయి. అందులో గదులు లేవు. ఒక క్రోసుదూరం వెళ్ళిన తర్వాత ఎదురుగా

వెలుతురు కనిపించింది. అక్కడ అతనికి బయటికి వెళ్ళటానికి మార్గం కనిపించింది. బయటికి వెళ్ళాడు.

అక్కడ ఒక నదిఒడ్డున పర్వతం కనిపించింది. నలుదిక్కులా అడవి. అక్కడనుంచి అతనికి సైన్యంలో చేరుకొనటానికి మార్గం కనిపించలేదు. ఒక జాము ప్రొద్దెక్కింది. 'వృద్ధురాలు మోసగించిం' దనుకున్నాడు. ఆమెను వెంటాడకుండా గుహబయట కూర్చుండిపోవటం పొరపాటయిం దనుకొన్నాడు. చివరికి చేసేదేమీ లేక అదే సొరంగం నుంచి వెనక్కు తిరిగివచ్చి మకాం చేరుకున్నాడు.

సేనాపతితో పింగేంద్రుడు మాట్లాడుతున్నాడు. దేవిసింహుని చూచి మిగతావారంతా బయటికి వచ్చేశారు. యువరాజు "ముసలిదాని సంగతేమి"టని అడిగాడు. దేవిసింహుడు పిచ్చివాడి లజ్జతో "అది బలే మోసంచేసిం"దని చెప్పాడు. యువరాజు నవ్వుతూ "ఏమిటా మోసం" అని అడిగాడు. దేవిసింహుడు ముసలిది తప్పించుకొని పోయిన సంగతంతా చెప్పి యువరాజును ఉదాసీనుణ్ణిగా చేశాడు. సేనాపతిని "గురువుగారూ, జ్యోతిష్యుడు ఎక్కడికి వెళ్లాడ"ని అడిగాడు. సేనాపతి "యువరాజు మీరంతా పనికి మాలినవాళ్ళనేసరికి కోపంతో ఎక్కడికో వెళ్ళార"ని చెప్పాడు. "కోపంతో గురువుగారు వెళ్ళారంటే యేదో ఒక పని చేసుకొనే వస్తా" డన్నాడు దేవిసింహుడు.

ఇంతలోనే యిద్దరు అక్కడికివచ్చి చేరుకున్నారు. వాళ్ళముఖాలుచూస్తే యేదో ఘనకార్యం సాధించినట్లే అనిపిస్తున్నది.

"ఏమిటి సంగతి ?" అని యువరాజు తేజసింహుణ్ణి అడిగాడు.

"మంచివార్త!"

"చెప్పు మరి."

"విని మీరేమిచేస్తారు ?"

"అయితే అది వినరానిదా ?"

"ఇప్పుడు చెప్పను."

"కొద్దిగానైనా చెప్పు!"

"ఏమీ చెప్పను."

"మీరైనా చెప్పండి గురువుగారూ" అని దేవీసింహుడు అడిగాడు.

"గురువుగారూ అని పిలిస్తే చెపుతాననుకున్నావా?" అన్నాడు తేజసింహుడు.

ఇంతలో 'శివదత్తుని మంత్రి వచ్చా'డని కబురు వచ్చింది. యువరాజు తేజసింహుణ్ణి ఒకసారిచూచి 'ఆయన వెంట వున్న మనుష్యుల్ని బయటేవుంచి ఒక్కడినే ప్రవేశ పెట్టు' అన్నాడు.

శివదత్తునుహారాజు మంత్రి శిబిరంలో ప్రవేశించి నమస్కరించి యువరాజు ముందు కానుకలు సమర్పించుకున్నాడు. యువరాజు వాటిని తాకి వుంచాడు.

"మా మహారాజు తరఫున మీకీ కానుకలు తెచ్చాను. మీ దయవల్ల, ఆ పరమాత్ముని ఆశీర్వాదంవల్ల మా రాజు గారు విడుదలయ్యారు. రావటంతోటే ఆయన దర్బారు ఏర్పాటుచేసి 'నేటినుండి వీరేంద్రసింహుని సామంతరాజును' అని ప్రకటించుకున్నారు. తన మాయూవులనూ, అనుచరులనూ మీకు లోబడి వుండవలసిందిగా ఆజ్ఞాపించారు. ఆ తర్వాత ఈ కానుకలను, ఈ లేఖలనూ మీకు అంద జేయ వలసిందిగా నన్ను పంపించారు" అని చెప్పాడు మంత్రి.

యువరాజు కానుకలను తేజసింహునికి అప్పగించి మంత్రి కూర్చోవలసిందిగా సంజ్ఞ చేశాడు. మంత్రి తన లేఖను యువరాజు చేతికిచ్చి కూర్చున్నాడు.

కొద్దిగా పొద్దుపోయింది. యువరాజు దర్బారు ఏర్పాటు చేశాడు. సమావేశం నిండుగా ఉన్నది. తేజ సింహానికి ఉత్తరాన్నిచ్చి గట్టిగా చదవమన్నాడు. పొడు గైన సంబోధన వాక్యం తర్వాత—

"నేనే విధంగా చీకటి గుహనుండి విముక్తుడ నైన ప్పటికీ మీ దయవల్లనే విడుదలయినానని చెప్పవలసి వుంటుంది. మీ చేత ఖైదు చేయబడిన నేను మీ దయవల్లనే విడిపింప బడ్డానని వ్రాస్తున్నందుకు మీరు ఆశ్చర్య పడ వచ్చు. కాని మీరు ఆ విధంగా ఏమీ ఆలోచించకండి. ఏ విధంగానూ ఇప్పుడు నేను నా విముక్తిగాథను మీకు చెప్పదలచ లేదు. సమయం వచ్చినప్పుడు ఆ సంగతి మీ అంతట మీరే తెలుసుకొని అది మీ కృపాపాత్ర మానో

కాదో తెలుసుకోగలరు. నా తప్పుల నన్నిటిని క్షమించి నా కానుకలను స్వీకరించగలరని ఆశిస్తున్నాను. ఈ రోజు నుండి మా ఐంద్రజాలికులుగానీ, మరెవరుగానీ మీకు ఏవిధమైన కష్టాలనూ కలుగచెయ్యరని హామీ యిస్తున్నాను. మీరు కూడా ఈ విషయాలను విశ్వసించండి.

తమ,
శివదత్తుడు."

ఉత్తరాన్ని విన్నవారందరూ సంతోషించారు. యువరాజు ఖైదీగా ఉన్న బదరీనాద పండితుణ్ణి రప్పించాడు. అతని బంధాలను ఊడదీయించాడు. అతనిని అతిథిగా ప్రకటించి రెండురోజులు ఉండి పొమ్మన్నాడు; నాటికి దర్బారు ముగించాడు.

## 9

ఆరాత్రి యువరాజు శిబిరంలో నలుగురూ సమావేశ మయ్యారు. శిబిరంలో తేజసింహుడు, దేవీసింహుడు, జ్యోతిష్కుడూ, వీరేంద్రసింహుడు తప్ప ఇంకెవ్వరూ లేరు. యువరాజు "తేజసింహా! ముసలిదాని మాట నిజమే అయింది."

తేజసింహుడు :అవునండీ; కాని శివదత్తుని ఉత్తరం వల్ల వేరేవిషయాలేవో ఉన్నట్టున్నాయి.

దేవీసింహుడు: అతడే వ్రాశాడని యేమిటి? ఏమైనా మోసం జరిగిందేమో!

జ్యోతిష్కుడు: ఇప్పుడు బాగా ఆలోచించిగాని యే పని చెయ్యటానికి వీలులేదు. శివదత్తుడు మైత్రీ భావాన్ని ఎంతగా ప్రకటించినా శత్రువును ఒక కంట కనిపెట్టి వుండటం మంచిది!

తేజసింహుడు:- మీరు జ్యోతిష్కులుగదా శివదత్తుడు ఉత్తరాన్ని ఎటువంటి మనస్సుతో వ్రాశాడో చెప్పండి!

జ్యోతిష్కుడు:- ఆలోచించినమీదట "ఈఉత్తరాన్ని మంచి మనస్సుతోనే వ్రాశాడుగాని ముందు ముందు అతని మనస్సు ఎట్లా మారుతుందో చెప్పలేము.

తేజసింహుడు:- ఈ గోజుల్లో ఎవరి బుద్ధులు ఎట్లా ఉంటాయో గుర్తుపట్ట లేకుండా ఉన్నాము. అతడీ ఉత్తరాన్ని హృదయపూర్వకంగానే వ్రాసిఉంటే తానెట్లా విడుదలైందీ ఎందుకని ఉల్లేఖించలేదు?

జ్యోతిష్కుడు:- దానికికూడా ఏదో కారణం ఉండి వుంటుంది.

యువరాజు:- శివదత్తుడు ఎట్లా విడిపించుకున్నాడో మీరు జోస్యం చెప్పలేరా?

జ్యోతిష్కుడు:-చెప్పలేను; ఇంద్రజాలం మీద జోస్యం పనిచెయ్యదు.

తేజసింహుడు:- అంతా అగమ్యగోచరంగా ఉంది.

దేవీసింహుడు:- ఆ వృద్ధ భూతంకూడా తక్కువ మాయావిని కాదు.

జ్యోతిష్కుడు:- కాదు ఎప్పటికీ కాదు. దానికి జాలం తెలియనే తెలియదు.

యువరాజు:- ఏదో ఒకటి జరుగుతుందిగాని రేపటి నుంచి వ్యూహాన్ని భేదించే పని చెయ్యాలి" అన్నాడు. అందరూ తమ తమ డేరాలలోనికి వెళ్ళిపోయారు.

మరునాడు వ్యూహాన్ని భేదించేపని మొదలైంది. వెంట ఇంద్రజాలం పుస్తకాన్ని తెచ్చుకున్నారు. వసారా లోని చీకటిగది తాళాన్ని తీసి లోనికి వెళ్ళి తోటలో కొద్దిగా త్రవ్వివిడచిన గోతి దగ్గరకు వెళ్ళారు. తిరిగి త్రవ్వటం ప్రారంభించారు. ఎనిమిది తొమ్మిది చేతుల లోతు త్రవ్వేసరికి ఒక పెట్టె బయటపడింది. దాని మూతకు తాళం ఉన్నది. ఆ తాళంలోనికి మట్టి వెళ్ళకుండా చుట్టూ రాగిరేకు ఉన్నది. యువరాజు పెట్టెను బయటికి తియ్యాలని చూంచాడు గాని అది రాలేదు. మట్టిని తీసినకొద్దీ ఆ పెట్టె క్రిందిభాగాన వెడల్పు పెరుగుతూవచ్చింది. ఎంత ప్రయత్నించినా అది భూమిలో ఎంతలోతున పాతుకొని ఉన్నదో తెలియ లేదు. ఆఖరికి యువరాజు ఇంద్రజాలం పుస్తకాన్ని తీసి పేజీలు తిరగవేసి—

"తాళపుచెవికి తాడుకట్టి తోటలో ఈడ్చుకుంటూ పోతున్నప్పుడు అది ఒకచోట నేలకు అతుక్కుపోతుంది. అక్కడ కొద్దిగా మట్టితీసి తాళంచెవితీసి దాని తర్వాత భూమిని తవ్వాలి. ఆ విధంగా ఒక పెట్టె కనిపించేదాకా త్రవ్వాలి. పెట్టె పైభాగం కనిపించిన తర్వాత త్రవ్వటం

ఆపాటి. నిజానికది వాకిలిగాని పెట్టెకాదు. తోట మధ్యగా వున్న జలయంత్రానికి తూర్పుదిక్కుగా ఏడుచేతులదూరాన త్రవ్వితే ఒక మట్టికుండ బయటపడుతుంది. ఆ కుండలో దాని తాళంచెవి ఉంటుంది. దానితో చీకటిగది వాకిలిని తెరవండి. మెట్లుంటాయి లోనికి - వెళ్ళవచ్చు."

"చీకటిగది లోపల చాలా చీకటిగాక పొగ కూడా నిండివుంటుంది. జాగ్రత్త! వెలుతురుకోసం నిప్పుగాని, కాగడాసంచాగాని వెలిగించారంటే ఆ పొగ నుండి చాలా ప్రమాదం జరుగుతుంది. ముక్కుకు గుడ్డలడ్డంపెట్టుకొని లోనికి దిగండి. తారాడుతూ గోడు దారి తగిలితే అటు నుంచి బయటికి త్వరగా వెళ్ళండి. పొగను ఎక్కువగా పీల్చవద్దు. కొద్ది దూరంలో మెరుస్తున్న గది కనిపిస్తుంది. ఆ గదిలో అన్ని వస్తువులూ కనిపిస్తాయి. ఆగది అంతటా క్రిందనుంచి పైదాకా తీగలు అల్లుకొని ఉంటాయి. ఆలోచించకుండా కత్తితో ఆ తీగలను త్వర త్వరగా నరికి ఆ గది దాటి పొండి."

అంతవరకూ చదివి యువరాజు విడిచిపెట్టాడు. ఆ తర్వాత ఇంద్రజాలం పుస్తకంలో వ్రాసివున్న ప్రకారం అందరూ తీగలున్న గదికూడా దాటారు.

ఎంతగా ముక్కు మూసుకున్నా అందరూ పొగ కొద్దిగానో గొప్పగానో పీల్చారు. దాని ప్రభావంవల్ల రెండు గంటలపాటు స్పృహ లేకుండా పడిపోయారు. లేచినతర్వాత దేవీసింహుడు జ్యోతిష్కుణ్ణి "ఇంకా ఎంత సమయముంది?"

అని అడిగాడు. అతడు "నాలుగు గంటలు" అన్నాడు. ఇంకేమీ పని జరగదని చెప్పి ఆనాటికి తాళంవేసి తిరిగి వచ్చారు.

శిబిరంలో కొంతసేపు విశ్రాంతి తీసుకొన్నతర్వాత యువరాజుకి అడవిలో కొంచెంసేపు అటూ ఇటూ తిరగాలనిపించింది. ఆ ప్రకారం ఐంద్రజాలికుల్ని ముగ్గురినీ వెంట బెట్టుకొని తాను గుఱ్ఱంమీద బయలుదేరాడు.

ఒక క్రోసెడు దూరం వెళ్ళినతర్వాత అక్కడ ఒక చెట్టుకి కాగితం ఒకటి అతికించబడిఉంది. తేజసింహుడు దానిని చూచి "అక్కడ ఎవరో ఏదో కాగితం అంటించారు. దానిమీద ఏదో వ్రాసి ఉన్నది" అన్నాడు. దేవీసింహుడు ఆ చెట్టుదగ్గరికి వెళ్ళి దానిని చదవటం ప్రారంభించాడు. దానిలో—

"నే నెటువంటిదాన్నో యిప్పుడైనా తెలిసిందా? ఒక గంటలో ఇంద్రజాలాన్ని భేదించి, చంద్రకాంతను నీకు అప్పగిస్తాను. నన్ను పెళ్ళిచేసుకోమంటే చేసుకోకపోయావు. నేనే కోపంతో వచ్చి శివదత్తుని విడిచిపెట్టాను. ఇప్పుడైనా పెళ్ళిచేసుకుంటావా? లేదా? ఒకవేళ నీకు ఇష్టమైతే సమాధానం వ్రాసి ఈ చెట్టుకే అతికించు; వెంటనే నేను నీదగ్గరికి వస్తాను. ఇప్పటికీ నీకు ఇష్టంలేకపోతే చంద్రకాంతని, చపలని చంపేసి నిన్ను బేజారెత్తిస్తాను. నాకు ఇంద్రజాల వ్యూహానికి వెళ్ళి రావటం చాలా తేలిక. రోజుకి పదమూడు సార్లు వెళ్ళి రాగలను. నా యౌవనాన్ని, నీమంచిని

దృష్టిలో పెట్టుకో! నాముందు నీ ఇంద్రజాలికుల మాయా జాలం పనిచెయ్యదు. ఆరోజున తేజసింహుడు నా వెనకనే వచ్చి యేం చెయ్యగలిగాడు? మొండి పట్టువదలి నా మాట విను! నేను చెప్పటంవల్లనే శివదత్తుడు నీ స్నేహితుడైనాడు. ఇప్పుడైనా తెలుసుకో!

నీ—సూరజముఖి"

దానిని చదివి తేజసింహుడు మిగతా వారిని కూడా పిలిచి చదవమన్నాడు. చివరి 'సూరజముఖి' అన్న పేరు చదువుకొని అందరూ నవ్వుకున్నారు. యువరాజు "మొసలి కురూపికి తన పేరు బ్రహ్మాండంగా పెట్టుకుంది" అన్నాడు. "చూచారా, యేమి వ్రాసిందో" అన్నాడు జ్యోతిష్కుడితో తేజసింహుడు.

జ్యోతిష్కుడు "ఏది ఏమైనప్పటికి ఆ కురూపి యువరాజును ఏమీ చెయ్యదని నేను గట్టిగా చెప్పగలను. ఈ ఉత్తరాన్ని గురించి మీరు ఏమీ ఆలోచించకండి" అన్నాడు.

యువరాజు "మీరు చెప్పేది నిజమే కాని, అది చెప్పింది చేసి చూపిస్తుందికదా?" అని ముందుకు నడిచాడు. అక్కడ ఎన్నో చెట్లకు ఇదేవిధంగా కాగితాలు అంటించటం కనుపించింది. యువరాజు ఉదాసీనుడై తిరిగి శిబిరానికి చేరుకొన్నాడు.

రాత్రికి తేజసింహుడు యువరాజుతో "గస్తీ తిరగటానికి వెళ్ళుతున్నా"మని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ రాత్రికి యువరాజు పండుకొన్నాడన్న మాటేకాని అనేక సమస్యలు

బుట్టలో తిరిగి నిద్రపోలేక పోయాడు. ఇంతలో వాకిలిదగ్గర శబ్దమై అటు చూచాడు. అక్కడ తేజసింహుడున్నాడు. అతనితో "ఏమైనా సంగతులున్నాయా?" అన్నాడు. అతడు "భలేవస్తువు చేతికి చిక్కింది" అన్నాడు. ఇద్దరూ బయటికి వచ్చారు. వారికి కొంతదూరంలో ఒకపెద్ద గుంపు కనిపించింది. దివిటీలు వెలుగుతున్నాయి. అక్కడకు చేరుకున్నారు. యువరాజు రావటంతోనే గుంపు తొలగింది. అతను దివిటీల వెలుగులో రక్తసిక్తమైయున్న క్రూరసింహుని శవాన్ని చూచాడు. గుండెలో గుచ్చుకున్న కత్తి అట్లాగే ఉంది. "ఆఖరికి ఇతనిని చంపేశావా?" అన్నాడు తేజసింహునితో. తేజసింహుడు "ఇట్లా ఎన్నడైనా మేము హత్యలు చేశామా?" అన్నాడు. "అయితే ఎవరు చంపారు?" అన్నాడు యువరాజు. "నాకేమి తెలుసు" అన్నాడు తేజసింహుడు. యువరాజు "అయితే శవాన్ని ఎక్కడనుంచి తీసుకొచ్చారు?" అని అడిగాడు.

తేజసింహుడు "మేము గస్తీతిరుగుతూ శిథిలగృహం వెనుకకు వెళ్ళాం. దూరంగా మనుష్యులు నిలబడినట్లు కనిపించింది. మేము దగ్గరకు వెళ్ళేసరికి పారిపోయారు. చూస్తే అక్కడ ఈ శవం పడివుంది. అప్పుడు దేవీసింహునితో డోలీ తెప్పించి ఎత్తుకొని తీసుకువస్తున్నాము. ఇంకా చావలేదు. కాని, బ్రతకడు" అన్నాడు.

"చాలా ఆశ్చర్యంగా ఉంది! సరే ఆ కత్తి తియ్యండి" అన్నాడు యువరాజు.

తేజసింహుడు క్రూరసింహుడి గుండెలో గ్రుచ్చుకొన్న కత్తిని లాగి నీళ్ళతో కడిగి యువరాజు వద్దకు తెచ్చాడు. దివిటీ వెలుతురులో దానిని శ్రద్ధగా పరిశీలించేసరికి పిడిమీద 'చపల' అని పేరు చెక్కబడి వుండటం కనుపించింది. తేజసింహుడు ఆశ్చర్యంతో "చపల అని చెక్కబడివుంది! ఈ కత్తిని నేను ఎరుగుదును కూడా. ఇప్పుడు చపల నడుముకు కట్టుకొనివుండేది. అయితే ఆమె ఇక్కడికి ఎట్లా వచ్చింది?" అన్నాడు.

దీపసింహుడు:- చపల పాపం, చంద్రకాంతతో గుహలోపడి ఉన్నది.

యువరాజు:- అయితే ఆమెదగ్గరనుండి ఈ కత్తిని ఎవరు తెచ్చారు?"

తేజసింహుడు:- అంతేకాక క్రూరసింహుడు కూడా ఇక్కడికి ఎందుకు వచ్చాడో ఆలోచించాలి. ఇతను శివదత్తుని బంటు. అదీ కాక అతనిమంత్రి ఇక్కడకు వచ్చి శివదత్తుడు మాతో శత్రుత్వం పూనుకున్నాడని కూడా చెప్పాడు.

యువరాజు:- శివదత్తుని మంత్రిని పిలవండి.

తేజసింహుడు వెళ్ళి మంత్రిని తీసుకొచ్చాడు. అతనితోపాటు ఘతపహసింహుడు కూడా వచ్చాడు.

మంత్రి క్రూరసింహుని శవాన్ని చూచి, "ఈ క్రూరుడికి తగినశిక్షే జరిగింది. వీడి మిత్రులు అహ్మదు, నాజింలు మిగిలియున్నారు. వాళ్ళకుకూడా ఈ గతిపడితే నేను చాలా

సంతోషిస్తాను" అన్నాడు. యువరాజు "ఇతడు మీ దగ్గర ఇప్పుడు లేడా?" అని అడిగాడు.

"లేడు. శివదత్తుడు విడుదల అయినతరువాత మీతో శత్రుత్వాన్ని మానుకున్నానని ప్రకటించినప్పుడు వీడిముత్తా చునాగుగఫనుంచి పారిపోయారు. మహారాజు వెతికించారు. కాని వీళ్ళు దొరకలేదు" అని మంత్రి చెప్పాడు.

చూస్తుండగానే క్రూరసింహుడు రెండు, మూడు సార్లు ఎగిరిపడి ప్రాణంవదిలాడు. యువరాజు చపల కత్తిని తేజసింహునికి ఇచ్చి శవాన్ని ముకాంలోనికి చేర్పించమని చెప్పి తన శిబిరానికి చేరుకున్నాడు.

# 10

ఉదయం రాజకుమారుడు స్నానసంధ్యాదులు ముగించి, ఇంద్రజాలికులు ముగ్గురితో ఇంద్రజాలాన్ని భేదించటానికి వెళ్ళాడు. నిన్నటి మోస్తరుగానే చీకటిగది తాళం తీసి చిన్నగదిలోగుండా తోటలో ప్రవేశించాడు. నల్లరాతి వసారాలో కూర్చున్నారు. ఇంద్రజాలం పుస్తకం తెరిచి—

"నువ్వు చీకటిగదిదాటినతర్వాత తీగలున్నగదిలోని తీగలు నరికిన కొంతసేపటికో పొగపోవటం ప్రారంభిస్తుంది. నల్లరాతి మండపంలోని పాలరాతి సింహాసనంమీద చతుర ప్రాకారపు రాతిమీద ఏదో వ్రాసిఉండటం నువ్వు చూచే ఉంటావు. దానిని ముట్టుకున్నవాడికి శరీరం జలదరిస్తుంది. అంతేకాక స్పృహతప్పి పోతాడుకూడా. కాని యీ గుణా

లన్నీ ఆ తీగల్ని నరకటంతో పోతాయి. కారణం ఆ తీగలు సింహాసనంవరకూ ప్రవేశించి ఉండటమే. ఆ తీగలు మందుల లోను, ప్రేలుడు దినుసులలోను మారిఉన్నాయి. రెండవ రోజు తిరిగి పొగవున్న గదిలోకి వెళ్ళు. ఇప్పుడక్కడ పొగ వుండదు. దివిటీ వెలిగించి చూడు, అక్కడ నీకోసం ధన రాసులు కుప్పలుగా వుంటాయి. అంతా బయటికి తెచ్చుకో. నీ యిష్టంవచ్చినచోట వుంచుకో. ధనరాసులను పూర్తిగా చేరవేయ నంతవరకు ఇంకొకపని చేయవద్దు. ఆ సింహాసనం మీద చతుర ప్రాకారపు రాతిని తీసుకొని వెళ్ళు. అది నిజా నికి ఒక పెట్టె. దానిలోపల చాలా వింతవస్తువు లున్నాయి. దాని తాళంచెవి ఈ వ్యూహంలోనే నీకు దొరుకుతుంది” రాజకుమారుడు ఈ విషయాన్ని తిరిగి, తిరిగి చదువు కొన్నాడు. తరువాత పొగఉన్న గదిలో ప్రవేశించటానికి సిద్ధమైనారు. ఇంద్రజాలికులు ముగ్గురూ దివిటీలు వెలిగించి యువరాజుతో కలిసి చీకటిగదిలో ప్రవేశించారు. లోపల నుండి తీగలున్న గదిలో చేరారు. ఇప్పుడా గదిలో వెలుతు రున్నది. తీగలు తెగి ఉన్నాయి. అది చాలా విశాలమైన గది. వందలకొద్ది వెండిపెట్టెలు, ఇనపపెట్టెలు కనబడు తున్నాయి. ఒకప్రక్కన గోడకి తాళంచెవులగుత్తి వ్రేలాడు తున్నది.

రాజకుమారుడు తాళంచెవులను తీసుకొని ఒకపెట్టెను తెరచి చూచాడు. అందులో వజ్రాల పట్టెడలు, స్త్రీలనగలు నిండుగఉన్నాయి. రెండవపెట్టె తెరచాడు. అందులో విలువైన

రత్నాలుపొదిగిన పిడులతో కత్తులు, చురకత్తులు వున్నాయి. అతను దానినికూడా చూసి సంతోషంతో "నిజంగా ఈ గదిలో చాలా సంపద వుంది. వీటిని ఇక్కడ తెరువవలసిన అవసరం లేదు. ఈపెట్టెల నన్నిటిని బైటికి తీసుకొనిపదండి. అక్కడ ఒక్కొక్కటిచూచి నౌగధానికి పంపిద్దాం. సాధ్యమైనంత త్వరగా వీటిని ఖాళీచెయ్యాలి" అన్నాడు తేజసింహునితో.

"ఎంత తొందరగా తీపినా, కనీసం పది రోజులన్నా పడుతుంది. ఇక మీరు ఒక్కొక్కటిచూచి నౌగధానికి పంపించాలంటే నెలలు పడుతుంది. అప్పుడు వ్యూహాన్ని భేదించేపని ఆగిపోవచ్చు. అందుకని వీటిని చూడా పెట్టకుండానే నౌగధకు పంపించడం మంచిది. పనులన్నీ పూర్తి చేసుకొని నెమ్మదిగా చూడవచ్చు. దీనివల్ల ఇతరులకు ఇందులో మనకు ఏమి దొరికిందో కూడా తెలియకుండా ఉంటుంది. అప్పుడు ఎవరికళ్ళూ కుట్టవు. ఇందులో ఎంత ధనం దాచిపెట్టివుందో అర్థం కాకుండావుంది. దీనిని రక్షించటానికే ఇంత పెద్ద ఇంద్రజాలాన్ని సృష్టించారు" అన్నాడు తేజసింహుడు.

ఈ అభిప్రాయాన్ని అందరూ ఆమోదించారు. నలుగురూ తాళంవేసి తిరిగి వచ్చేశారు. ఇవ్వేళ వీరు ఇంద్రజాలం పని చాలా తొందరగా ముగించారు. యువరాజు ఇంద్రజాలానివి, ఖజానావి తాళంచెవులు తేజసింహునికి

ఇచ్చి ఆ పెట్టెలను నాగధానికి చేర్పించే ఏర్పాటు చేయమని చెప్పాడు.

# 11

తేజసింహుడు ఆ పెట్టెలను బయటికి తీయించి నాగధానికి పంపించటానికి చాలా రోజులు పట్టింది. ప్రతిరోజు శిథిల గృహానికి కాపాలా పెట్టి వ్యూహములోకి వెళ్ళి ఒక జాము ప్రొద్దు ఉండేవరకు పనిచేసి తిరిగి వచ్చేవాడు. ఆ సంపదంతా నాగధానికి చేరిపోయేవరకూ వ్యూహాన్ని భేదించే పని ఆగిపోయింది.

ఒకనాటి రాత్రి రాజకుమారుడు నిద్రిస్తున్నాడు. సగం రాత్రి గడచింది. వనితా చంద్రకాంతల ఆలోచనలతో అతనికి నిద్రపట్టలేదు. చివరికి మంచి నిద్రపట్టి ఉదయం రెండుగంటల ప్రొద్దెక్కేవరకూ పండుకొనే ఉన్నాడు.

లేచి చూచేసరికి అతడు తాను నిద్రించిన శిబిరంలో కాక అక్కడికి సమీపానగల ఒక అడవిలో ఉన్నాడు. కాని అతడున్నచోటు అలంకరించిన ఒక చక్కని గది. ఆశ్చర్యంతో అటు, ఇటు చూచాడు. అతనికది ఒక పెద్ద భవనంగా కనిపించింది. దానికి మూడువైపుల పాలరాతి గోడలూ నాల్గవవైపు అందమైన పెద్ద పెద్ద వాకిళ్ళూ ఉన్నాయి. ఆవాకిళ్ళు ఇప్పుడు మూసిఉన్నాయి. గోడలకు ఇంకా క్రొవ్వు వత్తులు వెలుగుతున్నాయి. నలుదిక్కులా అందమైన స్త్రీల చిత్రాలు వ్రేలాడుతున్నాయి.

యువరాజు దృష్టి ఒక పెద్ద చిత్రంమీద పడింది. తనలో తాను "అరే! యీ చిత్రం తప్పకుండా నా ప్రేయసిదే అయివుంటుంది. ఏమి సౌందర్యం!" అనుకున్నాడు.

యువరాజు ఆ చిత్రందగ్గఱకు వెళ్ళి నిలబడ్డాడు. వాకిళ్ళన్నీ మూసివున్నాయి. ప్రతివాకిలి పైభాగాన దిడ్డికంతలు కనుపించాయి. వాటికి గాజు తలుపు లున్నాయి. వాటిగుండా వచ్చిన వెలుగు కిరణాలు పెద్ద చిత్రంపై పడుతున్నాయి. ఆ చిత్రాన్ని చూడడానికే రాజకుమారుడు లేచివచ్చాడు. నిజాని కది రాజకుమారి చంద్రకాంత చిత్రం.

రాజకుమారుడు ఆ చిత్రాన్ని చూస్తూ తిరిగి తనలో 'ఈ చిత్రం ఎంత మనోహరంగా ఉన్నది! కొనదేరి విశాలము లయిన కన్నులు! ఆ కన్నులకు కాటుక! అరే! గులాబి రేకులవంటి చెక్కిళ్ళు, సన్నని పెదవులపై చిగురుటాకుల ఎరుపు. ఆ చిరునవ్వు, ఆ కర్ణభూషణాలు, పాపటబొట్టు, ముక్కున నత్తు, ఉన్నాగానీ కంఠహారమాత్రం కన్నుల పండువుగా కనుపిస్తుంది. చేతులకు గాజులు, బాజాబందులు, వజ్రపు టుంగరాలు ఎంత చక్కగా అమర్చాడు! ఆ యిరువైపుల చపలా, చంపా గడ్డాలమీద వ్రేళ్లు పెట్టుకొని ఎంత ఒయ్యారంగా నిలబడ్డారు!' అని 'అయ్యో చంద్రకాంతా! ఎక్కడ వున్నావో కదా!' అనుకొన్నాడు. ఇంకా అతడు అక్కడే ఆ చిత్రాన్ని చూస్తూ నిలబడిపోయాడు.

ఎక్కడనుంచో మంజీరధ్వనులు వినిపించాయి. రాకుమారుడు ఉలికిపడ్డాడు. పైన చాలా కిటికీలు ఉన్నాయి. అయితే ఈ శబ్దం ఎక్కడనుంచి వచ్చింది! ఈ యింట్లో ఏ స్త్రీ ఉన్నది! కొంతసేపు రాజకుమారుడు నిస్తబ్ధుడై తిరిగి ఆలోచించసాగాడు.

“అసలీ చోటెక్కడిది? ఇక్కడికి నేనెట్లావచ్చాను? ఎవరు ఎత్తుకొని వచ్చారు? వాళ్ళెవరో నా చంద్రకాంత చిత్రాన్ని చూపించి పుణ్యం కట్టుకున్నారు. ఒకవేళ నేను స్వప్నంలో లేనుకదా! తప్పకుండా ఇది కలే. పోయి పండుకొంటాను.”

అని రాకుమారుడు తిరిగి ఆ మంచంమీదకు వెళ్ళి పండుకొన్నాడు. కళ్ళు మూసుకున్నాడు. కాని, నిద్ర పట్టలేదు. ఇంతలో మళ్ళా ఘల్లు ఘల్లుమనే అందెల రవళి రాకుమారుని చెవిని పడింది. ఇప్పుడు వెంటనే లేచి వాకిళ్ళ దగ్గరకు వెళ్ళి ఏడు వాకళ్ళనూ కొట్టాడు. అన్నీ తెరుచుకున్నాయి. ఒక పచ్చని తోట కనిపించింది. చాలా ప్రొద్దెక్కింది.

ఆ తోట పూర్తిగా అడవి లతలతో, పువ్వులతో నిండి ఉంది. మధ్య ఒక కోనేరు ఉంది. రాతిగట్టు ఉన్న ఆ కోనేటి వద్దకు రాకుమారుడు వెళ్ళాడు. ఒకవైపున దాని సుందరమైన మెట్లు లోపలకు దారితీస్తున్నాయి. ఆ మెట్లకు పై భాగాన రెండు నేరేడుచెట్లు దట్టంగా వ్యాపించిఉన్నాయి. ఆ చెట్ల నీడ మెట్లపై పూర్తిగా వ్యాపించటమేగాక కొద్దిగా

నీటిమీదకు కూడా ప్రవేశించింది. ఆ రెండు చెట్ల క్రింద పాలరాతి అరుగులు ఉన్నాయి. ఎడమవైపు అరుగుమీద మెత్తని తివాచీ ఉన్నది. ఆఅరుగుకు ప్రక్కగా పక్షిముక్కు ఆకారంలో వున్న ఒక వెండికడవ, దాని దగ్గరగానే ఒక వైపు చీల్చివున్న దంతకాష్ఠం ఉన్నాయి. అక్కడే చిన్న వెండి కుర్చీమీద తువ్వాలు, కట్టుపంచె కూడా ఉన్నాయి. అక్కడే చాలా ఖరీదైన దుస్తులుకూడా ఉన్నాయి.

కుడివైపున ఉన్న అరుగుమీద ఒక వెండి కుర్చీలో ఒక కూజా, కొన్ని సామానులూ ఆ సామానులలో చక్కగా తోమిన పంచపాత్ర, ఉద్ధరిణ, చిన్నచిన్న గిన్నెలు ఉన్నాయి. దాని కెదురుగా ఆసనమొకటి ఉన్నది. అది ఉన్నితో తయారైనది. అక్కడే ఒక గంటకూడా ఉన్నది.

రాజకుమారుడు అక్కడ నిలబడి తన నక్కడికి ఎవరు తీసుకువచ్చారో, అసలా ప్రదేశం ఎక్కడిదో అని ఆలోచించసాగాడు. అంతేగాక ఆ ఉద్యానవనం ఆ గది ఎవరిదో కూడ అర్థంకాలేదు. అంతలో అతనిదృష్టి ఓ సామాగ్రి ఉంచిన చెట్టువైపున పడింది. ఆ చెట్టుకి ఒక కాగితం అంటించ బడింది. దానిమీద—

"వీరేంద్ర సింహ యువరాజా! ఈ సామానులన్నీ నీ కొరకే. ఈ కోనేటిలో స్నానంచేసి యీ వస్తువులన్నిటిని ఉపయోగించుకో. నీవు మా అతిథివి" అని ఉన్నది.

యువరాజుకు మరీ ఆశ్చర్యం కలిగింది. సామానులు తీర్చిదిద్దినట్టు పెట్టి ఉన్నాయి. కాని మనుషులు మాత్రం

ఎక్కడా కన్పించటంలేదు. బహుశః ఇది గంధర్వులుండే ప్రదేశమేమో? ఇక్కడిక్కడే వాళ్ళు తిరుగుతూ ఉండవచ్చు- అనుకొని మొదట తోటలో తిరిగి చూద్దామని బయులుదేరాడు అప్పటికే బాగా ప్రొద్దెక్కింది. ఏదైనా వాకిలి కన్పిస్తే బయటికి పోదామనుకున్నాడు. కాని వెంటనే తన నిక్కడికి తీసుకొని వచ్చినవారిని, ఆ ప్రదేశాన్ని గూర్చిన వివరాలను తెలుసుకొని వెళ్ళాలనే జిజ్ఞాస అతనిని అక్కడే బంధించి ఉంచింది.

రాజకుమారుడు నిద్రనుండి మేలుకొన్న గది ఉద్యానవనానికి పశ్చిమాన ఉన్నది. తూర్పుదిక్కున భవనమేదీ లేదు. అందుకే ఉదయించిన సూర్యుడు స్పష్టంగా కన్పిస్తున్నాడు. అతడు దాదాపు నడిసత్రికి చేరుకున్నాడు కూడా. రాజపుత్రుడు తిరుగుతూ తిరుగుతూ ఆ తోటకు ఉత్తర భాగానికి చేరుకొనేసరికి అక్కడ ఒకగది కన్పించింది. ఆ గది తూర్పుదిక్కుగా ఉన్న ఒకగదితో కలిసి ఉన్నది.

రాజకుమారుడు ఆ గదిలోనికి కూడా వెళ్ళాలని చూచాడు. గాని ఆ గది తలుపులు మూసిఉన్నాయి. చివరకు దక్షిణభాగం చేరుకున్నాడు. అక్కడ అతడు కాలకృత్యాలు ముగించుకొని కోనేటివద్దకు చేరుకొన్నాడు. దంతధావనంచేసి స్నానం ముగించుకొని అక్కడఉన్న ఖరీదైన దుస్తులను ధరించాడు. రెండవ అరుగుమీద కూర్చొని పూజాదులు ముగించాడు.

ఆ పనులన్నీ ముగించుకొని అతడు నిద్రనుండి మేల్కొన్న గది చేరుకొన్నాడు. కాని దాని తలుపులు మూసి ఉన్నాయి. అక్కడినుంచే రెండవవైపు గదిలోనికి ప్రవేశించాడు. ఇంతకుముందు మూసికొని ఉన్న ఆ గది యిప్పుడు తెరిచుకొన్నది.

అది చలవరాయి పరచినగది. ఇప్పుడే ఆగదిని ఎవరో పరిశుభ్రంచేసి వెళ్ళారు. మధ్యగా ఒక కాశ్మీరపు తివాచీ పరిచి ఉన్నది. దానికిముందు భోజనపదార్థాలు వెండి బంగారు పళ్ళెరాలలో ఎవరో వడ్డించిపోయారు. తివాచీ మీద ఉన్నచీటిని తీసి యువరాజు చదువుకున్నాడు. ఆ చీటీలో—

"మీరేమీ సందేహించకండి. ఈ యిల్లు మీ మిత్రుడిది. ఇక్కడ మిమ్మల్ని అన్నివిధాలుగా గౌరవిస్తాము. ఇప్పుడు మీరు భోజనం ముగించుకొని ప్రక్కన ఉన్న గదిలోకి వెళ్ళండి. అక్కడవున్న మంచంమీద పండుకొని విశ్రాంతి తీసుకోండి."

దానిని చదువుకున్న యువరాజు ఆశ్చర్యానికి మేర లేదు. తన్నింతగా గౌరవించటానికి పూనుకొన్న వారెవరు? ఎవరు అదృశ్యంగా ఉండి తనకు యీ విధమైన సకలమర్యాదలు చేస్తున్నారో అతని ఊహకు అందలేదు. తనకు కనిపించకుండా ఉండదలచిన వారు అసలు తన్నెందుకిక్కడికి తీసుకొని వచ్చారోకూడా అర్థంకావటంలేదు. ఈ ఆలోచనలన్నింటితో అతనికి భోజనం చెయ్యటమూ, మానటమూ అని

సందేహం వచ్చింది. చివరికి భోజనంమీదికి చెయ్యి చాచాడు. కాని వెంటనే ఏదో ఆలోచన తట్టి వెనక్కి తీసుకున్నాడు. అతని వ్యవహారానికి అదృశ్యంగా పెద్ద నవ్వొకటి వినిపించింది. అతడు భయభీతుడైనాడు. పైకిచూచాడు. అక్కడేమీ కనిపించలేదు. కాని "ఇది ప్రమాదమైన చోటేమీ కాదు. భోంచెయ్యండి" అని వినిపించింది. చేసేది లేక చివరికిభోజనాన్ని ముగించుకొన్నాడు. భోజనపదార్థాలు అతి స్వాదువులుగా ఉన్నాయి. సంతుష్టిగా భోంచేసి చెయ్యి కడుగుకొని చీటీలో వ్రాసివున్న ప్రకారం ప్రక్కగదిలోనికి వెళ్ళాడు. అక్కడ తల్పమొకటి అలంకృతమై ఉన్నది. దానిపై రాజకుమారుడు పవళించాడు.

రెండుగంటల ప్రొద్దుపోయింది. అతడు నిద్రనుంచి లేచి బయటికి వచ్చాడు. చీకటిరాత్రి అయినా దీపాల వెలుతురు అతిప్రకాశవంతంగా ఉన్నది. ఆ వెలుతురులో అతనికి ఎదురుగా తోట కనిపించింది. ఆ తోట తాను పగలు తిరిగినది కాదు. అది యెంత పెద్దదో కూడా తెలియటం లేదు. పెద్ద పెద్ద చెట్లు మాత్రం ఉన్నాయి. ఆ వెలుతురులో అతనికి అక్కడ చాలామంది సుందరాంగనలు తిరుగుతున్నట్లు కనిపించింది. వాళ్ళు పాడుతున్నారు; ఆడుతున్నారు. ఆ యువతుల మధురవిలాసాలను రాజకుమారుడు విప్పారిన కన్నులతో తిలకిస్తున్నాడు. ఆ సుందరినులు దరహాస పరిహాసాలతో ఒయ్యారాలొలికిస్తూ వనం నలువైపులా కలయదిరుగుతున్నారు. నెమ్మదిగా అతని దగ్గరకువచ్చి నిలబడ్డారు.

సోగకన్నుల్లో అనురాగామృతం వర్షిస్తూ అతని సౌందర్యమంతా చూపులతో త్రాగుతున్నట్లు వీక్షించ సాగారు. అధరపల్లవాలు చలించకుండానే అన్యోన్యంగా సంభాషించుకొంటున్నారు. వారి హావభావాలను బట్టి బహుశః వారు రాజకుమారుని సౌందర్యానికి ముగ్ధులైనారని చెప్పకతప్పదు.

ఆ యువతులలో ఒకతె ముందుకువచ్చి "మీరు నిరంకుశులై యీ వనంలో ఎందుకు ప్రవేశించారు?" అని అడిగింది.

రాజకుమారు డామెను సమీపాన్నుంచీ చూచి అన్నాడు "నాకు ఈ తోట యెవరిదో తెలియదు. ఒకవేళ తెలిస్తే మీరైనా చెప్పండి."

యువతి "ముందు నే నడిగినదానికి సమాధానం చెప్పండి. ఆ తర్వాత చూద్దాం" అన్నది.

యువరాజు:— నే నిక్కడికి ఎట్లా వచ్చానో నాకే తెలియదు.

యువతి:— చెల్లీ! కొద్దిగా యిటురా! పాప మీ అమాయకులకు ఇక్కడికి తా మెట్లావచ్చారో కూడా తెలియదట!

యువతులందరూ అతనిని చుట్టుముట్టారు. "మీ రెవరు? ఇక్కడికి ఏం దొంగిలించటానికి వచ్చారు? ఈ మతిమరుపు సహజమా? కృత్రిమమా?" అని ప్రశ్నలవర్షం కురిపించారు. ఒక యువతి "ఈ చోరశిఖామణి యేమైనా దొంగిలించారేమో సోదాచెయ్యండి" అన్నది. మరొక

యువతి "అవును. ఏదో దొంగిలించే ఉంటారు" అన్నది. మరొకామె "బహుశః వీరెవరో రాకుమారులై ఉంటారు" అన్నది. మొట్టమొదటి యువతి "పోనీ మీరు కట్టుకొన్న ఈ బట్టలు ఎక్కడ దొంగిలించారో చెప్పండి" అని సూటిగా ప్రశ్నించింది. వారి దండయాత్రకు రాజకుమారుడు భయాశ్చర్యవశుడైనాడు. దిక్కుమాలిన పరిస్థితులలో చిక్కుకొన్నానని కళవళించాడు. 'బహుశః ఈ సాహసిక యువతులే నన్ను ఇక్కడికి ఎత్తుకొనివచ్చి ఈ దొంగతనాన్ని ఆపాదిస్తున్నా'రని భావించసాగాడు. చిట్టచివరకు "మీరే నన్నిక్కడకు అపహరించుకొనివచ్చారు" అన్నాడు. ఒకతె "మిమ్మల్నిక్కడకు తీసుకురావలసిన అవసరమేమిటి? మీరు మాకు మెచ్చి అందలం ఎక్కిస్తారని తెచ్చామా? ఇన్ని మాటలు మాకెందుకు చెబుతారూ; దొంగతనం చేయటానికి వచ్చి?" అన్నది.

యువరాజు:—నాకిక్కడికి వచ్చే మార్గం కూడా తెలియదు. త్రోవ చెబితే వెళ్ళిపోతాను.

మఱొక యువతి:—పాపం! నంగనాచులు! ఇక్కడికి ఏ త్రోవను వచ్చారో ఆ త్రోవను వెళ్ళలేరా? వచ్చినప్పుడు తెలిసిన మార్గం ఇప్పుడు తెలియదా?

ఇంకొక యువతి:- ఇదంతా పలాయనానికి పన్నాగం.

మఱొకయువతి:- లాభం లేదు. ఈయనను బంధించి తీసుకుపోవలసిందే.

యువరాజు:- అయ్యో, నన్నెక్కడికి తీసుకుపోతారు!

ఇంకొక యువతి:—ఏలినవారిదగ్గరకు.

యువరాజు:—వారి నామధేయం?

ఇంకొకామె:— వారి నామధేయం తెలుసుకొనే సాహసం కూడానా?

యువరాజు:— వారి పేరుకూడా చెప్పకూడదా?

ఇంకొకతె:—అవును. చెప్పకూడదు. చెప్పినట్లయితే కఠిన శిక్షకు గురికావలసిందే.

యువరాజు:— అయితే మీ యేలినవారితో మీ రెల్లా సంభాషిస్తారు?

మరొకయువతి:— శ్రీవారి చిత్తరువుముందుతప్ప ఎదురుగా మాట్లాడం.

యువరాజు:—ఇతరులు 'మీరుఎవరికొలువులోనివా' రని ప్రశ్నించితే ఏంచేస్తారు?

మరొకతె:—మా రాకుమారి ప్రతికృతి కంఠంలో ధరించి ఉంటాము. దానివల్ల చూచినవారికి మే మెవరి పరిచారికలమో తెలుస్తుంది.

యువరాజు:— ఇక్కడ చాలామంది రాజపుత్రికలు ఉన్నారా? దాసీజనం గుర్తుపట్టలేక పోవటానికి?

మరొకతె:— లేదు. ఇక్కడ ఇద్దరు రాజకుమారికలు ఉన్నారు. ఆ ఇద్దరి పేర్లు ఉచ్చరించగూడదు. గుర్తుపట్టవలసి వచ్చినప్పుడు మెడలో చిత్రపటాన్ని చూపిస్తాం.

యువరాజు "పోనీ ఆ చిత్రాన్నైనా చూపించండి" అని అడిగాడు. ఆ పరిచారికలలో ఒకతె తన మెడలో

ఉన్న చిత్రాన్ని తీసి చూపింది అది చంద్రకాంతది. అయితే వీరు చంద్రకాంత పరిచారికలా? కాదు కాదు. ఆమె యిక్కడి కెట్లా రాగలుగుతుంది? ఆమెది విజయగడ రాజ్యం. 'పోనీ ఈ ఇల్లెవరిదో తెలుసుకొందాం' అనుకొని యువరాజు "ఈ పట్టణం పేరైనా చెప్పండి" అని అడిగాడు.

ఒకతె:— ఇది చిత్రనగరం ఇక్కడ అందరికీ మెడలలో తలలో చిత్రం వ్రేలాడుతూ ఉండడం చేతనే దీనికి ఈ పేరు వచ్చింది.

యువరాజు:— ఈ పేరు ఎప్పటినుంచి వచ్చింది?

మరొకతె:— వేల సంవత్సరాలనుంచీ దీనికిదే పేరు. తరతరాలుగా ఈచిత్రాలు ప్రజల కంఠాలను అలంకరిస్తూనే ఉన్నాయి. మా పూర్వులనుంచి యీ చిత్రం నాకంఠాన్ని అలంకరించింది.

యువరాజు:-అయితే అప్పటినుంచీ ఈ రాజపుత్రికే రాజ్యమేలుతున్నదా? తల్లిదండ్రులు లేరా?

మరొకతె:— ఏం చెప్పగలం? మేము ఎన్నడైనా ఆ దేవిని సందర్శిస్తేనా? అప్పటినుంచీ యిప్పటివరకూ ఈ దేవిమాత్రమే ఉన్నదో! ఇంకెవరైనా గతించారో! మా రాణి బాలమాత్రమేనో, నవయౌవనంలో ఉన్నదో, వృద్ధురాలే అయిందో మాకు తెలియదు.

యువరాజు:— దర్బారు నిర్వహించేది ఎవరు?

వేరొకతె:— మా రాజకుమారి చిత్రపటం ఒకటి ఉన్నది. దాని కెదురుగా దర్బారు సమావేశాలు జరుగు

తాయి. ఏమైనా ఆజ్ఞలు జారీచేయవలవస్తే ఆ పటంనుంచి ధ్వని వినపడుతుంది.

యువరాజు:—ఇలాంటిచిత్రం ఇంతవఱకు కనీ, వినీ, యెఱుగం. సరేకాని, ఆదర్బారుకు నన్నుకూడా కొనిపొండి!

ఇంకొకతె:—ఆ మాటలు మీరు చెప్పనక్కఱలేదు. ఇప్పుడు మిమ్ములను బంధించి కొనిపోయేది అక్కడికే."

యువరాజు:- చిత్రంపటంగా మాత్రమే గోచరించే మీ రాణికి నేను చేసిన అపచారం ఏమిటి? నన్ను బంధించటం ఎందుకు?

మఱొకతె:- ఎందుకా? ఏమో! అది కొలువులోనే తెలుసుకోవచ్చును. మారాణి అందఱినీ పరికిస్తూనే ఉంటుంది. కాని ఆమెపై ఇంతవరకు ఎవరిదృష్టి పడలేదు. మేము అంతఃపురంలో గృహసమ్మార్జనం, జలాహరణం, భవనాలంకరణం, ఆహార వస్తుపచనం, వడ్డన మొదలయిన పనిని చేస్తూనే ఉంటాము. అదృశ్యగానేఉండి, దేవి నిత్యకృత్యాలు పూర్తిచేసుకుంటుంది. కొన్ని వేల సంవత్సరాల నుంచీ ఇలా జరుగుతూఉన్నది. ఈదేవిధంగా ఇంకెంతకాలమైనా జరుగుతూ ఉంటుంది.

ఇంకొకతె:- చెల్లీ! యెన్నిటికని నీవు సమాధానాలు ఇచ్చుకుంటూ కూర్చుంటావు? ఈ విధంగానైనా వారు తమ్ము తాము రక్షించుకోవాలని చూస్తున్నారు.

ఒక తె:- అలా కాదు. రాజ వంశాలంకారుడుగా కన్పిస్తున్న వీరికి తగిన సమాధానాలు ఇవ్వాలి. అంతేగాక సగౌరవంగానే వీరిని బంధించి తీసుకొని వెళ్లాలి.

మఱొక తె:- వేషాన్నిబట్టే రాజపుత్రు లనుకోవటం పొరబాటేమో? తల్లిదండ్రులసంగతి అడిగి తెలుసుకో? (యువరాజుతో) మీ రెవరికుమారులు? మీనామధేయం?

యువరాజు:-నా పేరు వీరేంద్రసింహుడు. మా తండ్రి నాగధ రాజ్యాధిపతి సురేంద్రసింహ మహారాజు.

ఆమాటలు వినగానే అందఱు సంతోషపడి తమలో తాము "అయితే! ఈయనను తప్పకుండా పట్టుకొనిపోవాలి. మనకు చాలా బహుమానాలు దొరుకుతాయి. ఈయనను బంధించవలసిందిగా చాలా కాలం క్రిందట మన రాజ్యంలో చాటింపు వేశారు కూడా. మన యింద్రజాలాన్ని భేదించి ధనరాసుల్ని లూటీచేసింది ఈయనే. ఇక ఈయనతో మాట్లాడకూడదు. తొందరగా కాళ్ళూ, చేతులూ కట్టి ప్రభుత్వానికి అప్పగించాలి. బహుశః ఇప్పుడు దర్బారు సమావేశం జరుగుతూ ఉంటుంది. ఈ రాత్రి గడిస్తే మళ్ళీ రాత్రికిగాని దర్బారు జరగదు" అనుకొన్నారు.

వారి మాటలకు రాజకుమారుని ఆలోచనలు స్తంభించాయి. చివరకతడు "నన్ను బంధించటమెందుకు? మీ వెంట నేనే వస్తాను" అన్నాడు.

"అయితే మఱీ మంచిదే" అన్నారు పరిచారికలు. వారందఱూ మొత్తం తొమ్మిదిమంది. నలుగురు రాజ

కుమారుడికి ముందూ, నలుగురు వెనకా నడుస్తున్నారు. ఒకతె ముందుగా ఈ వార్త చెప్పటానికి వెళ్ళింది. అందఱూ కలిసి తోటకు ఒక మూలగా వెళ్ళారు. అక్కడ బయటికి వెళ్ళటానికి ఒక చిన్న వాకిలి ఉన్నది. ఆ వాకిలి దాటారు. దాని తర్వాత మఱొక తోట ఉన్నది. అది ఇంకా సముజ్వలంగా ఉన్నది. అక్కడ కాపలా వాళ్ళు, బంగారు, వెండి భల్లాలు పుచ్చుకొని అటూ ఇటూ తిరుగుతున్నారు. వారు గాక ఇంకా చాలమంది ఉన్నారు. ఈ స్త్రీలను ఎవరూ అడ్డుపెట్టలేదు. దాని తర్వాత ఆ పరిచారికలు ఒక మందిరంలో ప్రవేశించారు. అది సర్వాలంకార సంశోభితంగా ఉన్నది.

అందరికంటె ముందుగా రాజకుమారుని దృష్టి ఎదురుగా ఉన్న చిత్రపటంమీద పడింది. ఆ పటం బంగారు సింహాసనంమీద అలంకృతమై ఉన్నది. చంద్రకాంత కిరీటాన్ని ధరించి స్వయంగా సింహాసనంమీద కూర్చుందా అనిపిస్తుంది. ఆమె శిరస్సుపై ముత్యాలగొడుగు ఉన్నది. ఇరువైపులా సజీవ సింహాలు రెండు కూర్చుండి వున్నాయి. అవి వికృత వదనాలై హుంకరిస్తున్నాయి. ఆ తర్వాత ఉచిత వేషభూషణాలు ధరించిన సైన్యాధిపతులు సింహాసనానికి ఎదురుగా తలలువంచి కూర్చుండిఉన్నారు.

రాజకుమారుడు మానందాల్చి చిత్రపటానికి ఎదురుగా నిలబడ్డాడు. అతనిని పట్టుకొని తెచ్చిన స్త్రీలు వెనుక నిలబడి ఉన్నారు. పటం వెనుకనుండి "వీరెవరు?" అనే

శబ్దం వచ్చింది. అతనిని పట్టితెచ్చిన స్త్రీలలో ఒకతె "ఈయన వీరేంద్రసింహుడట. ఉద్యానవనంలో తిరుగుతుండగా పట్టుకొన్నాం. ఇంద్రజాలాన్ని ఛేదించిం దీయనే!" అన్నది. మళ్ళా పటం వెనుకనుంచి "అది నిజమైతే యీతనిని విచారించవలసి ఉన్నది. ఇప్పుడితన్ని తగురక్షణలోనుంచి, అనుమతి అయినప్పుడు తిరిగి ఇక్కడ ప్రవేశపెట్టండి" అని వినబడింది.

దాసీజనం అతనిని ఒక మంచి గదిలోనికి తీసికొని పోయారు. అది సకలవస్తు సమృద్ధమై ఉన్నది. యువరాజు ఆలోచనా సముద్రంలో మునిగి ఉన్నాడు. కొంతసేపటికి దాహమై, లేచి అటూ ఇటూ చూచాడు. వెంటనే ఒక దాసి ఎదురుగా నిలబడి "ఏమి ఆజ్ఞ?" అన్నది. యువరాజు చేతితో సంజ్ఞ చేసి, మంచినీరు కోరాడు. బంగారులోటాతో దాసీ నీళ్ళు తెచ్చి యిచ్చింది. అవి త్రాగగానే, అతని మెదడు సహితం చల్లబడింది. తిరిగి స్పృహ లేకుండా అక్కడే ఆసనంమీద పండుకొన్నాడు.

## 12

వీరేంద్రసింహ యువరాజు కనపడకపోవటం అతని పరివారంలో ఆందోళనకరమయింది. తేజసింహుడూ, దేవీసింహుడూ, నలుదిక్కులా వెదికారు. కాని ప్రయోజనం లేకపోయింది. ఆనాటి పగలు గడచినతర్వాత తేజసింహుడితో జ్యోతిష్కుడు "గవ్వలు వేసి చూస్తే, యువరాజును ఎవరో స్త్రీలు ఎత్తుకొని పోయినట్లు తెలుస్తోంది. వాళ్ళు

సౌగంధ రాజ్యపు సరిహద్దుల్లో తమ యింట్లో బంధించి ఉంచారు. అంతకంటే యెక్కువ తెలియటం లేదు" అన్నాడు.

తేజసింహుడు:- సౌగంధ రాజ్యం మనదేకదా! అక్కడ వీరేంద్రునికి శత్రువులు లేరు. అక్కడవున్న సామంతరాజు లందరూ సురేంద్రసింహ మహారాజుకు చేదోడు వాదోడుగా వున్నప్పుడు రాకుమారుణ్ణి బాధించే వాళ్ళెవరు ఉంటారు?

చాలాసేపు ఆలోచించిన తర్వాత తేజసింహుడు యువరాజును వెదకటానికి సిద్ధమయ్యాడు. అతనిని, దేవీ సింహుడూ, జ్యోతిష్కుడూ అనుసరించారు. వెళ్ళిపోయే సమయంలో శివదత్త మహారాజు మంత్రిని చునారగఢకు పంపించారు. ఇంద్రజాల పుస్తకాన్ని సేనాని రక్షణలో నుంచి పోయారు. అర్ధరాత్రి దాటేసరికి ఇంద్రజాలికులు ముగ్గురూ అయిదుకోసుల దూరం నడిచారు. సూర్యోదయం కాగానే ముగ్గురూ అక్కడ ఒక అడవిలో మారు వేషాలు వేసుకొన్నారు. ఆ పగలంతా కూడా నడిచి సౌగంధం సరిహద్దుల చేరారు. వాళ్ళు ముగ్గురూ, తమ సంగతి యెవరికీ తెలియకుండా రాజకుమారుణ్ణి వెదకాలని నిశ్చయించారు. ముగ్గురూ మూడు దోవలా వెళ్ళి చాలా మందిని అడిగి, అనేక భవనాలు వెదికి, ఎన్నో ఉద్యాన వనాలుచూచి అతనిని కనుక్కోలేకపోయారు. మూడోనాడు ముగ్గురూ కలిసి మారువేషంలో సురేంద్రసింహుని దర్బారులో ప్రవేశించారు. ఆ సమయంలో తేజసింహుని తండ్రి జీతసింహుడు అక్కడ చేరిన కొంతమంది రహస్య పరిశోధ

కులను "ఎందుకు మీరు భయపడి వచ్చారు?" అని ప్రశ్నించాడు. ఒకడు "రాజకుమారుడు మాయమైపోయిన వృత్తాంతాన్ని అతనికి చెప్పాడు. జీతసింహుడు 'తేజసింహుడు ఎక్కడికి వెళ్లాడ'ని అడిగాడు. ఆ రహస్య పరిశోధకుడు "ముగ్గురూ రాజకుమారుని వెదకటానికి వెళ్లారు. వాళ్లు వెళ్ళిన తర్వాత మన సైన్యానికి మహాకష్టంవచ్చింది" అన్నాడు.

"ఏమికష్టమ"ని జీతసింహుడు అడిగాడు. దానికి సమాధానంగా శివదత్తుడు దండెత్తి సైన్యాన్ని వశపరచుకున్న వృత్తాంతాన్ని చెప్పాడు. అక్కడే దాగి ఉన్న తేజసింహుడికి ఆ వార్త ఆశ్చర్యాన్ని కలిగించింది. జీతసింహుడు "శివదత్తుడు మనతో మైత్రి చేసుకున్నాడని లోగడ మీరే వచ్చి చెప్పారుగా!" అని అడిగాడు. "అప్పటికి ఆ వార్త నిజమే. కాని, ఇప్పుడు శివదత్తుడు నమ్మించి ద్రోహాన్ని చేశాడు." అని రహస్య పరిశోధకులు చెప్పారు "వాళ్ళ దండయాత్రవల్ల చివరికేం జరిగింది?" అని అడిగాడు జీతసింహుడు.

"ఒకజాము కాలం సైన్యాధిపతి వాళ్ళను బాగా ఎదుర్కొన్నాడు. చివరకు శివదత్తుడు సేనాధిపతిని గాయపరచి పట్టుకొన్నాడు. అతను పట్టు పడగానే మన సేనలు చెల్లాచెదురై పోయాయి" అని సమాధానం వచ్చింది. ఈ సమాచారమంతా సురేంద్రసింహుడు విన్నాడు. సేనాధిపతి పట్టుబడ్డాడని తెలియగానే అతనికి పట్టలేనంతకోపంవచ్చింది. మంత్రితో "సైన్యాన్ని తీసుకొని వెంటనే దండయాత్రకు

బయలు దేరండి. ఆ ద్రోహిని చంపకుండా వదలిపెట్ట గూడదు" అన్నాడు.

జీతసింహుడు "ప్రభువులు దండయాత్రకు సిద్ధమై నట్లు తెలిస్తే, చెల్లాచెదరై పోయిన మన సేనలు కూడా తిరిగి కలుస్తాయి" అన్నాడు.

ఇదే సందర్భంలో మరొక యిద్దరు వేగులవాళ్ళు వచ్చి "మన సేనాధిపతిని బంధించగానే శివదత్తుడు కూడా కనిపించకుండా మాయమైనాడు. అతని మంచంమీద 'ఈ విశ్వాస ఘాతకునికి తగినశిక్ష జరుగుతుంది. యావ జ్జీవం కారాగారంలో మగ్గుతాడు' అని వ్రాసి చీటీ ఒకటి దొరికింది. ఆతర్వాత శతహాసింహుడుకూడా విముక్తుడైనాడు. మన సేనలు తిరిగి కలుసుకున్నాయి" అని చెప్పారు. ఆ వార్త విని రాజు మంత్రిదిక్కుకు చూచాడు.

జీతసింహుడు "ఏది యేమైనా అప్పుడే జయసింహ మహారాజు చునారగఢ్‌కు దండెత్తి వెళ్ళాడు. మనంకూడా వెళ్ళి శాశ్వతంగా చునార్‌గఢ్‌ని వశపరచుకోనటం మంచిది" అన్నాడు.

మహారాజు "నీవు చెప్పింది నిజమే. అట్లాగే చేద్దాం. ఇన్నాళ్ళు ఆపని యువరాజు చేస్తాడని, అతనికే ఆకీర్తి లభి స్తుందని, ఆగి చూచాను. కాని యిక లాభం లేదు" అన్నాడు. ఈ మాటలు విన్నతర్వాత ఇంద్రజాలికులు ముగ్గురూ బయ టికి వెళ్లారు.

తేజసింహుడు:- ఇప్పుడేం చేద్దాం?

దేవసింహుడు:- వీరేంద్రసింహుని వెదుకుదాం.

తేజసింహుడు:- నీవు సైన్యందగ్గరికి వెళ్లు. మేము యువరాజును వెదుకుతాం.

జ్యోతిష్కుడు:- మనం ఇప్పుడు శివదత్తుణ్ణి బంధించిన చీకటి గుహకు వెళ్ళటం మంచిది.

తేజసింహుడు:- దానివాకిలి రావటం తెలీదుగా!

జ్యోతిష్కుడు:- ముందుకు వెడదాం. ఏమైనా ఉపాయంతో వచ్చినా రావచ్చు.

తేజసింహుడు:- ఒకవేళ వాకిలి తెలుసుకున్నా ప్రయోజనమేముంది?

జ్యోతిష్కుడు:- ముందు నడువనయ్యా.

తేజసింహుడు దానికి అంగీకరించాడు. పిదప ముగ్గురూ ప్రయాణమై వెళ్ళారు.

## 13

వీరేంద్ర సింహుడు నెమ్మది నెమ్మదిగా స్పృహ తెచ్చుకున్నమీదట లేచి చూస్తే అతడొక రాతిబండమీద ఉన్నట్లు తెలిసింది. దానికి నలువైపులా ఎత్తయిన పర్వతాలు, మధ్యగా సెలయేఱు; ఆ సెలయేటి ఒడ్డున నేరేడు చెట్టు. అతనికి అది చీకటి గుహగా చూడగానే అర్థమైంది.

యువరాజు పరుగుపరుగున చంద్రకాంత చపలఉన్న పర్వతందరికి వెళ్లాడు. వాళ్ళిద్దరూ అదేవిధంగా ఆయెత్తయిన పర్వతంమీద కూర్చుండి ఉన్నారు. వారిని చూడటం

తోనే అతనికి హృదయం నీరైంది. ఆ పరిదీనమూర్తులను చూడలేక ఒక చెట్టుచాటును చేరి తనలో "ఈ స్థితిలో ప్రేయసిని సందర్శించటం ఎల్లాగు? సంభాషించట ఎల్లాగు? ఇంకా 'ఇంద్రజాలం భేదింపలేదా?' అని అడిగితే ఏమని చెప్పను? ఇంకా పూర్తికాలేదని చెప్పనా? ఇక్కడికి నీవు ఎట్లా వచ్చావని అడిగితే నేనేమని చెప్పేది? ... అదేమి? ఇక్కడ శివదత్తుడు కనిపిస్తున్నాడు? తాను విడుదలైనట్లుగా తనమంత్రిద్వారా కబురంపించాడుగా? ఇదంతా ఏమిటి? అని ఆలోచించుకోసాగాడు.

ఇంతలో అతనికి ఎదురుగా తేజసింహుడు దేవీసింహుణ్ణీ, జ్యోతిష్కుణ్ణీ వెంటబెట్టుకొని రావటం కనుపించింది. అతను వారి కెదురుగా వెళ్ళాడు. తేజసింహుడు యువరాజును గమనించి పరుగెత్తుకొని వెళ్ళి అతని పాదాల మీద వ్రాలాడు.

యువరాజు తేజసింహుణ్ణి లేవనెత్తి ఇట్లా అన్నాడు. "మామా! చంద్రకాంత అనాటివలెనే జీర్ణవస్త్రాలతో ఉదాసీనంగా కూర్చున్నది. ఆమె పక్కన చపల కూర్చుండి తన చీర చెఱగుతో ఆమె కన్నీళ్ళు తుడుస్తున్నది."

తేజ:- మీరు వారితో మాట్లాడారా?

యువరాజు:- లేదు. వారి యెదుటికి వెళ్ళటమూ; మానటమూ అసలు ఆలోచిస్తున్నాను.

తేజ:- ఎన్నాళ్ళనుంచి మీరీ ఆలోచనలో పడ్డారు?

యువరాజు:- ఈక్షణం నుంచే.

8—B.

తేజ:- (ఆశ్చర్యంగా) ఈ గుహకు మీరిప్పుడే వచ్చారా? ఇన్నాళ్ళనుండి మీరెక్కడ ఉన్నారు? మీరు స్త్రైణ్యంపడిన బాలానాగేంద్రుండికదా? ఇప్పుడు మీరిక్కడ ఉండటంచూస్తే చంద్రకాంతప్రభగల మాణిక్యవతో అనాడే ఇక్కడికి ఎవరికి చెప్పకుండ వచ్చారనుకున్నాను.

యువరాజు:- కాదు. నాకు తెలిసి నేను వెళ్ళలేదు. ఎవరో నన్ను ఎత్తుకొనిపోయారో తెలియదు.

తేజ:- మీరు చెప్పేది నిజమేనా?

యువ:- ముమ్మాటికీ నిజం.

అని తనపరిస్థితిని యువకుడు తేజసింహునకు చెప్పాడు. అతడు చెప్పినంతసేపు ముగ్గురు నోళ్లు తెరుచుకొని విన్నారు. అతడు చెప్పటం పూర్తియైన తరువాత తేజసింహుడు జ్యోతిష్కుడితో "ఈ తమాషా ఏమిటో మీరు కొంచెము చెప్పండి!" అన్నాడు.

జ్యోతిష్కుడు:- నాకూ తెలియుటం లేదు.

యువ:- ఇంద్రజాలాన్ని భేదిస్తున్నప్పుడు కలిగిన ఆశ్చర్యము నాకే రెండుమూడు రోజులనుంచి కలిగింది.

దేవి:- భేదిస్తే ప్రాణం పోయేదిగదా?

యువ:- ఇంకొక తమాషా! శివదత్తుడు ఇక్కడే వున్నాడు.

తేజ:- అతడెక్కడ?

యువ: అదిగో చెట్టుక్రింద.

తేజ: ఆఁ! నిజమే. వెళ్ళి అతనితో మాట్లాడుదాం.

యువ:- అతనికి దగ్గరగానే చంద్రకాంత పర్వతం మీద ఉన్నది. మొదట ఆమెను పలుకరిద్దాం. నేను ఆమె ఏదైనా అడిగితే చెప్పలేని పరిస్థితిలో పడిపోయాను.

తేజ:- ప్రేమికులు ఆవిధంగానే అయిపోతారు. మీకు బదులుగా నేను మాట్లాడుతాను; పదండి.

నలుగురూ శివదత్తుని దిక్కుగా వెళ్ళారు. మొదట చంద్రకాంత, చపల కూర్చుండిఉన్న పర్వతం దిగువకు వెళ్ళారు. రాజకుమారి మఱొకవైపు చూస్తున్నది. చపల వీరిని చూచింది. ఆమె లేచి నిలబడి గొంతెత్తి రాజకుమారుని పరిస్థితులు అడిగింది. దానికి సమాధానం యువరాజు ఇచ్చి చంద్రకాంత బాగోగులు అడిగాడు. చపల రాజకుమారి దైన్యపరిస్థితిని ఎఱుకపఱచింది.

చపల మాట్లాడుతూండటం గమనించిన చంద్రకాంత క్రిందకు చూచి యువరాజుకు అంజలిబంధంతో నమస్కరించి నిలబడింది.

యువరాజు:- రాజకుమారీ! నువ్వు ఇంకా కొన్నాళ్లు ఓపికపట్టు. ఇంద్రజాలం చాలావఱకు ఛేదించాము. కొద్దిగా మిగిలి ఉన్నది. అనేక కారణాలవల్ల నేనిక్కడకు వచ్చాను. తిరిగి ఇంద్రజాలంవద్దకు వెళ్ళుతున్నాను.

చపల:- ఇన్నాళ్ళనుంచీ మీరు తన స్థానములో మఱొకతెను ప్రతిష్ఠించుకొన్నారో ఏమోనని రాజకుమారి అడుగుతున్నది. అదే నిజమైతే రాజకుమారికి ఇక్కడ ఉన్న

దానికంటే తన ప్రేమ భగ్నంకావటమే హెచ్చు దుఃఖం కలిగిస్తుంది.

తేజసింహుడు యువరాజును చూచి చిరునవ్వుతో "నిజం చెప్పమంటావా?" అన్నాడు.

యువరాజు సమాధానం ఇవ్వలేదు. సాశ్రునయనుడై తేజసింహుని దిక్కుగా తిరిగి చేతులు జోడించాడు. తేజసింహుడు నవ్వి యువరాజు ముకుళిత హస్తాలను విడదీసి చపలతో ఇల్లా అన్నాడు. "రాజకుమారుణ్ణి గురించి ఎటువంటి శంక పెట్టుకోవద్దని రాకుమారికి చెప్పు."

చపల:- ఇవ్వేళ మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు?

తేజసింహుడు:- శివదత్త మహారాజుని చూడటానికి. ఇతడు విడిపించుకొన్నట్లుగా అక్కడకు మాకు వార్తలందాయి.

చపల:- ఎవరైనా యితని వేషం వేసుకొన్నారేమో కాని, యితడుమాత్రం ఇక్కడే ఉన్నాడు.

తేజ:- ఇక శివదత్తుడితో మాట్లాడుతాము.

చపల, తేజసింహుడు మాట్లాడుకోవటం శివదత్తుడు విన్నాడు. అతడు యువరాజుదగ్గరకువచ్చి ఏదో చెప్పబోయాడు. కాని, చపలను, చంద్రకాంతను చూచి ఆగిపోయాడు.

తేజ:- ఆగిపోయావేం! చెప్పు!

శివ:- ఇప్పుడు చెప్పను.

తేజ:- ఎందుకని ?

శివ:- చెప్పకుండావుంటే బ్రతుకగలుగుతాను.

తేజ: చెప్పితే నిన్ను వధించేవా రెవరు ?

శివ:- ఏమైనా నేను చెప్పను.

వెంటనే తేజసింహుడు మొలనుండి చిన్న కత్తిని నూశాడు. పైనుండి చపల "ఆగు, ఆగు" అని కేకలేసింది. తేజసింహుడు ఆగి చపలవైపు చూచాడు.

చపల:- అతనిమీదకు కత్తి ఎత్తా వెందుకు ?

తేజ:-ఇతడు ఏదో చెప్పబోయి నిన్నుచూచి ఆగాడు. చెప్పితే ఎవరో ప్రాణం తీస్తారట.

చపల:- వాడికి పిచ్చిఎత్తిందేమో ? అతడిమాటలు ఏమీ పట్టించుకోకండి.

శివ:- నన్నే పిచ్చివాణ్ణి చేసిందిగా !

తేజ:- ఏమన్నావు ?

శివ:- ఏమీలేదు. నువ్వు చపలతో మాట్లాడు. నేను పిచ్చివాణ్ణి.

దేవీ:- బలేపిచ్చివాడు వచ్చాడు !

శివ:- చపల చెప్పింది నిజం. నేను నిజంగా పిచ్చి వాణ్ణి.

యువ:- జ్యోతిష్కులుగారూ ! క్రొత్తరకం పిచ్చివాణ్ణి కొంచెం చూడండి.

జ్యోతిష్కుడు:- (నవ్వుతూ) ఆకాశవాణి స్వయంగా ఇతడు పిచ్చివాడని సెలవిచ్చినప్పుడు ఇంకా నేనేమిచూడను?

యువ:- నా కేదో అనుమానంగా ఉన్నది.

తేజ:- అవును. ఇదేదో పెద్ద రహస్యం. వాళ్ళిప్పుడు బయటపడుతారో తెలియకుండా ఉన్నది.

శివదత్తమహారాజు అక్కడనుండి వెళ్ళిపోయాడు. తేజసింహుడు యువరాజుతో "మనమిప్పుడు సైన్యందగ్గరికి వెళ్ళుదాం. శివదత్తుడు మన సైన్యంమీద దండెత్తాడని విన్నాను. ఆ శివదత్తుడెవడో తెలియలేదు. తర్వాత ఆ శివదత్తుడుకూడా మాయమైపోయాడని విన్నాను. తిరిగి ఇక్కడకువచ్చి శివదత్తుణ్ణి చూస్తున్నాను" అన్నాడు.

యువరాజు:- నువ్వు చెప్పేమాటలు నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. పూర్తి వివరాలు చెప్పు.

తేజసింహుడు తాము ముగ్గురు యువరాజుని వెతకటానికి వెళ్ళటం, మారువేషంతో సురేంద్రసింహుని దర్బారులో వేగులవాళ్ళు చెప్పినది వినటం, విజయసింహామహారాజు, సురేంద్రసింహ మహారాజు చునారగఢంపై దండెత్తి వెళ్ళటం మొదలైన విషయాలు యువరాజుకు చెప్పాడు. ఆ తరువాత వాళ్ళు చంద్రకాంతతో వెళ్ళుతున్నామని చెప్పి గుహబైటికి వచ్చేశారు.

అప్పటికి సాయంకాలమైంది. తేజసింహుడు దేవీసింహుడితో "మేమిక్కడే కూర్చుంటాం; నువ్వు నౌగఢానికి వెళ్ళి యువరాజుకు ఒక మంచి గుఱ్ఱాన్ని తీసుకొనిరా. ఆ గుఱ్ఱముమీద యువరాజు ఇంద్రజాలం దగ్గరికి వెళ్లుతాడు.

కాని నువ్వు గుఱ్ఱాన్ని తెచ్చినట్లు ఎవ్వరికీ తెలియకూడదు." అన్నాడు.

దేవీ:- ఎవరికైనా తెలిసేట్టు తెస్తే, ఇంకా నన్ను పంపించిన ప్రయోజన మేముంది?

తేజ:- ఎంత సేపట్లో వస్తావు ?

దేవీ:- ఆలస్యం కావటానికి ఎంతదూరం వున్నది గనుక ! అంతాకలిసి నాగఘం ఇక్కడకు రెండు క్రోసులే గదా ఉన్నది. ఒక జాము లోపతే తిరిగివస్తాను". అని నాగఘం దిక్కుగా వెళ్లాడు. మిగతా ముగ్గురూ ఒక చెట్టు క్రింద కూర్చున్నారు.

యువ:- జ్యోతిష్కులుగారూ! శివదత్తుని రహస్యం బయటపడ దంటారా ?"

జ్యోతిష్కుడు:- మనదగ్గరకు మంత్రిని పంపి సంధిచేసు కొన్నవాడు తప్పకుండా శివదత్తుడే! ఈ గుహాలో ఉన్న వాడుకూడా అతడే ! కాని మధ్యజరిగిన సంగతేమిటో బోధ పడకుండా ఉన్నది.

యువరాజు:- నాయనగారు చునార్ గఢంపై దాడి చేశారు. ఏమౌతుందో చూడాలి.

జ్యోతిష్కుడు:- అక్కడ అడిగేవాడెవ డున్నాడు? ఉత్తరంవల్ల శివదత్తుడు బంధితుడైనట్లు బుజవౌతున్నది గదా!

తేజసింహుడు:- చునారగఢం వంశం కావటంలో సందేహపడవలసిన పనిలేదు. కాని ఇంద్రజాలికు లేదైనా కుంభకోణం చేస్తారేమో!

యువరాజు:- బదరీనాథ్ వగైరాలను బంధించి ఉంచితే బాగుండేది.

తేజసింహుడు:- ఇప్పుడే వెళ్ళి వాళ్ళను బంధిస్తాను.

అంతలో దేవీసింహుడు గుర్రాన్ని తెచ్చాడు. యువరాజు గుర్రంమీద, మిగతా ముగ్గురూ కాలినడకనా ఇంద్రజాలం దగ్గరకు ప్రయాణమై పోయారు.

## 14

వీరేంద్రసింహుడు మాయమైనాడని, అతనిని వెదకటానికి తేజసింహుడు వగైరాలు బయలుదేరి పోయారని తెలుసుకొన్న శివదత్తుని మనస్సులో దుష్టచింతన ప్రాదుర్భవించింది. మంత్రినీ, ఇంద్రజాలికులనూ రాపించి "ఇప్పుడు కాలం అనుకూలంగా ఉన్నది. ఈ క్షణంలో వీరేంద్రుని సైన్యం మీదపడి అతను ఇంద్రజాలంలో సంపాదించిన ధనరాసుల్ని కొల్లగొడితే బాగుండదూ?" అని సలహా అడిగాడు.

ఇంద్రజాలికులు మాత్రం సంధిచేసుకున్న వారిపై తిరిగి కత్తిదూసి విరోధాన్ని కొనితెచ్చుకోవటం తెలివిగల పనిగాదని నచ్చచెప్పారు. శివదత్తుడు వారిమాటలను లెక్కచెయ్యలేదు. ఈ ఇంద్రజాలికులలో నాజిం, అహమ్మద్‌లు మాత్రం శివదత్తుణ్ణి సమర్థించారు.

చివరకు శివదత్తుడు స్వయంగా సైన్యాన్ని తీసుకొని వీ రేంద్రుని సైన్యాలమీద పడ్డాడు. ఫతహాసింహుడు గట్టిగానే యెదుర్కొన్నాడు గానీ గాయంతగిలి శివదత్తుని చేతిలో చిక్కిపోయాడు. సైన్యాలుకూడా చెల్లాచెదురైపోయాయి. శివదత్తుడికి వట్టి శిబిరాలు మాత్రం దక్కాయి. కాని, ఇంద్ర జాలం పుస్తకం దొరికింది. ఆ పుస్తకాన్ని తీసుకొని తాను స్వయంగా ఇంద్రజాలాన్ని ఛేదించి చంద్రకాంతను వివాహం మాడాలని అనుకొన్నాడు.

శివదత్తుడు విజయగర్వంతో ఒకపెద్ద ఉత్సవాన్ని ఏర్పాటుచేశాడు. నాట్యం, సంగీతం విందులు పూర్తి అయిన తర్వాత అతడు ఆ రాత్రి హాయిగా నిద్రిస్తున్నాడు. తెల్లవారే సరికి మంచంమీద లేడు. ఎవరు ఎత్తుకొని వెళ్లారో తెలియదుగాని కేవలం ఆ వుత్తరంమాత్రం మంచం మీద ఉన్నది. అతడు మాయమైన తర్వాత ఫతహాసింహా సేనాపతికూడా విడుదల అయినాడు. అతనికికూడా తనను విడిపించిన వారెవరో తెలియదు. ఎవరో అతనిచేతి గాయా లకు కట్టుగట్టడం కూడా జరిగింది.

సేనాపతి తిరిగివచ్చిన తర్వాత పారిపోయిన సైనికులు కూడా తిరిగి చేరుకొన్నారు. ఆ తర్వాత సేనాపతికి శివ దత్తుడు ఎవరిచేతిలోనో చిక్కాడని తెలిసింది. అప్పుడు ఫతహాసింహుడు కొద్దిమంది వీరులను మాత్రం వెంటబెట్టు కొని చునారగఢంపై దండెత్తివెళ్లాడు. దారిలో జయసింహా మహారాజుకూడా చునారగఢంపై దండెత్తిరావటానికి సిద్ధ

పోతున్నాడని తెలిసి విజయగఢానికివెళ్ళి అతనితో కలసి చునారగఢంపై దండెత్తటానికి ముందుకు సాగాడు.

జయసింహుని సైన్యం చునారగఢం కోటను ముట్టడించాయి. శివదత్తుడి సైన్యం కోటలోదూరి తలుపులు మూసి బురుజులెక్కి ఫిరంగియుద్ధం చెయ్యసాగింది.

# 15

చునారగఢం దగ్గఱ రెండుకొండలున్నాయి. వాటి నడుమ ప్రవహిస్తున్న నదిఒడ్డున ఒకనాడు బదరీనాథుడు, పన్నాలాలు, రామనారాయణ, నాజిం, అహమ్మదూ కూర్చొని యిలా మాట్లాడుకుంటున్నారు.

నాజిం:-మాయజమాని స్వర్గానికి పోయాడు. కష్టాలు అనుభవించటానికి మనం మిగిలివున్నాం.

అహ్మద్:- అతన్ని చంపినవారెవరో తెలియకుండా ఉంది.

బదరీనాథుడు:- వాడిపాపమే వాణ్ణి చంపింది! మీకు కూడా అదే దశపడుతుంది. కావటానికి ఇంద్రజాలికులైనా మీఅంత విశ్వాస ఘాతకులు, ఇంకెవ్వరూ లేరు.

నాజిం:- మేము విశ్వాస ఘాతకులమా?

బదరీనాథుడు:- అవును! మీ యజమానిమైన జయ సింహమహారాజుకే ద్రోహంచేశారు. మీరునాశనమై క్రూర సింహుని ప్రాణాలుకూడా తీశారు. మాదగ్గరచేరి మారాజును చెఱపాలు చేశారు. మిమ్మల్ని ఏంచేసినా పాపంలేదు.

అహమ్మద్:- ఏం? మాటలు విసురుతున్నావు! ప్రాణంమీద ఆశ లేదా?

అహ్మద్ ప్రలాపాలకు బదరీనాథుడు మండిపడ్డాడు. వెంటనే ఒకరాయి తీసుకొని అహమ్మద్ నెత్తిమీద బలం కొద్దీ కొట్టాడు. ఆ దెబ్బతో అహ్మద్ ప్రాణవాయువులు అనంతాకాశంలో లీనమైనాయి; నాజిం పలాయన మంత్రం పఠించాడు. కాని బదరీనాథుడు అతణ్ణి వదిలిపెట్టలేదు. వెంటనే వడిశెలతో నాజింను గురిచూచి రాయివిసిరాడు. ఆ రాయి తగలగానే నాజిం తీవ్రంగా గాయపడి నేలకొరి గాడు. అంతలో పన్నాలాలు వగైరాలు వచ్చి అతని పర లోక ప్రయాణం సుకరం చేశారు.

ఇలా బదరీనాథుడు మొదయినవారు ఆ ఇద్దర్నీ క్రూరసింహుని బంటులుగా ఉండటానికి ఈ లోకనుంనుంచి రవాణ చేశారు.

ఆ తర్వాత నలుగురు ఇంద్రజాలికులూ కలిసి కూర్చుండి యిలా ప్రసంగం ఆరంభించారు:

పన్నాలాలు:- ఇహ మన దర్బారుకు పిశాచపీడ తొల గింది.

బదరీనాథుడు:- మహారాజు కిక యే చింతావుండదు.

పన్నాలాలు:- ఇక ఏవిధంగానైనా సింహాసనాన్ని రక్షించాలి. జయసింహామహారాజు హఠాత్తుగా దండెత్తి వచ్చాడు. మన సైన్యాలు మహారాజు లేకుండా యుద్ధం చెయ్యలేవు.

చున్నీలాలు:—కోటలో ఉండిమాత్రం ఎన్నాళ్ళని యుద్ధం చేస్తారు. రెండు నెలలకు సరిపోయే ఆహారపదార్థాలు మాత్రమే కోటలో వున్నాయి. ఆ తర్వాత ఏంచేస్తారు?

రామనారాయణ:-ఆహార పదార్థాలు నిలువ చేసుకొనే అవకాశంకూడా లేకపోయింది.

బదరీనాథుడు:-యేవిధంగానైనా జయసింహమహారాజును ఎత్తుకొనిపోవాలి. అతడు లేకపోయినతర్వాత అతని సైన్యాలు యుద్ధం చెయ్యలేవు.

పన్నాలాలు:-తప్పకుండా చేద్దాం. ఎవరి ఉప్పు పులుసూ తిన్నామో వాళ్ళకు ప్రాణాలుకూడా ధారపోయటానికి మనం సిద్ధంగా వుండాలి.

రామనారాయణ:-మన రాజు కూడా మూర్ఖత్వానికి తలపడ్డాడు. లేకపోతే వీరేంద్రుని మీాదకు ఎందుకు దండెత్తాలి చెప్పు?

చున్నీలాలు:-జరిగిందేదో జరిగింది. మనంమాత్రం మన యజమానికి అండగా నిలబడాలి.

బదరీనాథుడు:-మన రాజును పట్టుకొన్న శనిగ్రహాలు నాజిం, అహ్మద్‌లు వదిలిపోయారు. ఇప్పుడు రెండు రాజ్యాలమధ్యా శాశ్వతమైన మైత్రీ సంబంధాల్ని నెలకొల్పటానికి శక్తివంచనలేని కృషి చేస్తాను. అప్పుడు నాకు వీరేంద్రసింహుని అనుయాయిగాఉండే అదృష్టం కలుగుతుంది. అబ్బ! ఆ యువరాజు శౌర్యపటిమ, భవిష్యత్తూ ఏమని చెప్పను!

పన్నాలాలు:-చాలా రాత్రి గడచింది. జయసింహ మహారాజును ఏదైనా పన్ను గడ పన్ని కోటలో రహస్యంగా బంధిద్దాం పదండి!

బదరీనాథుడు:-నేనొక ఉపాయాన్ని ఆలోచించాను. అదే బాగుంటుంది కూడా!

పన్నాలాలు:-ఏమిటది?

బదరీనాథుడు:-మనం మొట్టమొదట వెళ్ళి అతని వంటవాణ్ణి బంధిద్దాం. నేను అతని వేషం వేసుకొని వంటలు చేస్తూంటాను. మీరు వంటవానికి సహాయంగా ఉండే వాళ్ళను బంధించి ఆ స్థానాలు ఆక్రమించండి. నేను వంట కాలలో మత్తుమందు కలిపి మహారాజుకి, అతని కాపవాళ్ళకు పడ్డిస్తాను. ఆ తర్వాత ఇహ చూచుకో!

పన్నాలాలు:—బలే ఉపాయం! నువ్వు బ్రాహ్మణుడవు గనుక పాచకత్వానికి సరిగా తగిఉంటావు. నీ చేతి భోజనం చెయ్యటంవల్ల మహారాజు కుల ధర్మానికికూడా చెరుపు జరగకుండా ఉంటుంది. కాని వంటకాల్లో శక్తి మంతమైన మత్తుమందు మాత్రం కలపవద్దు.

బదరీనాథుడు:—నే నేమైనా తెలివితక్కువాడి ననుకున్నావా? రాజులు తాము భోజనం చేసే పదార్థాలను ముందుగా ఒకడిచేత తినిపించి చూస్తారనికూడా నాకు తెలుసు. నేను వాడేమందు తిన్నతర్వాత రెండు గంటలకు

భావం చూపదు.

రామనారాయణ:—ప్రణాళిక సిద్ధమైందిగదా; ఇక బయలు దేరుదాం.

# 16

సురేంద్రసింహమహారాజు మధ్యలో ఎక్కడ ఆగకుండానే నాగఘంనుండి చునారగఢానికి చేరుకొన్నాడు. సాయంకాలం జయసింహమహారాజుకు ఈవార్త తెలిసింది. ఫతహాసింహ సేనాపతిని సురేంద్ర సింహునికి స్వాగతం చెప్పడానికి పంపాడు.

సురేంద్రసింహుడు సేనాపతిద్వారా విశేషాలన్నీ తెలుసుకొన్నాడు. తెల్లవారేసరికి అతని సైన్యాలుకూడా జయసింహుని సేనల్ని కలుసుకొన్నాయి. హరదయాళుడు అనేక వీరులను వెంటబెట్టుకొని తన్ను ఆహ్వానింప వచ్చే సేనాపతికి ఎదురయ్యాడు.

సేనాపతి:—మీరలా పరుగెత్తుకొని వస్తున్నారెందుకు?

ఒకవీరుడు:—బలే చిక్కువచ్చింది.

సేనాని:—ఏమిటది.

రెండవ వీరుడు:—ముందు సురేంద్రసింహుని వద్దకు పద—అక్కడే చెప్పుతాం.

అందరూ కలసి సురేంద్రసింహుని డేరాలో ప్రవేశించారు. సురేంద్రసింహుడు వారి ఆతురతను చూచి భయపడ్డాడు.

హరదయాళుడు:—ఇవ్వేళ ఉదయం కోటలోనుండి ఫిరంగిశబ్దం వచ్చింది. దానిని విని నేను మహారాజ జయ

సింహుల శిబిరంలోనికి వెళ్ళాను. వాకిలిముందు కాపలా వాళ్ళు స్పృహ లేకుండా పడిఉన్నారు. నేను సరాసరి శిబిరం లోనికి వెళ్లాను. అక్కడ మహారాజు మంచంకూడా ఖాళీగా ఉన్నది. నాకు మతిపోయినట్లయింది. వైద్యుడు కాపలా వాళ్ళను పరీక్షించి మత్తుమందు సోకిందని చెప్పాడు. అప్పటి కప్పుడే వేగులవాళ్లు వెతకటానికి వెళ్లారు గానీ ఇంతవరకు మహారాజు కనుపించలేదు.

సురేంద్రుడు జీతసింహునివంక చూచాడు. అతడు ఎడమవైపున కూర్చున్నాడు.

జీతసింహుడు:—మహారాజును ఇంద్రజాలకులు ఎవరో ఎత్తుకొనిపోయారు. బహుశః మహారాజు భోజనపదార్థాలలో మత్తుమందు కలిసి ఉంటుంది. వంటవాణ్ణి తీసుకొనివస్తే సంగతి తెలుస్తుంది.

వంటలవానికోసం కబురువెళ్ళింది. అక్కడ వంటల వాడు లేడు. అప్పుడే అనేకమంది మనుష్యులువచ్చి మహా రాజుగారి వంటలవాణ్ణీ, అతని సహాయకులనూ సైన్యానికి బైటఉండగా డోలీలలో తీసుకొనివచ్చామని చెప్పారు.

జీతసింహుడు:—మిగతాడోలీలు బైటపెట్టి, వంట వాడి డోలీని ప్రవేశపెట్టండి.

స్పృహలేకుండా ఉన్న వంటలవాణ్ణి డోలీలో శిబిరం లోనికి తెచ్చారు. జీతసింహుడు అతనికి ఒకమందు వాసన చూపి స్పృహ తెప్పించాడు. వాడు లేచి కూర్చున్నాడు. మంత్రి విశేషాలు చెప్పమన్నాడు.

వంటలవాడు:—ప్రొద్దుపోయినతర్వాత ఒక హల్వా అమ్మేవాడు వచ్చాడు. అతనిదగ్గర హల్వా కొనుక్కొని మేమంతా తిన్నాం. వాడికి డబ్బులివ్వటానికి ముందే పడి పోయాము. ఆ తర్వాత నాకు తెలియదు.

మిగతావారికికూడా స్పృహ తెప్పించి పంపించి వేసిన తర్వాత సురేంద్రసింహుడు, జీతసింహుడు, హరదయాళ సింహుడు మిగిలి ఉన్నారు.

సురేంద్రసింహుడు మంత్రి జీతసింహునిచూచి "జయ సింహ మహారాజు విడుదలయ్యే మార్గం ఏదైనా ఆలో చించాలి" అన్నాడు.

మంత్రి:—ఏమి విడిపిస్తాం? ఇక్కడ ఒక్క ఇంద్ర జాలికుడైనా లేడాయె! యువరాజును వెదకటానికి వెళ్ళిన వారు ఇంతవరకూ రాలేదు.

సురేంద్ర:- నీవే యేదైనా ఉపాయం ఆలోచించాలి.

మంత్రి:— నే నేమి చెయ్యగలుతాను! వ్యవధిచిక్కక నేనిప్పుడు మారువేషాలు వెయ్యటం మానివేశాను. తేజ సింహుడు మాయాజాలంలో నిపుణుడైనతర్వాత ప్రభుత్వం నాకాపనినుండి సెలవిప్పించారు. అప్పటినుంచీ నేను అటు వంటి అవుసరం ఇక కలుగదనే ధైర్యంతో దానికి సంబం ధించిన వస్తువులుకూడా ఏమీ ఉంచుకోవటంలేదు.

రాజు:—ఈ విపత్కర సమయంలో మారువేషాలు వెయ్యటానికి వెనకాడితే ప్రయోజనంలేదు. బహుశః నీ

దగ్గర మాయాజాలానికి సంబంధించిన వస్తువులు కొన్ని అయినా ఉండకపోవు.

మంత్రి:— (ఒక చిరునవ్వు నవ్వి) మాయాజాలం తెలిసిఉండి ప్రభువులవారితో ప్రయాణంచేస్తూ ఆ సామానులు వెంట ఉంచుకోకుండా ఉంటానా ?

సురేంద్ర:- అయితే ఆలస్యం చెయ్యక నీ పూర్వపు మాయజాలనైపుణ్యాన్ని ఒక్కసారి జ్ఞాపకానికి తెచ్చుకొని జయసింహామహారాజును విడిపించు.

మంత్రి:- తమ ఆజ్ఞ! (హరదయాళ మంత్రితో) ఇప్పుడు జరిగిన విషయాలన్నీ మీరు రహస్యంగా ఉంచండి. ఫతెహసింహుణ్ణి తీసుకొని సాయంకాలం యుద్ధాన్ని ప్రారంభించండి. మొత్తంమీద ఈరాత్రి అంతా యుద్ధం జరిపించే బాధ్యత మీది.

హరదయాళుడు:- తప్పకుండా చేస్తాను.

మంత్రి "ఇక మీరు వెళ్ళి యుద్ధసన్నాహాలు పూర్తి చెయ్యండి. నేనిక వెళ్ళి నా పనిలో ఉంటాను" అని చెప్పి తన డేరాలోనికి వెళ్ళి పూజా, భోజనాదులు ముగించుకొని మాయాజాలం సామానులు సర్దుకోసాగాడు. యుద్ధానికి బయలుదేరేముందు జితసింహుడు బాగా ఆలోచించి వెంటనే, జయసింహుడు వగ్గైరా లేకుండటం గమనించి, విశ్వాసపాత్రుడైన ఒక ముసలివాడితో మాయాజాలపు సామానులుగల ఒకపెట్టెను సౌధంనుంచి వెంటతెప్పించు

కొన్నాడు. ఇప్పుడది ఉపయోగం లోనికివచ్చి ఒక జమీం దారుగా రూపాంతరం చెంది శిబిరంనుండి బయటికి వచ్చాడు.

జీతసింహుడు సైన్యాన్ని విడిచిపెట్టి కోటకు దక్షిణ భాగంలోగల ఒక పర్వత ప్రాంతంలోనికి వెళ్ళాడు. అక్కడ ఒక రాతిమీద కూర్చుని కలం, కాగితం తీసి—

"మీ మాయాజాలం ఎందుకూ పనికిరాకుండా పోయింది. నేను కోటలో ప్రవేశించనే ప్రవేశించాను. ఇక ఏం జేస్తానో చూడండి. మీరు నలుగురు మాయాజాలం తెలిసిన వాళ్ళున్నారు. ఆ విద్య తెలియని ఒంటరిగాణ్ణి నేను. అయినా మీరు నన్ను బంధించలేరు, మీ మాయాజాలం పనికిమాలినది." అని ఎన్నో చీట్లమీద వ్రాయటం పూర్తి చేసి జిగురునుకూడా సిద్ధంచేసుకొని సంచిలో వేసికొని కోట దిక్కుగా వెళ్ళాడు. అక్కడకు వెళ్ళేసరికి సాయంకాలమైంది. చీకటిపడిన తర్వాత ఒక గోడకు త్రాడువేసి లోపల నిశ్శబ్దంగా ఉండటంచూచి దిగిపోయాడు.

ఘతమాసింహుడు, హరదయాళసింహుడు కోట వెలుపల ఘోరంగా యుద్ధం చేస్తున్నారు. కోటలోని సైన్యం బురుజుల మీద, స్తంభాలమీద ఎక్కి యుద్ధం చేస్తున్నారు. ఫిరంగి ధ్వనులు దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. అనేకులు వాళ్ళదగ్గర నిలబడి యుద్ధఫలితాన్ని చూడాలని ఎదురు చూస్తున్నారు. లోపల జీతసింహునికి అటూ ఇటూ తిరగటానికి మంచి అవకాశం చిక్కింది.

మొట్టమొదట వ్రాసి తనవద్ద పెట్టుకున్న చీట్లను జీతసింహుడు కన్పించిన చోటల్లా అతికించటం మొదలు పెట్టాడు. ఎవరైనా చూస్తున్నారనే అనుమానం కలిగి నప్పుడు ఏమూలనైనా దాగి, తిరిగి తన పనిలో తాను నిమగ్నుడు కాజొచ్చాడు.

కోటతలుపులవద్ద యుద్ధం సాగుతోంది. శివదత్తుని వర్గంలోని ముఖ్యులూ, ఇంద్రజాలికులూ అక్కడకు చేరి ఉన్నారు. వారికెవరికీ జీతసింహుడు కోటలో ప్రవేశిస్తాడని గాని, తన మాయాజాలంతో జయసింహుణ్ణి విడిపించుకు పోతాడని గాని తోచలేదు.

# 17

ఘృతహాసింహ సేనాపతి ధైర్యసాహసాలవల్ల శివ దత్తుని సైన్యాలు చూర్ణంచూర్ణం కాసాగాయి. ఇదేవిధంగా రాత్రి అంతా యుద్ధంజరిగితే కోట తలుపులు విరిగిపడి శివ దత్తుని సేనాని సురేంద్రసింహునికి వశంకాక తప్పదు. బదరీనాథుడూ వజ్రైరాలు తనపక్షంవారి దుస్థితికి భయ పడుతూ ఒకచోట నిలబడి ఉన్నారు. ఇంతలో ఒక కాపలా వాడు మొఱపెట్టుక్కుంటూ అక్కడకు వచ్చాడు. అతని శరీరంనిండా గాయాలు తగిలిఉన్నాయి. అతనిని గుర్తు పట్టడంకూడా కష్టం. "నిన్నెవరు గాయపరచా"రని బదరీ నాథుడు అడిగాడు.

కాపలావాడు:— మీా రిక్కడ ఉండిపోయి మిగతా సంగతులన్నీ మఱచిపోయారు. వెనుకనుంచి వీరేంద్రసింహుని

మనుష్యులు ప్రవేశించారు. వాళ్ళు కోటంతా కలియ దిరుగుతూ ఎక్కడేమి చేస్తున్నారో చెప్పలేము. అక్కడికీ నే నొక్కణ్ణి ఎదుర్కొన్నా. వాడు సామాన్యుడు కాదు. నన్ను స్వేచ్ఛగా బాది నా శరీరమంతా గాయపరచి వదిలాడు. అతి కష్టంమీద మీ కీ వార్త చెప్పటానికి వచ్చాను. తిరిగివస్తూ త్రోవలో వాడు గోడలను అతికించి ఉన్న కాగితాలనుకూడా చూచాను.

పన్నాలాల్:- ఏదో కొంపమునిగినట్లుంది.

బదరీనాథుడు:- వాళ్ళెంతమంది ఉన్నారో నీవు చూచావా ?

కాపలావాడు:- చాలామంది ఉన్నట్లున్నారు. నాకు మాత్రం ఒక్కడే తగిలాడు.

బదరీనాథుడు:- వాణ్ణి నువ్వు గుర్తుపట్టగలవా ?

కాపలావాడు:- ఆc! వెలుగులో వాడి ముఖాన్ని బాగా చూచాను.

బదరీనాథుడు:- నేను వాళ్ళను వెదుకుతా కానీ, నీవు నా వెంట వస్తావా ?

కాపలావాడు:- ఎందుకురాను ! నా ముఖం చెక్కేసిన వాడిని బంధించకుండా ఉన్నంతవఱకు నా కోపము తీఱదు.

బదరీనాథుడు, పన్నాలాల్, రామ నారాయణ, చున్నీ లాల్ కాపలావాడితో కలసి బయలుదేరారు. అంతఃపురం వద్దకు వెళ్ళి చూచేసరికి అక్కడ ఒక మనుష్యుడు స్పృహ లేకుండా పడిఉన్నాడు. కొద్ది కొద్దిగా వెలుగుతున్న కాగడా

అతనికి దూరంగా పడిఉన్నది. దానికి దగ్గరగా కాగడాకి చముురుపోసే గొట్టంకూడా ఉన్నది. కాపలావా డతణ్ణిచూచి "చూచారా వురొకణ్ణి కొట్టిపోయాడు" అని కాగడా తీసి చముురుపోసి ఆ పడిపోయినవాడిదగ్గరకు తెచ్చాడు. అతడు దివిటీలు పట్టుకొనేవాడని బదరీనాథుడు గుర్తుపట్టాడు. అతడు మత్తుమందువల్ల స్పృహ తప్పిపోయాడనికూడా తెలుసు కొన్నాడు.

"ముందు ఆ దురాత్ముణ్ణి వెదుకుదాం పదండి. నేను మీ వెంట కాగడా పుచ్చుకొనివస్తాను. మనం త్వరపడక పోతే జయసింహమహారాజు విడిపించుకుపోయే ప్రమాద ముంది" అన్నాడు కాపలావాడు.

"అవును; ముందుగా జయసింహ మహారాజును బంధించినచోటికి పోదాం పదండి" అన్నాడు బదరీనాథుడు.

అందరూ జయసింహుని బంధించి పెట్టినచోటికి వెళ్ళారు. అతడు శృంఖలాబద్ధుడై కూర్చుండి ఉన్నాడు. కాపలామనిషి పరీక్షగా అటూ ఇటూ చూచి "పదండి యింకొకచోట వెదుకుదాం" అన్నాడు. అందరూ నలు వైపులా వెదుకుతున్నారు. వెదుకుతూ వెదుకుతూ గోడ లకూ, తలుపులకూ అంటించిఉన్న చీట్లు చూచారు. ఆ చీట్లను చదువుకొని ఐంద్రజాలికులు వాడలిపోయారు. ఇంతలో కాపలామనిషి "అదుగో! అదుగో! ఆ గదిలో దూరాడు. వాడే నన్ను కొట్టి చంపింది" అన్నాడు.

అందరూ ఆ గదిదిక్కుగా వెళ్ళారు. కాపలావాడు ముందుగా ఆ గది వాకిలిదగ్గఱకువెళ్ళి నిలబడిపోయాడు. బదరీనాథుడు "లోపలికి పద" అన్నాడు.

కాపలావాడు:- ముందు మీరు కత్తులుదూసి మరీ అడుగువెయ్యండి. లేకపోతే వాడెక్కడో దెబ్బదీసిపోతాడు.

బరీనాథుడు:- మేము సిద్ధంగానే ఉన్నాం. కాగడా పుచ్చుకొని ముందు నువ్వు లోపలికి పద.

కాపలావాడు:- వద్దుబాబూ! ఇప్పటికితిన్న తన్నులు చాలు. తెలిసి తెలిసి నేను వాడిముందుకు చస్తే వెళ్ళను.

బదరీనాథుడు:- ఇలువంటి పిరికివాళ్ళు మన రాజు దగ్గర తెగతినటానికి చేరుకొన్నారు. ఇటురా! ఆ కాగడా నాచేతి కివ్వు.

కాపలావాడు:- ఇదిగో తీసుకోండి. అవును. ఇంతగా తన్నులు తిన్నవాణ్ణి పిరికివాణ్ణి కాక ఏమౌతాను? మీకు తగిలితే ఆ దెబ్బలు తెలిసివచ్చేది.

అని బదరీనాథుని చేతికి కాగడా చమురుగొట్టం ఇచ్చేశాడు. ఐంద్రజాలికులునలుగురూ గదిలో ప్రవేశించారు. వాళ్ళు లోనికి వెళ్ళటంతోనే కాపలావాడు తలుపులుమూసి గొళ్ళెం పెట్టేశాడు. బొడ్లోనుంచి చెకుముకిరాతితో నిప్పు కొట్టి వాకిలి బైటకు వచ్చిఉన్న మందు త్రాటికి నిప్పంటించాడు. అది సుర సురమని కాలుతూ లోనికి పోయింది.

నిజానికి కాపలావాడు జీతసింహుడు. అతడు ముందుగానే ఐంద్రజాలికుల్ని బంధించటానికి ఏర్పాటులన్నీ చేసి

పెట్టాడు. ఆ గదిలో మొట్టమొదటే కాలితే పొగవచ్చే మత్తుమందు పోగులను అక్కడక్కడా పెట్టాడు. బయట నిప్పంటించేసరికి మందుతాడు కాలుతూ లోపలికి వెళ్ళి మత్తుమందుకు అంటుకుంది. ఐంద్రజాలికులు లోనికిపోయిన గదిఅంతా పొగ క్రమ్ముకొన్నది.

జీతసింహుడు ఆ తర్వాత జయసింహుని చెఱవద్దకు వచ్చాడు. అంతా నిశ్శబ్దంగా ఉన్నది. ఖైదు వాకిలి తెఱచి రాజుచేతి బేడీలను నరికి జయసింహునకు తన పేరు చెప్పాడు.

జీతసింహుడు తాటితో కోటలో ప్రవేశించినచోటికి జయసింహుణ్ణి తీసుకొనివచ్చి కోటవెలుపల దించివేశాడు. తాను ఐంద్రజాలికులను బంధించిన గదిలోనికిపోయి స్పృహ లేకుండా పడిఉన్నవాళ్ళను ఒకొక్కరిని ఈడ్చుకొచ్చి తాటితో కట్టి కోట వెలుపలికి దించాడు. క్రింద ఉన్న జయసింహ మహారాజు తాడు ముడితీసి ఐంద్రజాలికులను ఒకొక్కడినీ నేలమీాద పడవేశాడు. మొత్తంమీాద ఐంద్రజాలికులను నలుగురనూ జయసింహమహారాజునూ తీసుకొని జీతసింహుడు తన సైన్యంలోనికి చేరుకొన్నాడు. అక్కడ ఐంద్రజాలికుల్ని తగు రక్షణాలో దాచిఉంచాడు.

జీతసింహుని ప్రజ్ఞా విశేషాలను మెచ్చుకొన్న జయసింహుడూ సురేంద్రసింహుడూ తమ తమ రాజ్యాలలో కొంత భాగాలను బహుమానంగా ఇచ్చి సత్కరించారు.

ఉదయమైంది; యుద్ధం ఆగిపోయింది.

# 18

వీరేంద్రసింహ యువరాజు తన ఇంద్రజాలికులను ముగ్గురినీ వెంటబెట్టుకొని యింద్రజాలం దిక్కుగా పయనించాడు. ఒకరాత్రి ప్రయాణంచేసి మరునాడు తిరిగి ప్రయాణం సాగించేసరికి అతనికి ఎదురుగా ఒక ముసుగు మానిసి రావటం కన్పించింది. ఆ ముసుగుమానిసి యువరాజు కొంచెం దూరంలో నుండగానే గుఱ్ఱాన్ని దిగి నేలమీద ఏదో పెట్టి తిరిగి దూరంగా పోయి నిలబడ్డాడు. యువరాజు అక్కడకు వెళ్ళి చూస్తే అక్కడ యింద్రజాలం పుస్తకం, ఉత్తరం ఉన్నాయి. యువరాజు సంతోషంతో వాటిని తీసుకొని తేజసింహుడితో "తేజసింహా, ఈవనకన్య నాకు ఎంతగానో సహకరిస్తున్నది. ఈ పుస్తకం ఇక్కడ పెట్టిపోయిన మనుష్యుడు వనకన్యమాత. ఆమెపై నాకుగల ప్రేమానుబంధం నిరర్థకమై పోదు కదా? ఈ వుత్తరంలో ఏమి వ్రాసిందో" అని ఉత్తరాన్ని చదవటం మొదలుపెట్టాడు.

"నాకు దొరికిన ఇంద్రజాల పుస్తకాన్ని నీకు పంపిస్తున్నాను. ఇప్పుడు తొందరగా వ్యూహాన్ని ఛేదించి చంద్రకాంతను విడిపించు. పాపం! ఆమె ఆ గుహలో ఎంత బాధ పడుతున్నదో! చునారగఢంలో యుద్ధం జరుగుతున్నది. నీ వక్కడికి వెళ్ళి నీవిక్రమాన్ని ప్రదర్శించి చునారగఢంపై విజయపతాకాన్ని ప్రతిష్ఠించు. చరిత్రలో నీ పేరు శాశ్వతంగా నిల్చిపోతుంది.

నీ దాసి,

ఎప్పటి వియోగిని."

యువరాజు:- తేజసింహా! ఈ ఉత్తరాన్ని నువ్వు చదువు.

తేజసింహుడు ఉత్తరాన్ని చదివి "ఈ వనకన్య దివ్య కాంతా? మనుష్యకన్యా? ఎటువంటి ఘనకార్యాలు చేస్తున్నది?"

దేవీ:- నేను చునారగఢకు వెళ్ళి అక్కడి వార్తలు తెలుసుకొస్తాను. మీ రిక్కడే ఉండండి.

యువరాజు:- అవును. చునారగఢం ఇక్కడికి అయిదు క్రోసులదూరం మాత్రమే ఉన్నది. నీ వక్కడి వార్తలు తెలుసుకువస్తే అవసరాన్నిబట్టి మే మక్కడికి వెడతాం.

దేవీసింహుడు చునారగఢానికి వెళ్ళాడు. యువరాజుకు త్రోవలో మెటోరోజు ఆగవలసివచ్చింది. మరునాటికి దేవీసింహుడు తిరిగివచ్చి అక్కడి విజయవార్తలను తెలియజేశాడు.

"యుద్ధం ఇంకా జరుగుతోంది. మన సైనికులు కోటగుమ్మం దగ్గరకు చాలాసార్లు చేరుకొన్నారు. అక్కడ వాకిళ్ళను బద్దలుకొట్టలేక ఆగిపోయారు. బురుజుల మీదనుండి ఫిరంగులు పేల్చటంవల్ల మన సైన్యానికి కొంత నష్టం కలిగింది."

యువరాజు:- అయితే మనం కోటలో ప్రవేశించి తలుపులు తెరిస్తే వీరుల మనిపించుకుంటాం.

తేజసింహుడు:- ఈపని మనకేమీ కష్టమైనది కాదు. తలుపులు తియ్యగలగటమో; ప్రాణాలు బలి ఇవ్వటమో జరిగి తీరుతుంది.

యువరాజు:- మనకు యుద్ధంలో మరణించటంకంటే గొప్ప విషయం మరొక టేముంటుంది! చునారగఢంపై విజయపతాకాన్ని ప్రతిష్ఠించినా, వీరమరణంచెందినా ఏది ఏమైనా ఉన్నత సింహాసనం మనకు సిద్ధించక తప్పదు.

తేజసింహుడు:- పదండి. మేము మాఱువేషాలతో కోటలో ప్రవేశిస్తాం. కాని పగలుమాత్రం ఈ పని చేయ లేం.

యువరాజు:- రాత్రికే వెళదాం. రాత్రిఅంతా కోటలో దాగిఉండి తెల్లవారి యుద్ధం జరుగుతూ ఉండగా తలుపులు తెరుద్దాం. శత్రువులు కోటగోడలపైనుండి యుద్ధం చేస్తున్నారు గనుక ద్వారం దగ్గఱ ఎక్కువమంది వుండరు.

దేవీసింహుడు:- జ్యోతిషికులను మాత్రం బయటే విడిచిపెడదాం.

జ్యోతిషికుడు:- ఎందుచేత ?

దేవీసింహుడు:- మీరు బ్రాహ్మణులు. క్షత్రియులు చేసే పనిలో బ్రాహ్మణులను ఇఱికించటం మంచిదికాదు.

యువరాజు:- అవును. ఈయన ఈవల ఉండటమే మంచిది.

జ్యోతిషికుడు:- నాకు మాయాజాలం తెలియక పోతే మీ రా మాట అనవచ్చునుగాని, మాయాజాలం

తెలిసిన నాముందు శౌర్యపరాక్రమాలు ఎందుకు పనికి వస్తాయి ?

దేవీసింహుడు:- సరే, అయితేపదండి ! మాకేదైనా మంచిదే.

యువరాజు:- మనకే మంచిది ! ఈయన ఒకవేళ మరణించినా, మనకు స్నేహితుడు గనుక బ్రహ్మరాక్షసుడై కూడా సహాయపడతాడు.

జ్యోతిషికుడు:- నేను చస్తానా ? ఒకవేళ చావు సమీపిస్తే ప్రియమిత్రులను విడిచి చావను.

వీళ్ళమాటలకు యువరాజునవ్వుకొన్నాడు. అందఱూ కలసి చునారగఢం దిక్కుగా వెళ్ళారు. సాయంకాలమయ్యే సరికి చునారగఢం చేరుకొన్నారు. ఆరాత్రికి రాత్రి తాడు చుట్టవిసిరి తోటలో ప్రవేశించారు.

# 19

ఒక జాము ప్రొద్దెక్కింది. ఫతహసింహుని సేనలు యుద్ధం చేసుకుంటూ కోటవాకిలిచేరుకున్నాయి. శివదత్తుడి సేనలు బురుజులపైనుండి ఫిరంగిగుండ్ల వర్షం కురియుస్తు న్నాయి. ఇంతలో కోటతలుపులు తెరుచుకున్నాయి వారికి ఎదురుగా వీరేంద్రుని పచ్చని పతాకాలు నాలుగు కన్పిం చాయి. వాటినిచూచి జయసింహ మహారాజూ సురేంద్ర సింహ మహారాజూ వారి సేనలూ మరీ సంతోషంతో కోటలో ప్రవేశించాయి. అక్కడ ఎవరినీ ఎదుర్కొనే అవ

సరమే రాలేదు. సైనికులందరూ బంధితులై ఉన్నారు. ఫతహాసింహుడు కోటశిఖరంపై శివదత్తుని ఆకుపచ్చని జండాను విరగ్గొట్టి దాని స్థానంలో పసుపుపచ్చ జెండాను ప్రతిష్ఠించారు. అక్కడే ఉన్న విజయఢంకా దిక్కులు పిక్కటిల్లేటట్లు మ్రోగించారు. ఆ ధ్వనులువిన్న శివదత్తుని సైనికులు వీరేంద్రసింహుని శౌర్యపరాక్రమాలకు అచ్చెరు వొంది కత్తులు దించేశారు.

యువరాజు కోటగుమ్మందగ్గర నల్గురితో నుంచి తలలు నరికాడు. సురేంద్రసింహమహారాజు కోటలో ప్రవేశించటం తోటే తేజసింహుడూ దేవీసింహుడూ చేతిలో జండాలు పుచ్చుకొని ఆతని పాదాలపై బడ్డారు. జ్యోతిషికుడు ఆశీర్వచనాలు పలికాడు. ఆ పిదప నిలువలేక నలుగురూ నేలపై స్పృహలేకుండా పడిపోయారు వాళ్ళ శరీరాలు గాయాలతోనిండి రక్తం ఓడుతున్నాయి.

జీతసింహుడు ఆనలుగురి గాయాలకీ కట్లుకట్టి ముఖాలు కడిగి చూచేసరికి గుర్తు తెలిసింది. కొంతసేపటికి నలుగురికీ స్పృహవచ్చింది. సురేంద్రసింహుడు తన కుమారుణ్ణి హృదయానికి హత్తుకున్నాడు. జయసింహుడు యువరాజు పరాక్రమాన్ని వేనోళ్ళ ప్రశంసించ సాగాడు. యువరాజుకూడా పెద్దల పాదాలు స్పృశించి తన భక్తి ప్రపత్తులను ప్రదర్శించాడు.

అనాడే వీరేంద్రసింహుని చునారగఢ్ సింహాసనానికి పట్టాభిషిక్తుణ్ణి చేశారు. ఏడురోజులపాటు మహోత్సవాలు

ప్రశాంతంగా జరిగాయి. శివదత్తమహారాజ సైన్యాలు వీరేంద్రునికి లొంగిపోయినట్లు హృదయపూర్వకంగా ప్రకటించాయి. అంతఃపురానికిమాత్రం వీరెవరూ వెళ్ళలేదు. అక్కడ గట్టి రక్షణలు ఏర్పాటుచేశారు. చాలాకాలం అక్కడ ఉన్నతర్వాత ఇంద్రజాలాన్ని భేదించి నాగథానికి ధనరాసులను చేరవేసిన యువరాజు సాహస కృత్యానికి సురేంద్రసింహుడూ జయసింహుడూ అతణ్ణి కీర్తించి నాగథానికీ విజయగఢానికీ వెళ్ళిపోయారు. వీరేంద్రసింహుడు ఐంద్రజాలికులనూ కొద్ది సైన్యాన్నీ తీసుకొని ఇంద్రజాలాన్ని పూర్తిగా భేదించటానికి వెళ్ళిపోయాడు.

ఇంద్రజాలం వాకిలిదగ్గర వీరేంద్రుడు తిరిగి శిబిరాలు నిర్మించాడు. ధనరాసులు ఇంతకుముందే బయటపడ్డాయి. ఇక ఆ వ్యూహాన్ని రెండుచోట్ల భేదించవలసి ఉన్నది. ఆ చోట్లలో ఒకటి తాతి మానిసిదగ్గర, ఇంకొకటి కొండ చిలువదగ్గర. ఇంద్రజాలం పుస్తకం యువరాజు దగ్గర ఉన్నది. అతడు పుస్తకాన్ని చదివాడు. చంద్రకాంత వద్దకు చేరుకునేవిధానాన్ని అతడు పూర్తిగా మనసుకు పట్టించుకొన్నాడు. తాతిమనిషిఉన్న అరుగును భేదించే ఉపాయం ఆ పుస్తకంలో లేదు. కాని, దానిని గురించి ఆ పుస్తకంలో 'ఆ అరుగు మరొక ఇంద్రజాలానికి మార్గం. అది దీని కంటే చాల ఘనమైంది. దానిలో దాచివున్న ధనరాసులను

గురించి చెప్పశక్యంకాదు. దానిని నిర్మించటానికి కళా చాతుర్యం పరమావధి అందుకొన్నది. దానిని ఛేదించే మార్గం వేఱుగా ఉన్నది. దాని తాళంచెవి ఆ అరుగు మీద నిద్రిస్తున్న ఆతిమానిసి చేతిలో ఉన్నది' అని వ్రాసి ఉన్నది.

యువరాజు జ్యోతిష్కుణ్ణిచూచి "దాన్ని ఛేదించటం నావల్ల జరుగదా?" అని అడిగినాడు.

జ్యోతిష్కుడు:- ఆ తర్వాత చూద్దాం. ముందు చంద్రకాంతను చూడండి.

యువరాజు:- అదేమున్నది? అది యీవేళనే ప్రాప్తి అవుతుంది.

ఐంద్రజాలికులు ముగ్గురితో వీరేంద్రుడు ఇంద్రజాలంలో ప్రవేశించాడు. పుస్తకంలో ఉల్లేఖించినట్లుగా ముందుకు సాగిపోతున్నాడు. శిథిలగృహంలో ప్రవేశించి ఆతిమానిసిదగ్గరగా తాళంవేసిఉన్న వాకిలి తెరిచి ధనరాసులున్న గది గడచి తోటలో ప్రవేశించాడు.

ఆ తోటలోనుండి చపల లోగడ బయటకువెళ్ళిన పద్ధతిలోనే కాలువలోగుండా గోడదాటి పోయ్యాడు. ఆ తర్వాత పర్వతపు దిగువభాగాన ఉన్న కాలువగట్టు వెంట నడచి కొండచిలువఉన్న వసారాలో ప్రవేశించారు ఆ కొండచిలువ నోట్లోనే చపల పడిపోయింది.

అక్కడ గోడకు మనుష్యునియెత్తు ఉన్న ఒక నల్లని రాయి స్థాపితమై ఉన్నది. యువరాజు దానిని కాలితో

గట్టిగా తన్నాడు. అది తలుపు తెఱచుకొన్నట్లు తెఱచుకొని పక్కకు తొలగింది. క్రిందికి వెళ్ళటానికి మెట్లు కన్పించాయి. దివిటీ వెలిగించుకొని నలుగురూ లోనికి ప్రవేశించారు. ఆ కొండచిలువ బిగువను అమర్చిన చక్రాలూ, చీలలూ, తీగలూ వారికి కన్పించాయి. ఆ పనితనంవల్లనే చపల ఎదురుగాఉన్న ఱాతిమీద అడుగుపెట్టేసరికి కొండచిలువ ఊపిరితీయటం ప్రారంభించింది. ఆ ఊర్ధ్వవేగానికి చపల చిలువ నోట చొచ్చుకొనిపోయింది.

ఒక ప్రక్కగా గోడకు తాళంచెవి వ్రేలాడుతున్నది. దానిని తీసుకొని ఎదురుగాఉన్న గదితలుపులు తెఱచి నల్గురూలోనికి ప్రవేశించారు. అక్కడ నుండీ వాళ్లుకప్పు పైకి ఎక్కి ఒక సన్నని ఇఱుకైన గుహాలో చేరుకొన్నారు. ఆ గుహాలోనుంచే చపలా చంద్రకాంతల దగ్గరకు వెళ్ళాలి. నలుగురూ వెళ్ళుతున్నారు. అనతికాలంలో చంద్రకాంతను కలుసుకోబోతున్న వీరేంద్రసింహుని మనస్సు పరిపరివిధాల ఆలోచించ సాగింది. ఆమె కేశ సంస్కారం లేక చిక్కువడిన వెంట్రుకలతో వుంటుంది. నేనామె శిరోజాలను చేతితో దువ్వుతాను. ఆమె చెంపలపై కన్నీటి చారికలు కట్టి ఉంటాయి. ఆమె ముఖాన్ని నేను ఉత్తరీయంతో తుడుస్తాను. ఎన్నోరోజుల వియోగం తర్వాత కలిసే మా ప్రథమ సమాగమం అతిమధురంగా ఉంటుంది. ఆమె నా కన్నుల్లోకి చూస్తుంది. నేనామె మధురోజ్జ్వలవీక్షలు పరికిస్తాను. ఆ క్షణంలోని మా ఉభయుల హృదయాల మూగవేదన

అనుభవించి తీరవలసిందే. అయ్యో! ఆమె జీర్ణాంబరాలు మార్చటానికి వెంట ఏమీ లేకుండా వచ్చాసే! ఇదే రకంగా తేజసింహుడుకూడా తన ప్రియురాలైన చపలను కలుసుకోబోతూ తియ్యని కలలు కంటున్నాడు. ఇంతలో ఎదురుగా అనేక మనుష్యులు వస్తున్నట్లు శబ్దమైంది. వాళ్ళు చంద్రకాంతా, చపలలు, ఎదురువస్తున్నారేమో - అను కొన్నారు.

వారి ఆలోచనలకు విరుద్ధంగా రెండు తోడేళ్ళు పరస్పరం పోట్లాడుకొంటూ ఘూర్ణిల్లుతూ ఎదురువచ్చాయి. ఆ దృశ్యాన్ని చూచిన యువరాజుకు అడుగులు ముందుకు పడలేకపోయినాయి. తేజసింహునితో ఏదో చెప్పబోయినాడు. నోటినుంచి మాట రాలేదు. ఆ విధంగా నడుస్తూ నడుస్తూ చపలా చంద్రకాంతా ఉన్నచోటికి వెళ్లాను. అక్కడ వా రిద్దరూ లేరు. శల్యావశిష్టాలైన రెండు కళేబరాలు పడి ఉన్నాయి. వాటి ముఖాలు గుర్తుపట్టలేము.

తియ్యని కలలుగని గంపెడంత ఆశతో అక్కడకు చేరుకున్న యువరాజు మానసిక పరిస్థితి డోళాందోళితమైంది. "అయ్యో! చంద్రకాంతా! ఆ తోడేళ్ళే నిన్ను పొట్టను పెట్టుకున్నాయా! నీ స్థానంలో నే నున్నా ఆ తోడేళ్ళు నా రక్తాన్ని త్రాగైనా సంతోషించేవికదా! జీర్ణించిన నీ శరీరం ఇంకేమి మిగిలింది. అహోరాత్రాలు నాకోసం పరితపించి కన్నీరు మున్నీరుగా విలపించిన నిన్ను చివరకు నాదానినిగా చేసుకోలేకపోయాను. నీవు ఎక్కడికయినా

వెళ్ళిపోయావని అనుకోటానికి కూడా వీలులేదు. దుష్టశివదత్తుడు ఎదురుగానే ఉన్నాడు. తప్పక ఆ తోడేళ్ళు నిన్ను పొట్టపెట్టుకొన్నాయి. ఇక నే నేముఖం పెట్టుకొని జయసింహ మహారాజువద్దకు పోను. కుమారై కోసం శరీరమంతా కన్నులు పెట్టుకొని చూస్తున్న ఆయనకు నే నేం చెప్పను? విజయగఢ, చునారగఢ నౌగఢ రాజ్యాలు నేడు ఏకమయినాయి. కాని నేను నీదగ్గఱకే వస్తాను. నావెంట నీకు సేవచేయటానికి అనేకులను తెస్తాను. ఈ దరిద్రపు ఇంద్రజాలమూ ఈ దుష్ట శివదత్తుడూ మూర్ఖపు తోడేళ్ళు నా ప్రియమైన వస్తువును బూడిదపాలుచేశాయి. నాకీ ప్రపంచంలో మిగిలిఉన్నది లేదు. ఇదిగో వస్తున్నా, ఆగు. నన్నుకూడా నీవెంట తీసికొనిపో" అని ఎత్తయిన ఆ పర్వతంమీద నుండి దూకటానికి క్రిందికి తొంగి చూశాడు. అదే క్షణంలో ఆ వసారాగోడ ఒకటి పెఠిల్లని పగిలి అందులోనుండి మహాపురుషుడైన ఒక వృద్ధుడువచ్చి యువరాజు చేతిని పట్టుకొన్నాడు.

యువరాజు అతనిదిక్కు చూచాడు. అతనికి 80 సంవత్సరాల వయస్సుంటుంది. పొడుగైన తెల్లని గడ్డం నాభివరకు వచ్చింది. తలపైన జటాజూటం నేలకు తగులుతున్నది. శరీరమంతా బూడిదపూత ఉన్నది. విశాలమైన ఎఱ్ఱని కండ్లూ, కుడిచేతిలో త్రిశూలమూ కల ఆ యోగి ఎడమచేతిలో యువరాజు హస్తం పట్టుకొని కోపంతో శరీరమంతా కంపించిపోతుండగా ప్రళయకాల రుద్రునివలె

ఉచ్చైయిస్స్వరంతో "జాగ్రత్త! ఎవరికైనా వైధవ్యాన్ని కల్పించి పోయూవంటే!" అన్నాడు.

ఆ వనిమాటలకు పర్వతాలు ప్రతిధ్వనించాయి. ఇంద్ర జాలికులు ముగ్గురూ వణకుతూ నిలబడ్డారు. విశిష్టమైన యువ రాజు మనస్సు కుదుటపడసాగింది. అతడు ఆ మహాముని ఆపాదమస్తకం చూచి, "మీరు సాక్షాత్తూ ఈశ్వరులో మునీశ్వరులో అయిఉంటారు. నన్ను రక్షించటానికి మీరు తగిన సమయానికే వచ్చారు. మీవల్ల క్షత్రియుడనైన ఆత్మ హత్యకు పాల్పడే ఘోర సంఘటన తప్పిపోయింది. ఇప్పుడు మిగిలిన యీ చేతితో మీపై లంఘించి మీ త్రిశూలా హతితో ప్రాణాలు విడుస్తాను. బహుశః మీరు అందుకే వచ్చిఉంటారు. కాని మహాత్మా! మీ రన్నట్లు నే నెవరిని విధవను చెయ్యబోతున్నాను? నేను అవివాహితుడను. మహాత్ములై కూడా మీ రెందుకు అబద్ధాలు చెప్పుతారు? అయ్యో! నా చంద్రకాంత యిక్కడఉంటే మీరు నాపై వేసిన అపవాదుకు ఎంత చింతించేదో కదా!" అన్నాడు.

ఆ వృద్ధయోగి తిరిగి గొంతెత్తి "ఏమన్నావ్? నేను అబద్ధాలకోరునా? క్షత్రియులధర్మం ఆడినమాట తప్ప టమేనా? నీ వెవరినీ పెండ్లాండుతానని వాగ్దానం చెయ్య లేదా? ఇదిగో! ఈ వ్రాత ఎవరిదో చూడు!" అని తన జటాజూటంలో దాచిఉంచిన ఒక ఉత్తరాన్ని యువరాజు చేతికిచ్చాడు.

"అవును నేను వ్రాసిందే. 'నాకు సర్వసమ్మతమే' అని వ్రాశాను. దీని వెనకవైపు ఏమి వ్రాసియున్నది? అవును. ఇది వనకన్య వ్రాసిన ఉత్తరం. దీనిలోనే ఆమె నన్ను పెండ్లాడుతానని వ్రాసింది. నేనందుకు అంగీకరించాను. అయితే ఈ ఉత్తరం ఇతనిదగ్గరకు ఎలావచ్చింది, వనకన్యకు ఇతడేమవుతాడు?" అనుకొని ఆ మునితో "మీకు వనకన్య తెలుసునా?" అని అడిగాడు.

దానికి సమాధానంగా ఆ వృద్ధయోగి "ఇంకా తెలుసుకోవాలని ఉన్నదా? ఈ క్షణంలో ఆమెను నీ ఎదుట పెట్టనా?" అని గట్టిగా నేలను కాలితో తన్నాడు. ఆవెంటనే భూమి బద్దలై నవమోహనాకారంతో వనకన్య సాక్షాత్కరించి వీరేంద్రసింహుని చరణకమలాలపై వ్రాలింది.

# మూ యూ మ యి

## రెండవ అధ్యాయం

హఠాత్తుగా భూమిని చీల్చుకొని వనకన్య వీరేంద్ర సింహుని పాదాలపై బడేసరికి అతడు నిర్ఘాంతపోయాడు. చాలా సేపు ఆమె ఎట్లావచ్చింది, ఆ యోగి ఆమెకు ఎట్లా సహాకరించిందీ ఆలోచిస్తూ ఉండిపోయాడు. చివరకు "ఈ వనకన్య నాకు తెలిసినదే. ఈమె నాకు చాలాసహాయపడింది. ఈమెకు నేను చాలా వాగ్దానాలుకూడా చేశాను. అది చంద్రకాంతను కలుసుకోకుండా పూర్తిచేయలేను. మీ రిచ్చిన యీ ఉత్తరంలో నిబంధనలను చూడండి. వనకన్య స్వయంగా తన వివాహం చంద్రకాంతతో వివాహం జరిగే నాడే జరగాలన్నది. దానికి నేను ఒప్పుకున్నాను. కాని యీ ప్రపంచములో నా చంద్రకాంత లేనినాడు నేను ఎవరినీ పెండ్లిచేసుకోను. నిబంధనలలో ఇద్దరినీ ఒకేసారి పెండ్లి చేసుకోవాలని ఉన్నది" అన్నాడు.

యోగి వనకన్య దిక్కుగా తిరిగి "నన్ను అబద్ధాల కోరుగా చేయదలచుకొన్నావా?"

కన్య చేతులు జోడించి "లేదు మునీశ్వరా! ఈయ నను మీరు చంద్రకాంత ఎక్కడ మరణించిందో అడిగి కనుక్కోండి."

యువరాజుతో యోగి "ఈమె చెప్పేది విన్నావా!"

యువరాజు ఆశ్చర్యంతో "రాజకుమారి బ్రతికేఉన్నదా!"

యోగి "మొదట నే నడిగినదానికి సమాధానం చెప్పు." యువరాజు "ఈ గుహాలోనికి మొట్టమొదట నేను వచ్చి నప్పుడు ఈ స్థలములో చపలను చంద్రకాంతను చూచి మాట్లాడినాను. ఈవేళ ఈస్థానంలో రెండు శవాలను చూచి ... ...!" ఆతర్వాత మాటలు పెగలలా.

యోగి తేజసింహునిచూచి "ఓరి! నీ తెలివి తెల్ల వారా! ఈ శవాలనుచూచి స్త్రీల శవాలో పురుషుల శవాలో గుర్తుపట్ట లేకపోయావా?"

అంతట తేజసింహుడు శవాలను పరీక్షగా చూచాడు. యోగితో "క్షమించండి. మొదటిసారిగా చూడలేదు. యువ రాజుతో పాటు నేనూ కంగారు పడిపోయాను. ఈ శవాలు పురుషులవేకాని స్త్రీలవికావు."

యోగి "ఐంద్రజాలికుడవై కూడా పొరపాటు పడి నందుకు సిగ్గుపడాలి. నీవు పడిన పొరపాటుకు ఫలితంగా ఈపాటికి యువరాజు మరణించిఉండేవాడు. అటుచూడు— ఆ రెండు పర్వతాలకు నడుమ— ఈమాత్రం చెప్పితే నీకు చాలు. నీ గురువు ఈ గుహసంగతంతా నీకు చెప్పే ఉన్నాడు."

తేజసింహుడు యోగి వ్రేలెత్తి చూపిన దిక్కుగా చూచాడు. అతనిదృష్టి అక్కడే నిల్చిపోయింది. యువ రాజూ జ్యోతిష్కుడూ దేవీసింహుడూ అటుదిక్కుచూచారు. తేజసింహుడు 'అదే ఏమిటది!' అన్నాడు. అందరిదృష్టి ఇంకా ఎక్కువగా అటువైపు మరలింది.

కొంతసేపైన తర్వాత తేజసింహుడు మునీశ్వరునితో మాట్లాడుదామని అతనివైపు తిరిగాడు. అక్కడ యోగి లేడు, వనకన్య లేదు. వారు ఎటువెళ్ళారోకూడా తెలియదు. అక్కడ వనకన్యా, యోగీ ఉన్నంతసేపు వాళ్ళు వచ్చిన మార్గాలు తెరుచుకొనేఉన్నాయి. ఇప్పుడు వాటి గుర్తులు కూడా లేవు.

## 2

వీరేంద్రసింహుడు తేజసింహునితో "ఇంతసేపు నీవు అటుదిక్కుగా చూచింది ఏమిటి? అక్కడ నాకు ఏమీ కనుపించలేదు. వీరిద్దరూ ఎక్కడికి మాయమైపోయారు?" అన్నాడు.

తేజసింహుడు:- వాళ్ళెక్కడకి వెళ్ళారో నేనేమి చెప్పను? వారి పూర్తి వివరాలన్నా తెలుసుకోలేదు. ఇప్పుడు చాలా కష్టాలు పడవలసి ఉన్నది.

యువరాజు:-ముందు నీవు అక్కడచూచింది ఏమిటో చెప్పు.

తేజసింహుడు:- నేను చూచిన సంగతి చెప్పటానికి చాలా సమయం తీసుకుంటుంది. ఈ శవాల వాసనలో నిలబడలేకపోతున్నాను. ముందు బైటికి వెళ్ళుదాం పద. ఇక్కడనుండి వెళ్ళటానికి ముందు ఆ రెండు కొండలమధ్య మొదట మూసుకొనిఉన్న ఆ వాకిలి ఇప్పుడు తెరుచుకొని ఉన్నది చూడు. అదే ఆశ్చర్యకరమైన విషయం. మనం

రేపు ఇక్కడికి రావలసి ఉంటుంది. ఈ ఇంద్రజాలం లోపల నుంచి ఇక్కడికి రావటానికి ఐదు క్రోసులు పడుతుంది. చుట్టు తిరిగి గుహాలోనికి రావాలంటే పదహారుక్రోసులు పడుతుంది.

నలుగురూ ఇంద్రజాలం బైటికి వచ్చారు. అప్పటికి సగంరాత్రి అయింది. ప్రతిదినమూ ఒక జాముప్రొద్దుండగానే వారు బయటికి వచ్చేవారు. ఇవ్వేళ ఇంత ఆలస్యమయ్యేసరికి సైన్యములో ఆతురత హెచ్చింది. ఇప్పుడు వీరిని చూచి సద్దుమణిగింది.

తేజసింహుడు "ఈ వేళకు పండుకొనండి, చెప్పవలసింది రేపు చెపుతాను" అని వెళ్ళిపోయాడు.

# 3

తాను చూచిన విచిత్రసంఘటనలను తలపోసికొంటూ యువరాజు ఆ రాత్రి గడిపాడు. తెల్లవారకమునుపే ఆతురతతో తేజసింహుని డేరాలోకి వచ్చాడు. తేజసింహుడు ఇంకా పండుకొనే ఉన్నాడు. యువరాజు వచ్చినతర్వాత లేచాడు. యువరాజు "ఆ విశేషమేమిటో చెప్పు" అన్నాడు. దేవసింహుని, జ్యోతిష్కుణ్ణి అక్కడకు పిలిచాడు.

తేజసింహుడు:- మొట్టమొదట మనం గుహలో ప్రవేశించినప్పుడు మా గురువుగారు నాకు చెప్పినదంతా మీకు చెప్పాను. ఏమిచెప్పాను?

యువరాజు:- అందులో ఒక గుప్తధనం ఉందనీ ఆ ధనంపైని అతికష్టంమీద భేదించగలిగే ఇంద్రజాలం నిర్మిత

మైనదనీ దాని ఉపాయం నీకు నీ గురువు చెప్పాడనీ చెప్పావు.

తేజసింహుడు:- అవును. నిన్న నీకు ఆ యోగి చూపించిన రెండు కొండలమధ్య తెఱుచుకొన్న హాకిలిని చూపించాను. అది తెఱుచుకొని ఉండటంవల్ల మా గురువు చెప్పిన గుప్త ధనం ఎవరో ఎత్తుకొనిపోయారని నాకు తెలిసింది. ఆ ధనాన్ని తీసుకుపోయినవాడే చంద్రకాంతను కూడా తీసుకొనిపోయి ఉంటాడు. దానినిగూర్చి ఆలోచిస్తూ ఉన్న సమయంలోనే యోగి వెళ్ళిపోయాడు.

యువరాజు:- అయితే చంద్రకాంత ఇంకొక చిక్కులో చిక్కుకొన్నదన్నమాట.

తేజసింహుడు:- అనే అనుకుంటాను.

యువరాజు:- అయితే ఏమిచేద్దాం.

తేజసింహుడు:- ముందట గుహలోకి వెళ్ళి ధనాన్ని ఎత్తుకొనిపోయినచోట చూద్దాం. అక్కడ ఎత్తుకొనిపోయిన వాని గుర్తులు దొరికితే దానినిపట్టి ఆలోచించవచ్చు.

యువరాజు:- సరేకాని, ఒకసారి నీవు బదరీనాథుణ్ణి తీసుకొని ఖైదు చేయటానికి గుహదగ్గరకు వెళ్ళితే అప్పుడు గుహ తలుపులు నీకుకూడా రాలేదు తెలుసా! బహుశః అప్పుడే అతడెప్పుడో లోపలనుంచి తలుపువేసుకొని నీగుప్త ధనాన్ని కాస్తా వెల్లగించిఉంటాడు.

తేజసింహుడు:- అవును. అతనే శివదత్తునికూడా విడిపించి ఉంటాడు.

యువరాజు:- అయితే శివదత్తుడు విడుదలైన తర్వాత మన సైన్యంమీద తిరిగి దండెత్తినప్పుడు అతడే తిరిగి శివదత్తుణ్ణి బంధించి గుహలో పడేసిఉంటాడు. శివదత్తుడు మాయమైన తర్వాత అతని మంచంమీద దొరికిన చీటీకూడా ఆ అపహర్త వ్రాసిందే.

తేజసింహుడు:- అయిఉండవచ్చు.

యువరాజు:- దీనివల్ల అతడు మనకు స్నేహితుడు కూడా. అయితే స్నేహితుడై రాజకుమారిని ఎందుకు తీసుకు వెళ్ళుతాడు ?

తేజసింహుడు:- ఈ ప్రశ్నలకు సమాధానం ఇవ్వటం కష్టం. నాతల బొత్తిగా పనిచేయుటంలేదు. నీవు చెప్పిందే కాక శివదత్తుడు విడుదలైన తర్వాత ఒకసారి మీరు గుహలోని వెళ్ళటం తటస్థించింది. అప్పుడు మేము మిమ్మల్ని వెతుకుతూకూడా వచ్చాం. అప్పుడు చపలఅయినా గుహలోకి ఎవడో వచ్చాడని, శివదత్తుణ్ణి విడిపించుకొనిపోయి తిరిగి ఖైదుచేశాడని చెప్పలేదు. ఆమె అసలీచర్యనే తీసుకొని రాలేదు. పైపెచ్చు శివదత్తుణ్ణి గుహలో ఎప్పుడూ చూస్తున్నాననే చెప్పిందిగానీ భయపడవలసిన సమాచారమేదీ చెప్పలేదు.

యువరాజు:- సమస్య చాలా చిక్కుల్లోపడింది. అయినా నువ్వొ తప్పుచేశావు.

తేజసింహుడు:- నేనేమి తప్పుచేశాను ?

యువరాజు:- నిన్న యోగి నేను క్రిందపడకుండా చెయ్యిపట్టుకొన్న తర్వాత భూమిని తన్నేసరికి అది పగిలి

వనకన్య బయటకువచ్చింది చూశావా? ఆవిధంగా అతడు తన్నితే భూమి పగలటానికి అతడేమైనా దివ్యుడా? ఏమీ కాదు! భూమిలో ఏదో తంత్రముండి ఉంటుంది. అతడు వెళ్ళిన తర్వాత నువ్వుకూడా తన్నిచూస్తే ఏమిజరిగేదో! కాని నువ్వు మెదలకుండా ఊరుకున్నావు.

తేజసింహుడు:- అవును, పొరపాటు చేశాను! ఇప్పుడేంచేద్దాం?

"గుహలోనికి వెళ్ళకుండా ఇవ్వేళ అక్కడికే వెళ్ళితే సరి!" అన్నాడు యువరాజు. అతని అభిప్రాయాన్ని అందరూ సమర్థించారు. నలుగురూకలసి ఇంద్రజాలంలోనికి వెళ్ళారు. మామూలు దారివెంట యోగి వచ్చినచోటికి వెళ్ళారు. అక్కడ నిన్న ఉన్న శవాలు లేవు. భూమిఅంతా శుభ్రంగాఉన్నది. ఆశ్చర్యంగా అంతా చూచిన మీదట తేజసింహుడు గతదినం యోగి తన్నిన స్థలాన్ని పరీక్షించి చూచి గట్టిగా తన్నాడు.

వెంటనే భూమి బ్రద్దలై లోనికి వెళ్ళటానికి మెట్లు కనిపించాయి. సంతోషంతో నలుగురూ లోనికి ప్రవేశించారు. ఆ చీకటి గదిలో రెండవ దర్వాజాకొరకు వెతికారు. కాని వారికేమీ కనిపించలేదు. చేసేదేమీ లేక బయటికి వచ్చేశారు. వాళ్ళు తిరిగివచ్చినా అది తెరుచుకునే ఉన్నది. తేజసింహుడు "దీనిని లోపలనుంచి మూయటానికేదో కీలకం ఉండిఉంటుంది. బహుశః ఈ దారినుంచే యెవరో గుహలో ప్రవేశించి ఉంటారు" అన్నాడు.

నలుగురూ ఇంద్రజాలానికి జాతిమనిషి దగ్గరగా ఉన్న దానికి తాళంవేసి వచ్చేశాను.

అక్కడ ఒకరోజు ఉన్నతర్వాత వీరేంద్రసింహుడు ఫతహాసింహా సేనాపతిని చునారగఢానికి కార్యదర్శిగా నిశ్చయించి అతని నక్కడికి పంపించాడు. తాను నౌగఢానికి తరలి వెళ్ళాడు అక్కడ తన తండ్రిగారైన సురేంద్రసింహా మహారాజుని కలసికొన్నాడు. ఆ రాత్రికి ఏకాంతంగా సురేంద్రుడు మంత్రి జీతసింహునితో కలసి ఇంద్రజాలిక విశేషాలను కుమారుణ్ణి అడిగి తెలుసుకొన్నాడు.

వీరేంద్రుడు ఇంద్రజాలం విశేషాలను సవిస్తరంగా వివరించిన మీదట జీతసింహుడు. తన కుమారుడైన తేజసింహుణ్ణి అక్కడకు పిలిపించి "మీ మాయావులు ముగ్గురూ రాజకుమారిని వెంటపెట్టుకొని గుహలోనికి వెళ్ళండి అక్కడ ఉన్న చిన్న ఇంద్రజాలాన్ని రాకుమారునిచేత విధ్వంసం చేయించు. దానిని విధ్వంసంచేసే పద్ధతులను నీవు నీ గురువు చెప్పినట్లుగా రాజకుమారునికి తెలియజెయ్యి.

"ఇంద్రజాలాన్ని భేదించటానికిముందు కొద్దిమందిని తీసుకువెళ్ళి రాజ్ఞీ సమేతంగా శివదత్తుని ఇక్కడకు చేర్పించు. రాణీకొరకు వెంట ఒక డోలీని తీసుకొనివెళ్ళు. లోపలికి వెళ్ళినతర్వాత గుహద్వారాన్ని లోపలినుండి బంధించు. అక్కడ మహారాజుతో మాట్లాడేపనేమీ పెట్టుకోవద్దు" అని చెప్పాడు.

వీరేంద్రుడు ముగ్గురు ఇంద్రజాలికులతో కలిసి కొద్ది మందిని వెంటపెట్టుకొని గుహకు ప్రయాణమై పోయాడు. తెల్లవారేసరికి అక్కడకు చేరుకొని సైనికులను బయటఉంచి తాము నలుగురూ లోనికి వెళ్ళారు.

తేజసింహుడు శివదత్తుడు అతని భార్యను నౌగఢకు తీసుకొని వెళ్ళవలసిందిగా సైనికులకు ఆజ్ఞ ఇచ్చాడు. తాను తిరిగి లోనికి వెళ్ళిపోయాడు. సైనికులు రాణిని డోలీలోను, మహారాజును నడిపించీ తీసుకొని వెళ్లారు.

# 4

నౌగఢంలో శివదత్తుడూ అతని భార్యా ఉండటానికి జీతసింహుడు ఒక సుందరమైన భవనాన్ని యేర్పాటుచేసి సంకెళ్ళు లేకుండానే అందులో ఉంచారు. కాని భవనం చుట్టూగట్టి బందోబస్తు ఏర్పాటుచేశాడు.

రెండవనాడు సురేంద్రసింహుడు జీతసింహుడు ఏదో ఆలోచించి బదరీనాథుణ్ణి అతని ముగ్గురి అనుయాయి బందీలనూ తీసుకొని శివదత్తుని భవనానికి వెళ్ళారు. సురేంద్రునికి శివదత్తుడు రాజ్ఞీ సహితంగా ఎదురువెళ్ళి ఆహ్వానించాడు. బేడీలు తగిలించివున్న నలుగురు ఐంద్రజాలికూలు కూడా ప్రక్కగా ఉన్నారు.

"ఈసమయంలో తమరిక్కడికి ఎందుకు వచ్చారో తెలుసుకోవచ్చా?" అని సురేంద్రుణ్ణి అడిగాడు శివదత్తుడు.

సు రేంద్రుడు:- ఇంతవరకూ మీరు చేసిన క్రూరకర్మ అంతా క్రూరసింహుని చెప్పుడుమాటలకు తలఒగ్గి చేశారు. మీరు మమ్మల్ని ఎంతగా పరిమార్చాలని ప్రయత్నించినా ఆ పరమేశ్వరుడు మా అండనే ఉండి రక్షించాడు. క్రూర సింహుడు నాశనం అహమ్మదీలు తాము చేసిన దుష్టచింతన లకు ప్రతిఫలరూపంగా మాకు కీడుచెయ్యాలని తలపోస్తూనే మరణించారు. ఇక ఇప్పుడు మీ ఉద్దేశం ఏమిటి? ఈవిధంగా బందీలుగానే ఉంటారా? ఏదైనా మార్గముందా?" అని అడిగాడు.

శివదత్తుడు "మీ తండ్రీ కొడుకుల శౌర్యపరాక్ర మాలను ఎంతగా ప్రశంసించినా అది తక్కువే అవుతుంది. పరమేశ్వరుడు మీకు మనుమణ్ణి ప్రసాదించాలనీ అతనిని మీరు ఒడిలో కూర్చుండబెట్టుకొని లాలించాలని కోరు కుంటున్నాను. మీరు నేను చేసిన అపరాధాల నన్నిటినీ క్షమించండి. నాకిప్పుడు రాజ్యాభిలాష బొత్తిగా లేదు. మీరు చునారగఢాన్ని జయించిన సంగతి తెలుసుకున్నాను. మీ శౌర్యసాహసాలను దృష్టిలో పెట్టుకొని ఆ పరమేశ్వరుని కొరకు మీరు నాకొక చిన్నపని చేసిపెట్టండి" అన్నాడు.

సురేంద్రుడు కూర్చొని "మీ మనస్సులో వున్న దేమిటో చెప్పండి. శక్తివంచన లేకుండా సహాయపడటానికి సిద్ధంగా ఉన్నాను." అన్నాడు.

శివదత్తుడు: నా కోరిక వినండి. నా తర్వాత నాకు పిల్లలున్నారనే చింత లేదు. చునారగఢ కోటలో నాచేత

పోషింపబడే అనేక బంధువులైన వితంతువులున్నారు. వీరిని వాళ్ళు సుఖంగా జీవించటానికి తగిన ఏర్పాట్లు చెయ్యండి. అనేకబంధువులు ఇంకా ఉన్నారుగానీ వాళ్ళంతా పురుషులు. ఏదోఒక పని చేసుకొని జీవయాత్ర చెయ్యగలరు. ఇక నన్ను మీ రిప్పుడు విడిచిపెట్టండి. భార్యా సమేతంగా ఏదైనా అడవికి వెళ్ళి పరమేశ్వరుణ్ణిగూర్చి తపస్సు చేసుకుంటాను. నే నెవరికీ ముఖంకూడా చూపించను. ఇంతకంటే నాకు కోరిక ఏమీ లేదు.

సురేంద్రుడు:- మీ బంధుస్త్రీలను సంరక్షించే విషయాన్ని గురించి మీరు చెప్పినట్లే అన్ని ఏర్పాట్లు చేస్తాము. కాని మిమ్మల్ని విడుదల చేయటాన్ని గురించి ఎన్నో అనుమానాలు వస్తున్నాయి.

శివదత్తుడు:- యజ్ఞోపవీతం చేతిలో పట్టుకొని నేను గాయత్రిసాక్షిగా నా మనస్సులో దురుద్దేశాలు ఏమీ లేకుండా చెప్పుతున్నాను. మీకు చెరుపు చేయాలని మనసులో కూడా అనుకోను. మీరు ఏమీ శంకించవద్దు.

సురేంద్రుడు:- మీ వయస్సు అప్పుడే అడవులకు వెళ్ళి తపస్సు చేసుకోవలసినంత కూడా పెరగలేదు.

శివదత్తుడు:- వయస్సు ఎంతయినా కానీయండి. వీర పురుషులైతే మీరు నన్ను వదలండి.

సురేంద్రుడు:- వీరపురుషులైతే వదలమన్నారు గనుక వదులుతున్నాను. కాని నాకుమాత్రం మీ బట్టుమీద

నమ్మకం లేదు. మీ యిష్టంవచ్చినచోటికి మీరు కావలసినంత ధనాన్ని ఖర్చులకు తీసుకొని వెళ్ళండి.

శివదత్తుడు "నాకు ఖర్చులకు ఏమీ అవసరం లేదు. నా భార్య నగలనుకూడా ఇక్కడే విడిచిపోతాం" అని రాణి దిక్కుగా చూచాడు. ఆమె తన నగలను తీసివేసింది.

సురేంద్రుడు:- రాణి శరీరంమీద నగలను తీయించి మీరు మంచిపని చెయ్య లేదు.

శివదత్తుడు:-అడవికి వెళ్ళేవారికి ఈ మృత్యుసమానమైనవాటిని వెంట ఎందుకు తీసుకొని వెళ్ళాలి! ఇవి ఉన్న దగ్గరనుంచీ దొంగల బాధలతో ప్రశాంతంగా నిద్రకూడా పోలేము.

సురేంద్రుడు:- శివదత్తమహారాజా! నువ్వు మొన్నటి వరకూ చునారగఢ రాజ్యాధిపతివి. అటువంటి నిన్ను ఇవ్వేళ ఈ విధంగా పంపటం నా కేమాత్రం ఇష్టం లేదు. నువ్వు నా శత్రువువైనా నిన్నూ, నీ భార్యనూ చూచి నాకు చాలా విచారం కలుగుతోంది. నీ వెక్కడికైనా వెళ్ళవచ్చని విడిచిపెట్టాగాని నీవు నా రాజ్యంలోనే ఉండి పోతే కూడా సంతోషపూర్వకంగా నీకు అలాంటియేర్పాట్లు చేస్తాను.

శివదత్తుడు:- వద్దు. నాకు సెలవిప్పించండి. ఈ ఇంటి చుట్టూ కాపలావాళ్ళను తొలగిస్తే ఈ రాత్రికి రాత్రే నేను ఎక్కడికైనా వెళ్ళిపోతాను.

సురేంద్రుడు అతని యిష్టాన్ని కాదనలేక పోయాడు. నలుగురు ఐంద్రజాలికులూ అక్కడే ఉండి ఈ సంభాషణ అంతా విన్నారు. రాజు లిద్దరూ మాట్లాడుకోవటం పూర్తి యిన తర్వాత బదరీనాథుడు శివదత్తునితో "మేము తపస్సు చేసుకొనటానికి వెళతా మంటున్నారు. అయితే మమ్మల్ని మేమిచెయ్యమని మీ ఆజ్ఞ" అని అడిగాడు.

శివదత్తుడు:- మీ బుద్ధిపుట్టినపని చెయ్యండి. మీ యిష్టంఉన్న చోటికి వెళ్ళండి. నా తరఫునుండి మీకు సెలవు ఇవ్వటం జరిగింది. కాని మీకు ఇష్టమైతే ధర్మపరాయణుడూ, శౌర్యశాలీ అయిన వీరేంద్రునిదగ్గర పని చేస్తూ వుంటే నేను చాలా సంతోషిస్తాను.

బదరీనాథుడు "భగవంతుడు మీకు సర్వసౌఖ్యాలూ ప్రసాదిస్తాడుగాక! నేటినుండీ మేము వీరేంద్రసింహుడను రాజు అనుయాయులం. మీ చేతులతో మా బంధాలను విప్పండి" అన్నాడు. శివదత్తుడు నలుగురి సంకెళ్ళూ తన చేతులతో విప్పాడు. సురేంద్రసింహుడుగానీ, జీతసింహుడు గానీ, శివదత్తుని 'మీరు ఎందుకు సంకెళ్ళు తీస్తున్నా' రని అడ్డగించలేదు. విముక్తులైన ఐంద్రజాలికులు సురేంద్రుని వెనుకకు వెళ్ళి నిలబడ్డారు. అది చూచి జీతసింహుడు "మొదట మీరు నలుగురూ నాదగ్గరకువచ్చి ఆ తర్వాత అక్కడకు వెళ్ళి నిలబడండి. మొదట మామూలువిధులు పూర్తి చేసుకోవలసి ఉంటుంది" అన్నాడు.

బదరీనాథపండితుడూ, పన్నాలాలూ, రామనారాయణా, చున్నీలాలూ చిరునవ్వుతో జీతసింహునికి ఎదురుగా వచ్చారు. ఎవరూ ఏమీ చెప్పకుండానే యజ్ఞోపవీతాన్ని మాయాజాలపు సంచులను చేతితో పట్టుకొని ప్రమాణం తీసుకుంటూ "మేము నేటినుండి సురేంద్ర సింహమహారాజుకూ అతని వంశజులకూ నౌకరులయి విశ్వాసపాత్రంగాను శక్తివంచన లేకుండానూ మా పనులను మేము చేస్తాం. తేజసింహుణ్ణీ, దేవీసింహుణ్ణీ, జ్యోతిష్కుణ్ణీ మా సోదరులుగా భావిస్తాం" అని ప్రమాణాలు చేశారు.

జీతసింహుడు వారినినలుగురనూ కౌగిలించుకొన్నాడు. అప్పుడు ఇంద్రజాలికులు నలుగురూ సురేంద్రుని వెనుకకు వెళ్ళి నిలబడ్డారు.

సురేంద్రసింహుడు శివదత్తునితో "ఇక నేను సెలవు తీసుకుంటున్నాను. ఈ రాత్రికి మీరు మీ యిష్టంవచ్చిన చోటికి వెళ్ళిపోవచ్చు. ఏదీ, ఒకసారి హృదయాలు కలుపుకుందాం" అన్నాడు. శివదత్తుడు చేతులు జోడించి "నాకు మిమ్మల్ని కౌగలించుకొనే అర్హత లేదు" అన్నాడు. "అట్లా అనకండి" అని సురేంద్రుడు బలవంతంగా శివదత్తుని కౌగిలించుకొని ఉదాసీనుడై తన భవనములోనికి వెళ్ళిపోయాడు. వెళ్ళుతూ శివదత్తుని ఇంటికి కాపలాను రద్దు చేశాడు.

ఇంద్రజాలికులు నలుగురితో సురేంద్రుడు తన మందిరంలో కూర్చున్నాడు. చాలాసేపు శివదత్తుని దుర

దృష్టాల్నిగూర్చి చెప్పుకొన్నారు. జీతసింహుడు "మనకు అదనంగా నలుగురు ఐంద్రజాలికులు లభించినందుకు సంతోషంగా ఉన్నది. నాకు పదహారు రోజులు సెలవు ఇవ్వటానికే చాలా సంతోషం. చాలా దూరాన ఉన్న బదరీవనంలో తొందరపని ఉన్నది" అన్నాడు.

సురేంద్రుడు:- ఒకటి, రెండు రోజులపాటు సెలవులు నీవు చాలా తీసుకున్నావుగా ?

జీతసింహుడు:- అవును. ప్రభువు ఇంటిలోనే పని ఉండి తీసుకొన్నాను. ఇప్పుడు దూరం వెళ్ళవలసి పదహారు రోజుల సెలవడిగాను. ఆటంకమేమీ లేకుండా బదరీనాథ పండితుడు నా స్థానంలో పనిచేస్తాడు.

సురేంద్రుడు:- సరే వెళ్ళు. సాధ్యమైనంత త్వరగా వచ్చివెయ్యి.

సురేంద్రసింహునిదగ్గర సెలవుతీసుకొని జీతసింహుడు తన ఇంటికి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ ఐంద్రజాలికులను వెంటబెట్టుకొని సంగతి సందర్భాలను నచ్చజెప్పాడు.

## 5

వీరేంద్రసింహుడు తన ఇంద్రజాలికుల నలుగురినీ వెంటబెట్టుకొని గుహాలో అటు, ఇటు తిరుగుతున్నాడు. తేజసింహుడు యువరాజుకు అనేక చిహ్నాలను చూపుతూ 'చిన్న ఇంద్రజాలాన్ని నిస్సంశయంగా ఎవడో భేదించి గుప్తధనాన్ని కాజేశాడు. చంద్రకాంతనుకూడా వాడే ఎత్తు

కొని పోయిఉంటాడు. ఈ గుహలో నివాసయోగ్యమైన అనేక భవనాలూ ఉద్యానవనాలూ ఉన్నాయని మాగురువు గారు స్వయంగా చెప్పగా విన్నాను. బహుశః ఆదొంగ ఇక్కడే దేనిలోనైనా దాగుకొనిఉన్నా మనం ఆశ్చర్య పడనవసరం లేదు" అన్నాడు.

యువరాజు:- సాధ్యమైనంత త్వరగా మనం పని పూర్తి చేయవలసి ఉంటుంది.

తేజసింహుడు:- మాతోరండి. ఇప్పుడే పని మొదలు పెడదాం.

అని తేజసింహుడు యువరాజును సెలయేరు ప్రారంభ మైన కొండదిగువకు తీసుకొని వెళ్ళాడు. ఆ సెలయేటికి ఉత్తరంగా నలభై చేతుల దూరంలో కొద్దిగా నేలను త్రవ్వాడు. తేజసింహుడు యువరాజుతో "ఈ చిన్న ఇంద్ర జాలాన్ని భేదించి గుప్తధనాన్ని తీసుకొనే విధానం ఒక లోహపు పాత్రమీద చెక్కి ఇక్కడ భూమిలో పాతిపెట్టారు. కాని అది ఇక్కడ కనుపించటంలేదు" అన్నాడు.

అంతలో ఆ స్థానంలో రాజకుమారునికి ఒక ఉత్తరం దొరికింది, ఆ వుత్తరంలో—

"ఇప్పుడు త్రవ్వుతావెందుకు? ఇక్కడ నీకు కావల సిన వస్తువు లేదు. ఉన్నది అపహృతమైనది. ఇంద్రజాలం కూడా భేదించటం జరిగింది. ఇక చేతులు నలుపుకొని పశ్చాత్తాప పడు" అని వ్రాసిఉన్నది.

తేజసింహుడు యువరాజును చూచి "ఇంద్రజాల భేదనం జరిగిందని నిశ్చయమైంది" అన్నాడు.

యువరాజు:- సరేకానీ ఇంద్రజాలం ఛేదించటం జరిగిందిలే! దాని తలుపులన్నీ తెరుచుకొని ఉండాలికదా-"

"తప్పకుండా తెరుచుకొనేఉంటాయి" అని తేజసింహుడు యువరాజును కొండలమీదికి ఎక్కించి దింపి ఒక గుహదగ్గరకు తీసుకొనివెళ్లాడు. అది ఒక్క మనుష్యుడు వెళ్ళటానికి మాత్రమే వీలైనది. ఒక్కొక్కడు ఆ గుహలో ప్రవేశించారు. లోపలికి వెళ్ళినతర్వాత గుహ విశాలంగా ఉన్నది. అక్కడినుంచి నలుగురూ కలసి వెళ్ళుతున్నారు. కటికచీకటిఅయిన కారణంగా చేతులతో తారాడుతున్నారు. వీరేంద్రసింహుని చెయ్యి ఒక మూసిన ద్వారానికి తగిలింది. దానిని గట్టిగా కొట్టటంతోటే తెరుచుకొన్నది. ఇక అక్కడ మంచి మంచి వెలుతురు దొరికింది.

నలుగురూ లోనికి వెళ్లారు. ఒక ఉద్యానవనం కనుపించింది. అది అప్పుడే తుడిచినట్లు పరిశుభ్రంగా ఉన్నది. దానిలో భవనాలు లేవు. మధ్యగా జలయంత్రం మాత్రం ఉన్నది. దానికి తొట్టె ఎక్కడఉన్నదికూడా తెలియదు.

తోటలో అటు ఇటు తిరిగిచూచినమీదట వారికి పర్వతాగ్రానికి చేరుకొన్నట్లు అర్థమైంది. జలయంత్రాన్ని సమీపించగానే వారికొక విచిత్రం కనుపించింది. అక్కడ స్త్రీల చేతి గాజులు రెండు పడిఉన్నాయి. వాటిని రాకుమారుడు చంద్రకాంతవని గుర్తు పట్టాడు. అవి ఇక్కడ

ఎట్లా వచ్చాయని ఆలోచిస్తూ ఉండగానే తేజసింహుని దృష్టి ఒక కాగితంమీద పడింది. ఆ కాగితం నలిగిఉంది. దానిలో —

"జాగ్రత్తగా వెళ్లు! వంచకులు వెంటాడుతారు. వారికేమీ తెలియకూడదు. తెలిస్తే నీకూ యువరాజుకి పెద్ద నష్టంజరుగుతుంది. వీలు చిక్కితే నేపు వస్తాను.—అతడే"

దానిని చదివిన తేజసింహుడు ఏదో ఆలోచనలో పడ్డాడు. "యువరాజు ఏమిటి ఆలోచిస్తున్నావు. ఏమి వ్రాసి ఉన్నది?" అని అడిగాడు.

తేజసింహుడు ఆఉత్తరాన్ని యువరాజుకు ఇచ్చాడు. అతడు దానిని చదువుకొని "దీనిలో నన్నుగుఱించీ వన కన్యను గుఱించీ వ్రాసిఉన్నది. ఎవడు వ్రాశాడో కాని తెలియటంలేదు" అన్నాడు.

తేజసింహుడు:- దీనికంటె మఱొక ఆశ్చర్యకరమైన విషయాన్ని గుఱించి నేను ఆలోచిస్తున్నాను. ఈ దస్తూరిని నేను కొద్దిగా గుర్తుపట్టకల్గాను. కాని పూర్తిగా గుర్తుపట్టలేకున్నాను. ఆ వ్రాసినవాడు తెలియకుండా ఉండాలని అక్షరాలను మరొకరకంగా వ్రాయటానికి ప్రయత్నించాడు.

యువరాజు:- సరే! ఈ చీటి ఉపయోగిస్తుందేమో దాచి ఉంచు. తర్వాత పనిచెయ్యి.

తిరిగి నలుగురు తిరగసాగారు. తోటకు ఒక మూల వీరికి నాలుగు చిన్న చిన్న కిటికీలు కనుపించాయి. అవి ఒకదాని సరసన ఒకటి ఉన్నాయి. మొదట నలుగురూ

ఎడమవైపు కిటికీలో ప్రవేశించారు. కొద్ది దూరం వెళ్ళిన తరువాత ఒక ద్వారం కనుపించింది. కానీ దానిని దాటి వెళ్ళటానికి బొత్తిగా వీలులేదు. దానికి దిగువభాగాన ఒక ప్రమాదకరమైన పర్వతం కనుపించింది.

అటు ఇటు చూచి బాగా పరీక్షించినమీదట ఆ దర్వాజా ఆనాడు తేజసింహునికి యోగి చూపించినదేనని తేలింది. ఇక్కడనుండి ఎన్నో మైళ్లపాటు చంద్రప్రకాశంలో చపల దిక్కు లేకుండా పడిఉన్న వనాలు స్పష్టంగా కనుపిస్తున్నది.

వారు తిరిగి అదే కోటలోకి వెళ్ళారు. అక్కడ రెండవ కిటికీలోనుంచి దూరి వెళ్లారు. అంతా అంధకారం. కొద్దిగా దూరం వెళ్ళినతర్వాత వెలుగుకన్పించింది. అక్కడ ఒక వాకిలి తెఱచి ఉన్నది. వారు దానిలోనుంచి బైటికి పోయి నలుదిక్కులూ పరికించసాగారు.

విశాలమైన మైదానంతప్ప ఏమీ కన్పించలేదు. తేజసింహుడు ఆ మైదానంలో తిరగాలని అభిప్రాయ పడ్డాడు. కాని వేరే కారణాలవల్ల ఆ పని మానుకొన్నారు. దానికి కారణాలుకూడా ఎండ ఎక్కువగా ఉండటం, యువరాజు 'మఱొకప్పుడు చూద్దాములే' అనటంతప్ప వేఱే ఏమీకాదు.

నలుగురు వెనకకు తిరిగివచ్చి మూడవ కిటికీలోనుంచి లోపలికి ప్రవేశించారు. అక్కడ ఉద్యానవనం కన్పించింది. ఆ ఉద్యానవనంలో చెలికత్తెలతో కలసి వనకన్య కులాసాగా స్తోంది. వీరేంద్రసింహుణ్ణి చూచిన వనకన్య చెలికత్తె

లతో బాటు తోటకు ఒకమూలగా పారిపోయి అక్కడ అదృశ్య అయిపోయింది.

నలుగురూ ఆమెను వెంటాడారు. కానీ, వాళ్ళ కేమీ కన్పించలేదు. కాని వనకన్య అంతర్ధానమై పోయినచోట మూసిన వాకిలి కన్పించింది. దానిని తెరవాలని విశ్వ ప్రయత్నం చేశాడుకాని ఫలించలేదు.

ఆ తోటకు ఒకవైపున చిన్న భవనం ఒకటి ఉన్నది. యువరాజు తన ఐంద్రజాలికులతో కలసి ఆ భవనములోనికి వెళ్ళి కూర్చున్నాడు. ఈవనకన్య ఇక్కడకు ఎల్లా వచ్చింది? అసలీమె నివాసస్థాన మిదేనా? మమ్మల్ని చూచి పారి పోయిన కారణం ఏమై ఉంటుంది? ఇప్పుడప్పుడే మమ్మల్ని కలుసుకోటానికి ఇష్టం లేదా? ఇంకా ఈ విధంగానే ఆలోచ నలు చేయ సాగాడు.

ఈ తోటలో మేడిచెట్లు చాలా ఉన్నాయి. ఒక సెలయేఱుకూడా ఉన్నది. నలుగురూ మేడిపండ్లుతిని సెల యేటి నీరు త్రాగి ఆ భవనంలోనే శయనించారు. అందరూ ఆ రాత్రికి అక్కడే ఉండి మఱునాడు వెళ్ళిపోదా మను కున్నారు.

దేవసింహుడు తన మాయాజాలపు సంచిలోనుంచి దీపంతీసి వెలిగించాడు.

యువరాజు:- చంద్రకాంతమీద ప్రేమవల్ల మనకీ దుర్గతిపట్టింది. ఇంత జరిగినా ఇప్పటివరకూ మన కార్య క్రమం ఆశావహంగా మాత్రం లేదు.

తేజసింహుడు:- రాకుమారి సురక్షితంగానే ఉన్నది. ఆమె మిమ్మల్ని సురక్షితంగానే కలుసుకొంటుంది. ప్రపంచంలో ఏ వస్తువును సంపాదించటానికి అధికంగా శ్రమ పడవలసి వస్తుందో; ఆ వస్తువు లభించిన తర్వాత అంత యెక్కువగానూ మధురానుభూతి కల్గిస్తుంది.

తేజసింహుడు:- అయితే చపలమాత్రం నా కోసం ఏమి కష్టపడింది! ఆమె పడే కష్టాలు చంద్రకాంతి కోసం తప్ప.

జ్యోతిష్కుడు:- తేజసింహా, చపల నీ జాతికి చెందినదేనా ?

తేజసింహుడు:- అదేమీ నాకు తెలియదు. కాని పరస్పరం ప్రేమించుకున్నవారికి కులాల ప్రసక్తి ఏముంటుంది?

జ్యోతిష్కుడు:- ఆమె తల్లిదండ్రులు లేరా? ఒక వేళ ఉంటే నీ కులానికి చెందనివైతే చపలను నీ కివ్వటానికి వాళ్ళంగీకరించవద్దా ?

తేజసింహుడు:- ఒకవేళ అటువంటి ఆటంకాలే వస్తే చపలను చంపి నేను చస్తాను.

యువరాజు:- చపలను గురించి చెప్తే నీవు నాకేమి బహుమాన మిస్తావు ?

తేజసింహుడు:- బహుమానంగా చపలనే మీకర్పణం చేస్తాను.

యువరాజు :- జాగ్రత్త, చపలనాకిష్టి పోతుంది.

తేజసింహుడు:- అవునండీ. మీాకే అధీనం చేస్తా - మీాకే అధీనం చేస్తా.

యువరాజు:- చపల మా కులానికి చెందినదే. ఈమె తండ్రి మాయాజాలం నేర్చిన ఒక పెద్ద జమీాందారు. చపల పుట్టిన ఏడు దినాలకు తల్లి మరణించింది. చిన్నప్పటినుంచీ తండ్రి పెంచి మాయాజాలం నేర్పాడు. కొన్ని సంవత్సరాల క్రిందట అతడూ మరణించాడు. జయసింహ మహారాజు చపలతండ్రిని చాలా ఆదరించేవాడు. అతని మరణకాలంలో తన యావదాస్తిని చపల కివ్వవలసిందిగా మహారాజు అధి నంలో పెట్టాడు. జయసింహ మహారాజుకూడా చపలను తన కన్న కూతురువలెనే చూచేవాడు మహారాణి కూడా అంతే. రామమూారికీ, చపలకూ చిన్నప్పటినుండి స్నేహం. వాళ్ళప్రేమ చాలా దృఢతరమైంది.

తేజసింహుడు:- ఇవ్వేళ మీారునాకు చాలా సంతోష కరమైనవార్త విన్పించారు. చాలా రోజులనుంచి మిమ్మల్నీ విషయం అడుగుదామనుకుంటున్నా గాని అశ్రద్ధ చేశాను. అయితే ఈ సంగతులన్నీ మీాకెట్లా తెలుసు.

యువరాజు:- చంద్రకాంత నాకు స్వయంగా చెప్పింది.

తేజసింహుడు:- అయితే చాలా మంచిది.

రాత్రిఅంతా రకరకాల సంభాషణలతోనే గడచింది. ఎవరికీ నిద్రబట్టలేదు. తెల్లవారి దినకృత్యాలు ముగించు కొని ఆ సెలవేటిలో స్నానంచేసి సంధ్యా, దేవతారాధనలు

ముగించుకొని కొద్దిగా మేడిపళ్ళు తిన్నారు. ఆ ఆ తర్వాత ఆ తోటలోకి వచ్చిన త్రోవనే తిరిగి బయటకివచ్చి నాలుగవ కిటికీలోనుండి అవతలికి ప్రవేశించారు. దానిలో ప్రవేశించ గానే ఆశ్చర్యచకితుడై యువరాజు వివిధ వృక్షసంశోభిత మైన ఉద్యాన వనాన్ని చూడసాగాడు.

## 6

యువరాజుతో తేజసింహుడు "ఈ తోటనుచూచి మీరు ఎందుకు ఆశ్చర్యపడతారు. అంత విచిత్రమైన విష యాలు ఇందులో ఏమున్నాయి?"

యువరాజు "ఈ తోట నాకు చిరపరచితం" ఆశ్చ ర్యంగా తేజసింహుడు "మీరు దీనిని ఎప్పుడు చూచారు?"

యువరాజు:- నన్ను సైన్యంలో నుండి ఎత్తుకపోయిన వారు నన్ను దాచినచోటు ఇదే. ఇక్కడే నాకు మెలకువ వచ్చింది. చంద్రకాంత చిత్రపటాన్ని చూచింది కూడా ఇక్కడే. ఇక్కడే భోజనం చేసినతర్వాత స్పృహతప్పి పడి పోయి మఱొక తోటలో మేలుకొన్నాను. అదిగో ఆ యిగువైపులా నేరేడుచెట్లుగల కోనేటిలో నేను స్నానం చేశాను.

తేజసింహుడు:- మేముకూడా ఈ తోటలో విహరిస్తే బాగుంటుంది.

యువరాజు:- నడు! బహుశః చంద్రకాంత చిత్ర పటం ఉన్న గది తలుపులు ఇవ్వేళ తెఱచేఉంటాయి.

నలుగురూ ఆ తోటలో తిరగటం ఆరంభించారు. ఆ తోట మూడవభాగంలో తోటయొక్క వివరాలన్నీ వ్రాసిఉన్నాయి. గది వాకిలి తెఱుచుకొనే ఉన్నది. ఆనాడు యువరాజు చూచిన వస్తువులన్నీ యీనాడుకూడా కన్పించాయి. అంతా పరిశుభ్రంగా ఉన్నది.

యువరాజు మొట్టమొదట ప్రవేశించిన నాటి పరిస్థితి వేరు. ఆనా డతడు ఆశ్చర్య సంభ్రమాలతో చీకాకై ఉన్నాడు. అందుచేత అప్పుడు తోటను వివరంగా పరిశీలించ లేక పోయాడు. నేడు ఐంద్రజాలికులు వెంట నుండటంవల్ల అతనికి భయపడవలసిన పని లేకపోయింది. అంతేగాక అనేక సమస్యలు పరిష్కారం కాగలవనే ఆశ నేడు యువరాజును నిశ్చింతపరచాయి. ఆనందంతో ఐంద్రజాలికుల వెంట తిరగటం ప్రారంభించాడు. ఈ ఉద్యానవనం గదులుగాని వాకిళ్ళుగాని నేడు మూసి లేవు. యువరాజు ఆ ప్రదేశాన్నంతా కలియదిరుగుతూ ఐంద్రజాలికులకు వివరించి చెబుతూ "ఇక్కడ నేను కూర్చున్నాను. ఇక్కడ నేను భోజనం చేసినాను, ఇక్కడ నేను నిద్రపోయాను" అని చెప్పుకు పోతున్నాడు.

తేజసింహుడు:- మధ్యాహ్నం భోజన మైనతర్వాత నిద్రలో ఉండగా మిమ్మల్ని ప్రవేశపెట్టిన గది బహుశః ఇక్కడే యెక్కడో ఉండిఉంటుంది. బాగా వెదికి చూద్దాం.

యువరాజు:- నాకూ వెదకాలని ఉన్నది.

దేవీసింహుడు:- ఇక్కడకు మీరు మొట్టమొదట వచ్చినప్పుడు స్నానానికి ఏర్పాటులు చేసి కట్టుకోటానికి విలు

వైన బట్టలిచ్చి పూజా పునస్కారాలకు వస్తుసామాగ్రులు పెట్టి కమ్మని భోజనంపెట్టి మిమ్మల్ని బాగా గౌరవించారు కదా! ఇవ్వేళ అటువంటి యేర్పాటు లేవీ లేవే?

యువరాజు:- అదంతా మీరువచ్చిన వేళా విశేషం.

తిరుగుతూ తిరుగుతూ నలుగురూ ఒక వాకిలిని తెరుచుకొని మరొక తోటలోనికి ప్రవేశించారు.

యువరాజు ఆ తోటను చూచి "నేను రెండోసారి స్పృహ తెచ్చుకొన్న తోట యిదే. ఇక్కడే నన్ను స్త్రీలు బంధించారు. ఇవ్వేళ ఒక్క యువతికూడా కన్పించటం లేదు. ఏమి చిత్రనగరం? ఆనాడు ఒక రకంగా; ఈనాడు మరొకరకంగా ఉన్నది. అయినా చూద్దాం. ఆ చిత్రపటం ఉన్న దర్బారు ఆవిధంగానే ఉన్నదేమో" అని యువరాజు ముందుకు దారితీశాడు. అతని వెనుక ఐంద్రజాలికులు ముగ్గురూ నడుస్తున్నారు.

# 7

విజయగఢ్ మహారాజైన జయసింహానికి ఇంద్ర జాల భేదనం జరిగినప్పటికీ చంద్రకాంత దొరక లేదని తెలి సింది. కానీ ఆమెమాత్రం జీవించ ఉన్నదనీ వీరేంద్రుడు ఆమెను వెదకటానికి గుహలో తిరుగుతున్నాడనీకూడా తెలి సింది. ఈ విచారకరమైన వార్తలు జయసింహుని సంక్షోభ పెట్టాయి. మహారాజ్ఞి రత్నగర్భ పుత్రికా వియోగంవల్ల చిక్కి శల్యమైపోయింది. ఇంకా అంతఃపురంలో ఉన్న దాస

దాసీజనులు సంతాపతప్తులై నిరంతర శోకంలో మునిగి ఉన్నారు.

జయసింహ మహారాజు ఒకనాడు దర్బారుతీర్చి కూర్చుండి ఉన్నాడు. హరదయాళమంత్రి అత్యవసరమైన పత్రాలను చదివి విన్పిస్తూ రాజాజ్ఞను నిర్వహిస్తూ ఉన్నాడు. ఇంతలో ఒక గూఢచారి ఏదో వ్రాసి ఉన్న కాగితాన్ని పుచ్చుకొని దర్బారులో ప్రవేశించాడు. హరదయాళ మంత్రి అతనిని "ఏమిటీ కాగితం తెచ్చావు" అని అడిగాడు.

గూఢచారి :- ఈ రకంగా వ్రాసిన కాగితాలు నగరంలో పలుతావులలో అతికించి ఉన్నాయి. వీధులలో గోడలకీ, చెట్లకీ త్రోవపొడుగునా ఎక్కడ చూచినా ఇటువంటి కాగితాలు కన్పిస్తున్నాయి. నేను ఒకరిచేత ఈ కాగితాన్ని చదివించుకొని విని, కంగారు పడి దానిని మీకు చూపిద్దామని తెచ్చాను. ఆ కాగితాలను చదువుకొన్న జనం భయభ్రాంతు లగుతున్నారు" అని చెప్పాడు.

మంత్రి ఆ కాగితాన్ని తీసుకొని మహారాజుకు చదివి విన్పించాడు. దానిలో:—

"నాగధ విజయగఢ మహారాజులు ప్రస్తుతం చెప్పలేనంత విజయగర్వంతో ఉన్నారు. బహుశః వారు చునారగఢాన్ని జయించామనీ శత్రువులిక మిగిలిలేరని అనుకొని ఉంటారు. వీరేంద్రసింహుడుకూడా అదేగర్వంతో హాయిగా గుహాలో విహరిస్తున్నాడు. కాని ఈ అందరికీ అజేయశత్రువు

నైననేను జీవించి వున్నానని తెలియదు. ఇకనేను నాపని ప్రారంభిస్తా. ఈ ఉభయదేశాల రాజుల్నీ సర్దారులనూ ఇతర ముఖ్యులనూ ఏరియేరి చంపుతాను. రెండు రాజ్యాలనూ నామరూపాలు లేకుండా చేస్తాను. ఇంత చేసి కూడా నేనెవరికీ పట్టు పడను. పెద్ద పెద్ద ఐంద్రజాలికులున్నారను కొంటున్నారేమో! వాళ్ళు నా కాలి గోటికి సరిపోరు. నేనూ ఐంద్రజాలికుణ్ణే. కాని దొరికిన వాళ్ళను ఖూనీ చెయ్యటం తప్ప ఖైదీ చెయ్యటం మనపనిగాదు. మీ ప్రాణాల మీద మీకు తీపిఉంటే ఇక్కడనుంచి పారిపొండి. జాగ్రత్త! జాగ్రత్త!! జాగ్రత్త!!!

ఐంద్రజాలిక గురుసింహుడు – జాలింఖాన్"

ఆ ప్రకటనను విని జయసింహమహారాజు భయపడిపోయాడు. మంత్రితో సహా దర్బారులో ఉన్న వాళ్ళందరికీ భయం కల్గింది. కాని ఊరడింపు మాటలుగా మహారాజు "మేము ఇటువంటి తుచ్ఛులు భయపెడితే భయపడేవాళ్ళంగాదు. మీరెవ్వరూ భయపడకండి. ప్రభుత్వంవారు జాలింఖాన్‌ను పట్టుకోవటానికి ఏర్పాట్లన్నీ చేశారని ఇప్పుడే పట్టణంలో చాటింపిస్తా. అతనెవర్నీ ఏమీ చేయలేడు. ఎవరూ భయపడి ఇల్లువిడిచి పెట్టకండి! పట్టణాన్ని సంరక్షించటానికి తగిన ఏర్పాటులు జరుగుతాయి. ఆ నీచుణ్ణి పట్టుకోటానికి ఇప్పుడే గూఢచారులు బయలుదేరుతారు" అని ఆనాటికి దర్బారు చాలించాడు. మంత్రిని తీసుకొని ఏకాంతంగా జాలింఖాన్ను గురించి విచారణ ప్రారంభించాడు. మంత్రి "మనదగ్గర

సమయానికి ఐంద్రజాలికులు కూడా లేరు" అన్నాడు. మహారాజు "సురేంద్ర సింహునికి ఈ సమాచారమంతా ఉత్తరం వ్రాసి పంపటం మంచిది." అన్నాడు. రాజాజ్ఞ ప్రకారం మంత్రి ఉత్తరాన్ని పూర్తిచేసి ఒక గూఢచారిని రహస్యంగానే నౌగఢకి పంపించాడు. ఆ తర్వాత మహారాజు మందిరానికి గట్టి బందోబస్తు జరిగింది. సమాలోచనలు పూర్తిచేసుకొని మంత్రి తన నివాసానికి వెళ్ళిపోయాడు. మహారాజు ఈ ప్రమాదభరిత రహస్యాన్ని రాణికి తెలియ జెప్పాడు. స్త్రీలలో కుడా కలవరం హెచ్చింది. మరునాడు దర్బారులో కూడా గూఢచారి మరొక కాగితాన్ని చేబు చ్చుకొని వచ్చాడు. వెనకటి మోస్తరుగనే నగరమంతా ఈ కాగితాలు అంటించి ఉన్నాయని చెప్పాడు. మంత్రి ఆ ప్రకటనను రాజుకు చదివి వినిపించాడు. దానిలో "ఓ హో హోహో! నీ వేమీ చెయ్యలేక నౌగఢనుంచి సాయం అర్థించావా? నేను నౌగఢలో కూడా ఉపద్రవాన్ని చెల రేపానని నీకు తెలియదు. మీ గూఢచారి నన్ను తప్పించు కొని ఎక్కడకు వెళ్ళతాడు. నేను వాణ్ణి చంపేశాను. ఎవరిని పంపించినా మీరు వాళ్ళ శవాలు తెచ్చుకో వలసిందే. నగరం వెలుపల క్రోసెడు దూరంలో శవం పడివున్నది.

—జాలింఖాన్"

ఈ ప్రకటన రాజును మరింత ఆందోళన పరచింది. అందరి మనసులోనూ తుఫాను చెలరేగింది. రాజాజ్ఞ ప్రకారం చాలామంది గూఢచారి శవాన్ని తేవటానికి వెళ్ళారు. ఆ శవాన్ని దర్బారు వెలుపలికి తెచ్చేసరికి జనం

మూగారు. అందరి నోటివెంటా జాలింఖాన్ పేరు వినబడు తోంది. అతనిపేరు వింటేనే ప్రజలు హడలిపోతున్నారు. గూఢచారి శిరస్సులేదు. కబంధానికి అతను తీసుకుపోయిన ఉత్తరం కట్టి ఉన్నది.

మహారాజు లోలోపల భయపడుతునే ప్రజాసికానికి ఊరడింపు మాటలు వల్లెవేశాడు. మంత్రితో "జాలిం ఖాన్ను పట్టుకున్నవారికి పదివేల రూపాయల బహుమానం ఇవ్వబడు"నని ప్రకటించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఈసారి నాగధానికి సందేశం కొనిపోవటానికి అయిదుగురు నియమితులైనారు. ఆ అయిదుగురూ నాగధానికి వెళుతున్నారన్నమాటే గాని జాలింఖాన్ భయంవల్ల వణికి పోతున్నారు. మరునాడు దర్బారుకి మరొక ప్రకటన తీసు కొని వేగులవాడు ప్రవేశించాడు. ఆ ప్రకటనలో—

"ఐదుగుర్ని పంపి స్తేమాత్రం నన్ను తప్పించుకొని ఎక్కడికి వెళ్ళగలుగుతారు? వాళ్ళని చంపటం పూర్తి అయింది. రేపు నీ ఇంట్లో ప్రవేశిస్తా. జాగ్రత్తగా ఉండు. నన్ను పట్టుకున్నవాళ్ళకు పదివేలరూపాయలిస్తా నన్నావుగా! నేనూ ఆ పట్టుకునేవారికి ఇరవై వేల రూపాయలిస్తా.

— జాలింఖాన్"

ఈ ప్రకటనా పరంపరలతో నగరవాసులూ, మహా రాజూ ప్రాణభయంతో వణికిపోసాగారు. రాజుకు నాగధా నికి వార్త పంపించే సాహసం లేకపోయింది. ఒక చిన్న ఉత్తరంకోసం ఒక పెద్ద పటాలాన్ని పంపటం శౌర్యపరాక్ర

మూలను లోటనిపించింది. ఒక గూఢచారివల్ల నగరవాసులు రెండుమూడు రోజుల్లో ఖాళీచేసి పోతారనికూడా రాజుకు తెలియవచ్చింది. ఈ వార్త రాజుకు మరీ తల తీసివేసిన ట్లయింది ఐదుగురి శవాలూ తెప్పించటం జరిగింది. ఈసారి గూఢచారులు ఉరిపాలయినారు. వాళ్ళ కుత్తుకలకు త్రాడు ఒరసి కొన్న గుర్తులున్నాయి. ఈ ఘోర హత్యాకాండ మహారాజును అత్యంత ఖేదపచింది. అతనికి దిక్కుదోచని పరిస్థితి ఏర్పడ్డది. అప్పుడే ఎదురుగా బదరీనాథ పండితుడు రావటం కన్పించింది.

పండిత బదరీనాథుని నేటి పటాటోపం అద్భుతంగా ఉన్నది. వేలు వేలునా అలంకరణ చూడ ముచ్చటగా ఉన్నది. ఐంద్రజాలిక విద్యా పారంగతత్వం అచ్చు గ్రుద్ది నట్లుగా అలంకరించు కొన్నాడు. దీనికి అదనంగా ఇవ్వేళ అంబులపొదికూడా ధరించాడు. బిగుతైన లాగు తొడిగాడు. మాయాజాలపుసంచీ, బొజ్జలో చురకత్తీ వీపున త్రాడు చుట్టా చేతిలో లాఠీ పుచ్చుకొని కచేరీలో ప్రవేశించాడు.

జయసింహమహారాజుకు ఇంతకుముందే శివదత్త మహారాజు భార్యాసమేతంగా అడవికి తపస్సుకు పోయాడనీ అతని ఐంద్రజాలికులు నలుగురూ సురేంద్రసింహుని పక్షాన పనిచేస్తున్నారనీ తెలిసింది.

ఇటువంటి పరిస్థితులలో జయసింహునికి బదరీనాథుడు రావటం మరణించినవారిపై అమృతం చిలికి నట్లనిపించింది.

అతనికి నమస్కరించి ఉచితాసనాన్ని చూపించాడు. బదరీ నాథ పండితుడు మహారాజును ఆశీర్వదించి కూర్చున్నాడు.

జయసింహుడు:- ఇప్పుడు మీరు అత్యవసరమైన పరిస్థితుల్లో రావటం చాలా మంచిదైంది.

బదరీనాథుడు:- అవును. మీ రేమీ భయపడవద్దు. ఒకటి రెండు రోజుల్లో జాలింఖానును బంధిస్తాను.

జయసింహుడు:- మీకు జాలింఖానుసంగతి ఎట్లా తెలిసింది ?

బదరీనాథుడు "ఏడిసంగతి నాగఘంలో కూడా విన్నాను. ఆ సంగతి తర్వాత చెబుతా. ఇక్కడ ప్రవేశించిన తర్వాత మీరందరు చింతాక్రాంతులై ఉండటం చూచాను. త్రోవలో కల్సినవారి నందరినీ ఓదార్చుకొంటూ వచ్చాను. మిగతాసంగతులు ప్రశాంతంగా విన్నవించు కొంటాను తర్వాత నేను చేయబోయే కార్య క్రమాన్ని గూర్చి కూడా మీతోనూ, మంత్రిగారితోనూ చెప్పి పని ప్రారంభిస్తాను. ఇంకా నేను స్నాన సంధ్యావంద నాదులు ముగించుకోలేదు. అవి పూర్తియయినమీదటకాని నే నేపనీ చేయలేను" అన్నాడు.

జయసింహునికి ఇప్పుడు కొంత మనశ్శాంతి కలిగింది. మంత్రితో బదరీనాథపండితునికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించవలసిందిగా ఆజ్ఞాపించాడు. బదరీనాథుడు మహా రాజును ఎప్పుడు కల్సుకోవాలో అడిగి తెలుసుకొన్నాడు.

జయసింహుడు, బదరీనాథుడు తన్నెప్పుడైనా కలుసుకొని మాట్లాడవచ్చునని చెప్పాడు.

ఆ పగలంతా బదరీనాథుడు జాలింఖానును పట్టుకొనే ఉపాయంగూర్చి ఆలోచించుకొన్నాడు. సాయంకాలం మంత్రితో కలిసి జయసింహుని కలుసుకొనటానికి వెళ్లాడు. మహారాజు బదరీనాథుణ్ణి కలుసుకొని నాగఘంలో జాలింఖాను ఏం చేస్తున్నదీ అడిగాడు.

బదరీనాథుడు:- నాగఘలోకూడా ఈవిధంగానే కాగితాలు అతికిస్తున్నాడు. వాటిని చదువుకొని విజయగఘంలో కూడా అతడిదేవిధంగా చేస్తున్నాడనుకొని సురేంద్రుడు నన్ను మీకు సాయంగా పంపాడు.

మహారాజు:- అక్కడ ఎవరినైనా చంపాడా?

బదరీనాథుడు:- లేదు. అక్కడ వాడి ఆటలేమీ సాగలా. ఐంద్రజాలికులు వాణ్ణి పట్టిబంధించటానికి తీవ్రతరమైన చర్యలు తీసుకొంటున్నారు.

మహారాజు:- ఇక్కడ వాడు చాలామందిని చంపాడు.

బదరీనాథుడు:- అవును. పట్టణంలో తెలుసుకొన్నాను. చూద్దాం.

మహారాజు:- జ్యోతిషికుల్ని కూడా తీసుకువస్తే ఆయన గవ్వలద్వారా వాణ్ణి త్వరగా పట్టుకోగలిగేవాడు.

బదరీనాథుడు:- మహారాజా! జాలింఖాన్ అంతనిర్భయంగా ఉత్తరాలు వ్రాసి వ్యవహరిస్తుంటే అటువంటివాణ్ణి

పట్టుకోనటానికికూడా మనం మన ప్రతాపాన్ని చూపించాలే గాని జ్యోతిష్యుని సహాయం తీసుకోవటం మంచిదిగాదు.

మహారాజు:-ఎట్లా పట్టుపడతాడో వాడు?

బదరీనాథుడు:- భయపడకండి! రేపు ఉదయంగాని, సాయంకాలంగాని యెవణ్ణో ఒకణ్ణి పట్టుకుంటాను.

మహారాజు:- అయితే వాళ్లు చాలామంది ఉన్నారా?

బదరీనాథుడు:- తప్పకుండా ఉండిఉంటారు. వంటరిగాడు రెండు రాజ్యాలపైనా ఎట్లా విజృంభించుకొని పడగలుగుతాడు?

మహారాజు:- ఏంచేస్తారో చెయ్యండి. మీరు రావటం వల్ల నాకిప్పుడు కొంత ధైర్యం కలిగింది.

బదరీనాథుడు:- ఇక నేను సెలవుతీసుకుంటాను.

మంత్రి:- మీరు డేరాలవైపుగా వెడతారా?

బదరీనాథుడు:- నేను గట్టిఏర్పాటులతోనే వచ్చాను. ఎటు వెళ్ళాలంటే అటే వెళ్ళగలుగుతాను.

కొద్దిగా ప్రొద్దుపోయింది. బదరీనాథుడు జాలింఖానును ఎదుర్కోటానికి వెళ్ళిపోయాడు.

# 8

బదరీనాథుడు ఏవిధంగా జాలింఖానును పట్టుకొంటాడో యేమేమి మాఱువేషాలు వేస్తాడో యెవరికీ తెలియదు. జాలింఖానుమాత్రం చివరి హెచ్చరికలో మహారాజు ఇంట్లో ప్రవేశిస్తానని బెదరించాడు. ఆ హెచ్చరిక

ప్రభావం మహారాజుపై బాగా పడింది. కాపలా వాళ్ళను నాల్గురెట్లు పెంచాడు. రాత్రి అంతా కత్తిపిడి చేతిలోనే పట్టుకొని పూర్తిగా మేలుకొంటున్నాడు. బదరీనాధుడు రావటంవల్ల కొంత ఊరడిల్లగలిగినా అతడు జాలింఖానును పట్టుకోటానికి పోయినతర్వాత తిరిగి పట్టణమంతా కాగితాలు అతికించబడ్డాయి. ఆ ప్రకటనపత్రంకూడా ఒకటి రాజుగారి దగ్గర కొచ్చింది. అందులో—

"జయసింహమహారాజా! జాగ్రత్త! బదరీనాధుని మాయాజాలంమీద ఆధారపడవద్దు. నా ముందు పుట్టిన వాడు నన్నేం చేయగలుగుతాడు! 16 రోజులలోపల ఈ పట్టణాన్ని పీకి పాకంపట్టి నాల్గురోజులలోపల బదరీనాధుడి తల నరికి తీసుకొని రాత్రి 12 గంటలవేళ నీ ఇంట్లో ప్రవేశిస్తాను. జాగ్రత్త! అప్పుడు నన్ను కావాలంటే పట్టుకోవచ్చు. నీ రాజ్యంలో అంతటి మొనగా డెవరున్నాడో చూస్తాను. మహారాజు శత్రువులు నన్ను కలుసుకోవా లను కుంటే అర్ధరాత్రి 'టీటీ' శిబిరంమీద కలుసుకోవచ్చు.

—అఫల్ ఖాన్ ఖూనీ"

ఈ ప్రకటన మహారాజును పూర్తిగా వివశుణ్ణి చేసి వేసింది. విజయగఢ్ విడిచి పారిపోదామను కున్నాడు కాని వీర పురుషుల లక్షణానికి లోటవుతుందని మాని వేశాడు. దర్బారు విరమించి మంత్రితో ఏకాంత చర్చకు ఉపక్రమించాడు.

మహారాజు:- ఇప్పుడేమి చెయ్యాలి! ఒకడికి మారో కను తోడయ్యాడు. వీళ్ళిద్దర్నీ బంధించక పోతే రాజ్య పరిపాలనే కష్టం.

మంత్రి:- బదరీనాథుడు రావటంవల్ల ఏదో మేలు జరుగుతుందనుకున్నా కానీ, ఇప్పుడతని ప్రాణాలకుకూడా ముప్పు వచ్చింది!

మహారాజు:- ఏదైనా ఉపాయంతో నాగధానికి కబురుపంపించి బదరీనాథుడికి సహాయంగా ఇంకొక ఐంద్ర జాలికుణ్ణి తెప్పిస్తే మంచిది.

మంత్రి:- నాగధానికి ఎవరిని పంపించినా త్రోవ లోనే వాని ప్రాణం పోతుంది. ఒకవేళ రెండుమూడు వందల మందిని పంపిస్తే వార్త చేరవచ్చు.

మహారాజుకు కోపంవచ్చి "పేరుకి మనదగ్గర 50మంది గూఢచారు లున్నారు. సంవత్సరాల తరబడి వీళ్ళు దూన్న పోతుల్లా తిని తిరుగుతున్నారు. ఇవ్వాళ అవసరానికి వీళ్ళతో ఏపనీ జరగటంలేదు. జాలింఖానును పట్టుకో లేక పోయారు సరిగదా! చివరికి ఈ తుచ్ఛులు నాగధానికి కూడా వెళ్ళలేక పోతున్నారు."

మంత్రి:- గూఢచారి ఒకడు మరణించేసరికి మిగతా వాళ్ళు భయకంపితు లవుతున్నారు.

మహారాజు:- ఇవ్వాళ సాయంత్రం మీరు మన మొత్తం గూఢచారులను తోటలోనికి తీసుకొనిరండి, వాళ్లు ఏదైనా పని చెయ్యగలుగుతారేమో అడిగి, లేకపోతే

ఫిరంగి మందుపెట్టి కాల్చి చంపుదాం. ఆ తర్వాత నేనే స్వయంగా ఆ జాలింఖానును పట్టుకోటానికి వెడతాను.

హరదయాళ మంత్రి మహారాజు ఆజ్ఞతీసుకొని తిరిగి ఇంటికి వచ్చాడు. అతనికి మహారాజు కోపకారణం వల్ల ఆందోళన హెచ్చు సాగింది. అతనికి గూఢచారులని ఫిరంగితో కాల్చి చంపటం ఖాయమే ననిపించింది. ఈ అన్నిటికంటే మించి మహారాజు స్వయంగా జాలింఖానును పట్టుకోటానికి ఇల్లు వెడలిపోతే మిగిలివున్న తన కేమి ముప్పురాగలదోనని భయపడసాగాడు.

## 9

వీరేంద్రసింహుడు ఆ ఉద్యాన వనం మూడవ భాగంలోనికి వెళ్ళాడు. అక్కడే లోగడ అతన్ని స్త్రీలు బంధించి రాకుమారి దర్బారులోనికి తీసుకొని వెళ్ళారు.

దానిలో ప్రవేశించే మార్గం యువరాజుకు తెలుసు. యువరాజు తోటలో ప్రవేశించే సరికి ఎదురుగా అతనికి ఒక ముద్దరాలు రావటం కన్పించింది. ఆమె చూడటానికి అందంగానూ ఉన్నది; విలువైన దుస్తులు ధరించింది. చేతిలో ఒక ఉత్తరాన్ని పట్టుకొని యువరాజు ఎదుటనిలబడి ఉన్నది. ఉత్తరాన్ని యువరాజు అందుకొన్నాడు. అందులో—

"చాలాకాలం తర్వాత మీరు మా ప్రదేశానికి వచ్చారు. మీకు ఆతిథ్యమివ్వటం మా కర్తవ్యం. ఇవ్వాళ వస్తువులన్నీ పరిశుభ్ర పరిచాం. ఈ దాసివెంటవచ్చి నా

కుటీరాన్ని పవిత్రం చెయ్యండి. మీ కృతజ్ఞతను నా ఆశీర్వాదాలు.

—సిద్ధనాథ యోగి"

యువరాజు ఆ ఉత్తరాన్ని తేజసింహుని కిచ్చాడు. అతడు దాన్ని చదివి, "సన్యాసి, యోగి! అందుకే ఈ ఉత్తరంలో అధికారగర్వం తొణికిసలాడుతోంది" అన్నాడు.

దేవీసింహుడూ జ్యోతిష్కుడుకూడా ఆ ఉత్తరాన్ని చదువుకొన్నారు. సాయంకాలమైంది. యువరాజు ఆ ఉత్తరానికి సమాధానమివ్వలేదు. తేజసింహుడు ఆ ఉత్తరం తెచ్చిన ఆమెతో "మేము మునీశ్వరుని ఆహ్వానాన్ని అంగీకరించాం. కాని నీ వెంట ఇప్పుడుమాత్రం రాలేము. ఇప్పుడు సంధ్యావందన సమయంగనుక ఒక గంట తర్వాత వస్తాం"

స్త్రీ:- అప్పటివరకు నేనూ ఉంటాను. మీరు సంధ్య వార్చుకోనండి. ఆజ్ఞాపిస్తే సంధ్య వార్చుకోటానికి ఫలాన్నీ జలాన్నీ తెస్తాను.

తేజసింహుడు:- వాటి అవసరమేమీ లేదు.

స్త్రీ:- అయితే సంధ్య ఎట్లా వార్చుకుంటారు? ఈ తోటలో కాలువలేదు, కోనేరు లేదు, చెరువు లేదు.

తేజసింహుడు:- ఆ రెండవ తోటలో కోనేరు ఉంది.

స్త్రీ:- మీరంత కష్టపడటం ఎందుకు? నేనిప్పుడే మీకు కావలసినవన్నీ తెస్తాను. లేకపోతే ఇంకా సమయమున్నదిగనుక ఆ తోటలోనికి నా వెంటవచ్చి సంధ్య వార్చుకోండి.

తేజసింహుడు:- పోనీ నీళ్ళు పట్టుకొనిరా. ఇక్కడే కూర్చుంటా.

ఆమె వెంటనే మూడవ తోటలోనికి వెళ్ళింది.

యువరాజు:- బహుశః ఈ యోగి ఆ నాడునన్ను పర్వతశిఖరంమీదనుండి దూకకుండా అడ్డుపడినవాడై ఉంటాడేమో! అయితే చాలా సంతోషం. వనకన్యతో కూడా మాట్లాడవచ్చు. ఆ తోటలోకి వెళ్ళి సంధ్య వార్చుకోకుండా ఎందుకు ఆగాం? అప్పుడే నేను ఈ మాట అందామనుకున్నాను. గాని దీనిలో ఏదైనా రహస్యముందేమోనని ఆగాను.

తేజసింహుడు:- అవును రహస్యమే ఉన్నది.

దేవిసింహుడు:- ఇందులో ఏమి తంత్రముంది గురుదేవా?

తేజసింహుడు:- చూడవోయ్ నీకే తెలుస్తుంది.

యువరాజు:- అయితే చెప్పరాదటండీ!

తేజసింహుడు:- ఈ యోగి. భోజన పదార్థాలలో మత్తుమందు కలిపిపెట్టి మనల్ని బైటికి చేరవేసి గుహాద్వారం బందిస్తాడేమో అనే అనుమానం కలిగింది. ఆ విషంగా చేస్తే మన మొత్తం పని దండగవుతుంది. మిమ్మల్ని లోగడ ఇక్కడినుంచేగదా స్పృహలేకుండా చేసి ఆగుహలోనికి తీసుకొని వెళ్ళి విడిచారు. మనం ఆయన ఆహ్వానాన్ని అంగీకరించివెళ్ళి భోజనం చెయ్యకుండా ఉంటే మర్యాదనిపించుకొనదు.

దేవీసింహుడు:- అయితే దీని కేమైనా వుపాయం ఆలోచించారా?

తేజసింహుడు నవ్వి "ఉపాయమా? ఇంద్రజాలం గులాబిపువ్వును నీళ్ళలో కలిపి అందఱం త్రాగుదాము. శ్రీవారుకూడా త్రాగుతారు. అదే ఉపాయం. ఆ తర్వాత యేడు రోజులదాకా మనమీద ఎటువంటిమందూ పని చెయ్యదు!"

యువరాజు:- ఆ వైద్యుడుకూడా ఎవ్వడో గాని మందు లతో బలే విచిత్రమైన పువ్వుల్ని తయారుచేశాడు!

తేజసింహుడు:- మంచి దే చేశాడు గదా!

ఇంతలో ఆ స్త్రీ మరి ముగ్గుర్ని వెంట పెట్టుకొని ఆసనాలు, పంచపాత్రలు తీసికొని రావటం కనిపించింది. ఆ తోటలో ఎన్నో రాళ్ళు. ఒక చెట్టుక్రింద కూర్చొనటానికి వీలుగా అమర్చి ఉన్నాయి. ఆ వచ్చినస్త్రీలు ఆ రాళ్ళ మీద సంధ్యావందన పరికరాలు పెట్టారు. వారితో తేజ సింహుడు. "మేము స్త్రీలయెదుట సంధ్యవార్చుకోము గాని కొద్దిగా మీరు అవతలతోటలోనికి వెళ్ళండి" అన్నాడు.

"మీకు సేవచేయలేక చచ్చిపోతున్నాం. మంచిగా 'కొద్దిగా తప్పుకోండి' అని అనక వంకరగా మాట్లాడు తారేం? హుఁ, మేము పోతున్నాం" అని ఆ స్త్రీలు వెళ్ళి పోయారు. వాళ్ళ మాటలకు తేజసింహాదులు నవ్వుకొని "వీళ్ళుకూడా మాయావిద్యకు పనికివచ్చేట్టున్నారు" అనుకొన్నారు.

ఇంద్రజాలపు గులాబి పువ్వును సంధ్య వార్చుకున్న తర్వాత నీళ్ళల్లో కలిపి అందఱూ త్రాగారు. కొంతసేపైన తర్వాత తిరిగి ఆ స్త్రీ వచ్చింది. ఆమెవెంట మూడవ తోటలో ప్రవేశించారు. ఆ తోటను యువరాజుతప్ప మిగతా వారు ఎఱుగరు. ఇక్కడే యువరాజు రాజకుమారి చిత్రపటమున్న దర్బారు చూచాడు. కాని యిప్పుడు ఆ తోటలో లోగడవలె వెలుతురు ప్రసరించటంలేదు. ఐదా రుగురు స్త్రీలుమాత్రం అటూ ఇటూ తిరుగుతున్నారు.

అది రాత్రిసమయం. అంతా చీకటి. ఆ స్త్రీ చిత్ర పటమున్న గదిదిక్కుగా వీళ్ళను తీసుకొని వెళ్ళింది. త్రోవలో యువరాజు "ఇవ్వేళ ఏమైనాసరే, ఇక్కడి రహ స్యాలను తెలుసుకొనిగాని యోగిని వదలను. వనకన్యఎవరో? ఇంద్రజాలంపుస్తకం ఆమెకు ఎట్లా వచ్చిందో? చంద్రకాంత ఎక్కడికి పోయిందో? అన్నీ ఇవ్వేళ తెలుసుకుంటాను" అను కొన్నాడు.

అందరూ ఆ విశాలమైన గదిలో ప్రవేశించారు. అక్కడ యోగీశ్వరుని దర్బారుతప్ప చిత్రపటము దర్బారు లేదు. ఆ యోగి యువరాజు పర్వతాగ్రమునుండి దూక బోయి నప్పుడు చెయ్యి పట్టుకున్నవాడే ఒక పెద్ద తివాచి పఱచి ఉన్నది. దానిమీద జింకతోలు పరుచుకొని యోగి కూర్చున్నాడు. ఎడమవైపున కొద్దిగా వెనుకకుజరిగి వన కన్య కూర్చుండి ఉన్నది. ఎదురుగా నలుగు రైదుగురు పరిచారికలు చేతులు కట్టుకొని నిలబడ్డారు.

రాజకుమారుడు రావటంతోనే యోగి లేచి నిలబడ్డాడు. ఎదురుగా వెళ్ళి చేయి పట్టుకొని తన ప్రక్కగా కుడివైపున ఒక జింకతోలుమీద కూర్చుండబెట్టాడు. వనకన్య లేచి కొద్దిగా దూరంవెళ్ళి నిలబడి యువరాజును అనురాగభరిత దృక్కులతో చూస్తున్నది.

యువరాజు దృష్టికూడా వనకన్యదిక్కు ఆకర్షింపబడి అక్కడే నిలిచిపోయింది. ఉభయుల చూపులలో ప్రేమభరితమైన రసోద్దీపనం ప్రకటితమైంది. ఇద్దరి నేత్రాలలో పరస్పర ప్రతిరూపాలు తప్ప ఇతరమేదీ కనిపించటంలేదు. అక్కడ మునీశ్వరుని ఆటంకం లేకపోతే ఇద్దరి హృదయాలూ కూడా సమ్మిళితమైపోయేవి. కాని యోగికి తమ ప్రేమదృక్కుల విషయం తెలియకుండావుండటానికి అక్కడే ఆగిపోయారు. కొద్ది సేపైనతర్వాత యువరాజుకూ మునికీ సంభాషణ ప్రారంభమైంది.

యోగి:- మీరూ మీ బృందంవారు క్షేమంగా ఉన్నారా?

యువరాజు:- మీ దయవల్ల మేము అన్నివిధాలా క్షేమంగానే ఉన్నాం. కాని... ...

యోగి:- కానీ... యేమిటి?

యువరాజు:- అనేక విషమ సమస్యల రహస్యం తెలియక యాతన పడుతున్నాం. మీదయవల్ల ఆయాతనలు కూడా త్వరలో తొలగిపోగలవని విశ్వసిస్తున్నాం.

యోగి:- భగవంతుని దయవల్ల భవిష్యత్తులో కష్టాలేవీ కలుగవు. మా పేద ఆతిథ్యాన్ని స్వీకరించిన మీ దట ఈ రాత్రంతా మీతో ఆనందంగా కాలక్షేపం చెయ్యాలని కుతూహలపడుతున్నాం. అప్పుడు మీరు నన్నేమైనా అడగ దలచుకొంటే అడగండి. ఆ భగవంతుని దయవల్ల నేటి నుండీ మీ శుభదినాలు ప్రారంభం కాగలవని ఆశిస్తున్నాను.

యోగి తేనెలొలుకే పలుకులకు యువరాజూ అతని ఐంద్రజాలికులూ ఆనందపులకితు లయినారు. ఇంక తమ కార్యాలన్నీ ఫలించగలవని ఆశించారు. కొంతసేపటికి విందు జరిగింది. ఆ భోజనపదార్థాలు రాజులూ, మహారాజులూ ఆరగించేవి. భోజనాలు పూర్తి అయినతర్వాత తోటలో ఒక చక్కని అరుగుమీద తివాచీ పఱచి ఉన్నది. దానిమీద జింకచర్మం పఱిచారు. యోగి ఆ ఆసనంమీద కూర్చున్నాడు. అతనిప్రక్క యువరాజు కూర్చున్నాడు. వనకన్య కొద్ది దూరంలో ఇద్దరు చెలికత్తెలతో కలసి కూర్చున్నది. ఒక జాము ప్రొద్దుపోయింది. రేరాజు ఉదయించాడు. చల్లని పిల్లగాలులు వీస్తున్నాయి. ఉద్యాన వనంలోని వివిధపుష్పాల సువాసనలు గుప్పుమంటున్నాయి. యోగి ఒక చిరునవ్వునవ్వి యువరాజుతో "ఇక మీరు అడగ దలచుకొన్నది అడగండి. అన్నిటికీ సమాధానం చెప్తాను. మీకు నెఱవేఱని పనులుంటే వాటినికూడా నెరవేరుస్తాను" అన్నాడు.

యువరాజు మస్తిష్కంలో అనేక ప్రశ్నలు ఉదయించాయి. ఏది మొదట అడగాలో అతనికి తోచలేదు. చివరికి ఒక నిశ్చయానికివచ్చి యోగితో సంభాషణ ప్రారంభించాడు.

# 10

ఆ విదినమంతా హరదయశోసింహుడు గూఢాచారులను ఒక చోటికి చేర్చటంలోనూ, వారికి అన్ని విషయాలు నచ్చచెప్పటంలోనూ, గడిపాడు రాజాజ్ఞ ప్రకారం సాయంకాలానికి గూఢచారులతో కలసి మంత్రి తోటలో వున్న మహారాజు ఎదుట హాజరయ్యాడు.

గూఢచారులను మహారాజు "మీరు జాలింఖాన్ను ఎందుకని పట్టుకోలేకపోయారు ?" అని అడిగాడు.

గూఢచారులు:- మహారాజా మా శక్తివంచన లేకుండా పనిచేస్తున్నాం. అతని సంగతి త్వరలోనే తెలుసుకోగలమని ఆశిస్తున్నాం.

మహారాజు:_ ఆఫత్ ఖాను అనే రెండవసైతాను ఒకడు బయలుదేరాడు. అతను తన ప్రకటనలో తానెక్కడ ఉందీ వ్రాశాడు. అయినప్పుడు మీరు అతను ఉండేచోటికి వెళ్ళి ఎందుచేత పట్టుకోలేకపోతున్నారు ?

గూఢచారులు:- మహాప్రభూ ! అతడు కోటిశిఖరం మీద ఉంటానని వ్రాశాడు. ఆ శిఖరం ఎక్కడో మాకు

తెలియదు. అతను దేనికి ఆ పేరుపెట్టి వ్రాశాడో దాని అర్థం ఏమిటో తెలియనప్పుడు మేము ఎక్కడికని వెళ్ళము ?

అదివిని రాజుకూడా కోటి శిఖరాన్ని గురించి ఆలోచించసాగాడు దాని సంగతి అతనికీ తెలియదు. నిరపరాధులని తెలుసుకొన్న గూఢచారులను మహారాజు ఏమీ అనలేక గట్టిగా మందలించి పంపించాడు.

జయసింహ మహారాజుకు తానిక బ్రతుకుతానని ఆశ లేదు. ఏదైనా ఆశఉంటే అది తన శౌర్యంవల్ల నేనని రాత్రిఅంతా చేతిలో కత్తిపట్టి మృత్యువును ఎదిరించటానికి సంసిద్ధుడై ఉన్నాడు. మరునాడు మరొక ప్రకటన నగరమంతటా అతికించి ఉన్నది. దానిని మంత్రి రాజుదగ్గరకు తెచ్చి చదివాడు. దానిలో "జాగ్రత్తసుమా! బదరీనాథుణ్ణి బంధించాను. మొదట చెప్పినప్రకారం అతని శిరస్సును తీసుకొని రేపు అర్ధరాత్రి నీఇంట్లో ప్రవేశిస్తాను. మేము చాలామంది ఉన్నాము. ఎట్లా పట్టుకుంటారో చూస్తాము.

ఆఫత్ ఖాన్"

# 11

విజయగఢ సమీపానగల మహారణ్యంలో ఒకానొక కాలువ ఒడ్డున రాతిబండమీద సైనిక వేషాలు ధరించిన నలుగురు మనుష్యులు కూర్చుని ఉన్నారు. దానికి దగ్గర మరొక రాతిమీద ఇద్దరు మనుష్యులు కూర్చుండి సంభాషిస్తున్నారు. సముజ్జ్వల చంద్రకాంతిలో వీరి రూపురేఖలు

చక్కగా కనుపిస్తున్నాయి. వేరుగా కూర్చున్న ఇద్దరిలో ఒకని వయస్సు దాదాపు నలభై సంవత్సరాలుంటుంది. నల్లనిరంగు, నల్లని గడ్డమూకల ఆ పొడుగైన మనుష్యుడు కేవలం ఒకలాగూ బిగుతైన చొక్కా తొడుక్కున్నాడు. అతనికి ముందుభాగాన విల్లు, అంబులు, డాలు, కత్తి ఉన్నాయి. ఒక కాలు క్రిందికి జార్చి కూర్చున్నాడు. గుబురుగా పెరిగిన నల్లనిమీసము మెలితిరిగిఉన్నది. విశాలములైన నేత్రాలు మెరుస్తున్నాయి: ముఖాకృతిలో కాఠిన్యం తొణికిసలాడుతున్నది. ఇతని పేరు జాలింఖాన్. ఆతని ప్రక్కవాడే ఆఫత్‌ఖాన్. ఇతనికి పొడుగైన గడ్డమున్నది. ఇతను తగుమాత్రపు పొడుగైనవాడు. బిగుతైన పైజామా, చొక్కా తొడుగుకుని ఎదుటగా కొడవలిపెట్టుకుని కూర్చున్నాడు. ఎడమవైపున ఒక చిన్న మూటవున్నది. అతను జాలింఖాన్ చెప్పేమాటల్ని జాగ్రత్తగావిని సమాధానం చెప్తున్నాడు.

జాలిం:- నీవు కలవటం నాకు చాలా సాయమైంది.

ఆఫత్: నాకుకూడా నీకలయికవల్ల మేలేకలిగింది. ఈ కొడవలితోనే వేనవేలమంది ప్రాణాలు తియ్యవచ్చు. నేను ఈ ఆయుధాన్నితప్ప దేనినీ వాడను. దీనికి విషపుపూత ఉన్నది. దీని దెబ్బకు గాయం తగిలినవాడు బ్రతకటం అంటూ ఉండదు.

జాలిం: చాలాకష్టపడి నిన్ను కలుసుకోగలిగాను.

ఆఫత్ :- నాకు నిన్ను కలుసుకోవలసిన అవసరం ఉన్నది. మీా రెక్కడ ఉన్నదీ తెలియక ప్రకటనలో ఉదహరించి అతికించాను. నీకు మాయాజాలం తెలుసును కనుక నీకుతప్ప ఎవరికీ తెలియకుండాలని సంకేతాలతో వ్రాశాను.

జాలిం: నాదెంత మాయాజాలంలే! నీవు మాయా జాలంలో నిపుణుడవు గనుక బదరీనాథుణ్ణి పట్టి బంధించావు.

ఆఫత్: బదరీనాథుడువంటి కుట్రకుంకకూ నిపుణ త్వానికీ సంబంధం ఏముంది?

జాలిం:- నీవు ఏదైనాఅనుకో గాని నేనుమాత్రం నిన్ను నేటినుండి గురువుగా భావిస్తాను. ఏదీ, బదరీనాథుడి ముఖం కాస్తచూపించు!

ఆఫత్ :- తప్పకుండా చూడు. కబంధాన్ని పాతిపెట్టి తలకాయను మూటగట్టి తెచ్చాను. కాని చేతితో ముట్టుకో బోకు. రేపటివరకు కుళ్ళిపోకుండా వుండాలని మందు పులిమాను.

ఇలా చెప్పి, అతను తన ప్రక్కనఉన్న మూటను విప్పాడు. మూటగట్టిన గుడ్డ రక్తంతోతడిసి ఉన్నది. అక్కడ ఉన్నవారందఱూ బదరీనాథుని శిరస్సునుచూచి పరమ సంతోషం పొందారు.

జాలిం:- వీడు నిజంగా అసాధ్యుడు.

ఆఫత్ :- ఏమైతేనేం! నాముందు ఆగుతాడా?

జాలిం:- కాని గురువుగారూ! మీరు రేపు అర్ధ రాత్రి మహలులో ప్రవేశిస్తానని ప్రకటించి తప్పుపని చేశారు.

ఆఫత్ :- చూడరాసూ; అక్కడ తమాషా!

జాలిం: అదికాదు గురూ! మీరు ముందుగానే ప్రకటించటంవల్ల అక్కడ చాలామంది ప్రహరై వుంటారు. వాళ్లు మనల్ని పట్టుకుంటే!!

ఆఫత్: ఎవడోయ్! మనల్ని పట్టుకునేది?

జాలిం: దానివల్ల లాభమేమిటీ? సమయంచూసి వెళ్ళిపోయేదానికి.

ఆఫత్: నీ వెక్కడో మూర్ఖుడివిగా ఉన్నావు. అట్లా ఎందుకుచేశానో నీ కేమి తెలుసు?

జాలిం: మీకే తెలియాలి.

ఆఫత్ :- అయితే విను. నా పద్ధతి ఎప్పుడూ ఒకటే. సాధ్యమైనంత త్వరగా చందలచుకున్న వాళ్లను చంపి వెయ్యాలి. అక్కడ ఎంతమంది ప్రహరై ఉంటే అంతమందీ రేపు చచ్చారే అనుకో. కాలూ చెయ్యీ కదపకుండానే వాళ్ళ పని పట్టిస్తాను చూడు.

జాలిం:- అది ఎట్లాసాధ్యం గురూ?

ఆఫత్ ఖాన్ తన సంచిలోనుంచి ఒక ఉండను తీసి చూపుతూ "ఈరకపు ఉండల్ని తయారుచేసి పెట్టాను. ఇవి మీ అందరికీ ఒకొక్కడికి ఒకొక్కటిస్తాను. మీరు అక్కడికి వెళ్ళగానే మనల్ని పట్టుకోటానికి సిద్ధమైయున్న

గుంపుమీదికి విసరండి. విసరగానే ఈ ఉండలు పెద్ద ధ్వనితో ప్రేలుతాయి. జనాన్నంతా ఆవరించి బ్రహ్మాండమైన పొగ విస్తరిస్తుంది. వెంటనే వాళ్ళంతా గ్రుడ్డివాళ్ళయి పోతారు. పొగ పీల్చినవాడు చచ్చిపోతాడు. అంటే ఆ పొగలో అటువంటి విషాన్ని నింపి పెట్టానన్నమాట.

అతనిమాటలకు అతని వర్గంవారు కేరింతలు కొట్ట సాగారు.

జాలిం:- ఒక ఉండను ఇక్కడ పగులగొట్టి చూపించండి గురూ! మాకు గట్టినమ్మకం కుదురుతుంది.

"చూడు" అని అఫత్ ఖాన్ ఆ ఉండను నేలమీద పగులగొట్టాడు. వెంటనే పెద్దధ్వని కలిగి విషధూమం అలుము కొన్నది. ఆ పొగనుచూచి అక్కడివాళ్ళంతా దూరంగా తప్పుకున్నారు. అయినప్పటికీ వాళ్ళకు కళ్ళు వాచిపోయాయి. వికారం ప్రారంభించింది. అఫత్ ఖాన్ సంచిలో నూది మలాం డబ్బాతీసి అందరి కళ్ళకు పూశాడు. దానిని చేతిలో నలిపి వాసన చూపించినమీదట అందరూ కోలుకొని అఫత్ ఖాన్‌ను ప్రశంసించటం మొదలుపెట్టారు.

జాలిం:- ఓహో గురూ! భలేవస్తువు తయారు చేశావు.

అఫత్:- ఇప్పుడు మహలులోనికి వెళ్ళటానికి ఇష్ట పడుతావా?

జాలిం:- నీవంటి మహనీయుని స్నేహం పొందిన మేము చాలా అదృష్టవంతులం. ఏడాదిపొడుగునా మేము

చెయ్యలేని పనిని నీవు ఒక్క రోజులోనే చెయ్యగలుగుతావు. ఓహో గురూ! ఇక మేము కేరింతలుకొడుతూ ఉరుకుతూ రాజమహాలులో ప్రవేశిస్తాం. శత్రువులను తుదముట్టిస్తాం. ఇక ఉండలు అదరికీ పంచండి.

ఆఫత్ :- ఇప్పుడే ఎందుకూ; రేపిస్తాను.

జాలిం:- సరేకాని గురూ! ఇన్నాళ్ళముందే ఎందుకు ప్రకటించావు? ఇవాళ ప్రకటిస్తే సరిపోయేదికదా?

ఆఫత్ :- బదరీనాథుడంటే ఏదో గొప్పవాడను కొని ముందుగావాణ్ణి పట్టెయ్యాలని త్వరపడ్డా. తీరా వీడు పట్టి దద్దమ్మగా తేలాడు.

జాలిం:- అయితే ఇప్పుడు ఏమిచెయ్యమంటావు?

ఆఫత్ :- ఇప్పుడేమీ వద్దు. రేపురాత్రి పన్నెండు గంటలకు రాజమహాలులో ప్రవేశించటానికి సిద్ధంకండి.

జాలిం:- మేము నీవెంటే ఉంటాముగా!

ఆఫత్ :- ఇంకొకచోటికి వెళ్ళి పడుకుందాం. నేను రాజమహాలులో అందరినీ చంపికాని ఎంగిలిపడనని ఒట్టేసు కున్నాను. ఆ భగవంతుడు ఏమిచేస్తాడో!

జాలిం:- తిండిలేకపోతే సీరసించిపోరు గురూ!

ఆఫత్ :- నోరుముయ్యి. తిండిలేకపోయినా నాకేమీ బాధలేదు.

అక్కడనుండి అందఱూ లేచిపోయారు.

# 12

బదరీనాథుని శిరస్సుతో అఫత్ ఖాన్ రాజ మహాలులో ప్రవేశించేది నేడే. నగరమంతా అట్టుడికిన ట్లుడుకుతోంది. ఆనాటి సాయంకాలంనుండీ జయసింహ మహారాజు స్వయంగా అన్ని ఏర్పాట్లూ చేస్తున్నాడు. మహాలులో పేరుపొందిన వీరులనూ, శూరులనూ తీసుకొచ్చి పెట్టారు. అందరూ ప్రోత్సాహులై ఉన్నారు. రాజు స్వయంగా కత్తిపట్టుకొని అటూ ఇటూ తిరుగు తున్నాడు. వీరులనూ, శూరులనూ పొగడుతున్నాడు. 'మనకు తెలియని వాడెవడైనా కనిపిస్తే వాణ్ణి అప్పుడే అక్కడే పట్టుకొని బంధించం'డని ఆజ్ఞాపించాడు. ఆ శూరా గ్రేసర చక్రవర్తులంతా 'ఇట్లా పట్టుకుంటాము; అట్లా పట్టు కుంటాము; అట్లా నరుకుతాము' అని దంభాలు పలుకుతు న్నారు. రాజమహాలు బయట కాపలా తగ్గించివేశాడు. కాపలావాళ్ళు తక్కువగా ఉంటే అఫత్ ఖాన్ సరాసరి మహాలులో ప్రవేశిస్తాడనీ అప్పుడు అతన్ని పట్టుకోవచ్చునని రాజుగారి అభిప్రాయం. బయట కాపలావాళ్ళను ఎక్కువగా పెడితే వాళ్ళల్లో ఏ నలుగురినో చంపి అఫత్ ఖాన్ బయట నుంచే పారిపోతాడనుకున్నాడు ఆయన. రాజమహాలంతా దీపకాంతులతో పట్టపగలుగాచేసి పెట్టారు.

అప్పుడే అర్ధరాత్రి గడవబోతున్నది. వెంటనే భవనపు తూర్పుదిక్కు కప్పుమీదనుండి ఆరుగురు మనుష్యులు హఠాత్తుగా లోనికి అవతరించారు. అక్కడే శూరాగ్రేసరులు

కూర్చుండిఉన్నారు. వారిముందు బదరీనాథుని శిరస్సును పట్టుకొని అఫత్ ఖాన్ నిలబడి ఉన్నాడు.

# 13

యువరాజు యోగీశ్వరుని చూచి ఇలా అడిగాడు: "చంద్రకాంత ప్రాణాలతో ఉన్నదా ?"

యోగి: రామ రామ! చంద్రకాంతను ఎవరైనా చంపగలుగుతారా ? ఆమె క్షేమంగానే ఉన్నది.

యువరాజు: మేమిద్దరం కలుసుకుంటామా ?

యోగి: తప్పకుండా.

యువరాజు: ఎప్పుడు ?

యోగి: (వనకన్యను చూస్తూ) ఈమె ఇష్టమైనప్పుడు.

యువరాజు వనకన్యను చూడసాగాడు. అతని పరిస్థితి అప్పుడు అతివిచిత్రంగావుంది. దృష్టి భీతావహంగా ఉన్నది. యోగి అతని పరిస్థితిచూచి తన తీక్ష్ణమైన చూపులను అతనిపై ప్రసరింపచేశాడు. యువరాజు సర్దుకుని "మీ దయఉంటే నేను చంద్రకాంతను తప్పకుండా కలుసుకో గల్గుతాను." అన్నాడు.

యోగి: నాచేతకాదు. (అని వనకన్యను చూస్తూ) ఈమె చేతిలో ఉన్నది. కాని యీమెమాత్రం నాఆజ్ఞలో ఉన్నది. అయినా మీరు భయపడతారెందుకు ? అడగ

వలసిన వన్నీ అడగండి. తర్వాత చంద్రకాంతతో కలుసు కొనే ఉపాయం చెప్తాను.

యువరాజు: అయితే యీ వనకన్య ఎవరు?

యోగి: ఒక రాజకుమారి.

యువరాజు: నాకీమె ఉపకారం చెయ్యటానికి కారణ మేమిటి?

యోగి: చంద్రకాంతపై ఈమెకు ప్రేమవున్నది గనుక.

యువరాజు: అయితే నన్నిమె పెండ్లాడాలని ఎందుకు కోరుకుంటున్నది?

యోగి: ఈమెకు నిన్ను పెండ్లాడవలసిన అవసరం కానీ, యిష్టంగానీ లేవు. చంద్రకాంత పట్టుదలవల్ల ఏమీ చెయ్యలేనిదై నిన్ను చేపట్టడానికి సంసిద్ధ అయింది.

యువరాజు: చంద్రకాంతపై అంతగా ప్రేమఉన్న యీమె ఆమెను నా యెదుటకు ఎందుకు తీసుకొనిరాదు?

యోగి:- అటువంటి సమయం ఇంకా రాలేదు.

యువరాజు:- ఎందుచేత?

యోగి:- సురేంద్రసింహ మహారాజును, జయసింహ మహారాజును మీరు ఇక్కడకు తీసుకొనివచ్చినప్పుడు ఈమె చంద్రకాంతను తీసుకొనివచ్చి వారికి అప్పగిస్తుంది.

యువరాజు:- అయితే సాధ్యమైనంత త్వరగా వారిని ఇక్కడకు తీసుకొనివస్తాను.

యోగి:- కాని మొదట మా మాటకు సమాధానం చెప్పండి.

యువరాజు:- ఏమిటది ?

యోగి:- (వనకన్యను చూపుతూ) మీరూ, మీ ఐంద్రజాలికులూ ఈ కన్య మీకు చాలా సహాయపడటం చూచారు. ఈ విషయం ఇంకా ఎవరెవరికి తెలుసు ?

యువరాజు:- నేనూ, మా సేనాపతీ, యీవేళ ఈ ఐంద్రజాలికులూ తప్ప ఈమెను ఇంకెవరూ చూడలేదు.

వనకన్య:- (తేజసింహుని చూపుతూ) ఈయన ఒక సారి నన్ను చూచాడు. కాని చూచినట్లు ఎవరికీ చెప్పనని ప్రమాణం చేశాడు.

ఇది విని యువరాజు తేజసింహునివంక చూచాడు. అతడు "అవును. మీరు మమ్ములను ఐంద్రజాలిక వృత్తికి పనికిరాలినవారమని నిందించినప్పటిమాట. అప్పుడు నేను ప్రయత్నించి యీమెను కలుసుకున్నాను. కాని యీమెతో నేను తన పూర్తి వివరాలను వివరంగా చెప్పనంతవఱకూ నమ్మననీ, వెంటాడుతూనే ఉంటాననీ చెప్పాను. అప్పుడు ఈమె సమయం వచ్చినప్పుడు చంద్రకాంతతో కలసి తాను తన వృత్తాంతాన్ని యువరాజుకు చెప్పుతానని ఇప్పుడు తన వెంట నేనుపడితే నీపనికే ఆటంకమని చెప్పింది. అప్పుడు నేను చంద్రకాంత యువరాజుతో కలుసుకోగలుగుతుందని ప్రమాణంచేసి చెప్పితే ఇప్పుడు నే నిక్కడనుండి వెళ్ళిపో తానని చెప్పాను. అప్పుడు ఈమె యీనాటి సంగతి యువ

రాజుకు తాను ఎదట బడనంతవఱకు ఎవరికీ చెప్పనని నన్ను ప్రమాణం చెయ్యమన్నది. చివరికి ఆవిధంగా మేమిద్దరమూ ప్రమాణాలు చేసికొన్నాము. ఆ ప్రకారం 'ఎవరడిగినా ఈ సంగతిని ఎవరికీ చెప్పకుండా ఉన్నాను. ఈవేళ మీారిద్దరూ కలుసుకున్నారుగనక చెప్పగలిగాను" అన్నాడు.

యోగి యువరాజుతో "సరే! ఈ కన్యను మీారూ మీా ఐంద్రజాలికులూతప్ప ఇతరులెవ్వరూ చూడలేదుగానీ, యెవరో ఒకస్త్రీ మీాకు సహాయపడుతున్నదనిమాత్రం సైనికులకు తెలుసుగదా?" అన్నాడు.

యువరాజు:- ఈ సంగతికూడా యెవ్వరికీ తెలియదు. నే నెప్పుడూ ఈ విషయాన్ని ఐంద్రజాలికులకుతప్ప ఇతరులెవ్వరికీ చెప్పలేదు. ఇక ఐంద్రజాలికులు ఇటువంటి విషయాలను తమ బృందంలోనే చర్చించుకుంటారుతప్ప ఇతరులెవ్వరికీ చెప్పరు. అయితే నాదగ్గరికి ముసుగు మనుష్యులు ఉత్తరాలు తీసుకొనివచ్చినప్పుడు సైనికులు చూచినారు. చూచి బహుశః వాళ్ళేమైనా ఊహించుకొన్నారేమో నాకు తెలియదు.

యోగి:- దానికేమీా ఫరవాలేదు. కాని నీ నోటి నుండి యీా విషయమేదైనా సురేంద్రసింహ మహారాజుకు గానీ, మహారాజ జయసింహునికిగానీ తెలిసిందేమో చెప్పు?

యువరాజు:—వారికి నే నేమీా చెప్పలేదుగానీ తేజసింహుని తండ్రి జీతసింహునికి ఈ వృత్తాంతమంతా తెలియ

జెప్పాను. బహుశః ఆయన మా తండ్రిగారికి జయసింహ మహారాజుకూ చెప్పితే చెప్పి ఉండవచ్చు.

యోగి:—జీతసింహుడు ఎప్పటికీ ఆవిధంగా చెప్పడు. నువ్వుమాత్రం వనకన్య నీకు చేసిన సాహాయ్యాన్ని గురించి యింక ఎవ్వరికీ చెప్పకుండామాత్రం ఉండాలి.

యువరాజు:—ఎప్పటికీ నేను చెప్పను. కాని యీామె విషయం ఎవరికీ చెప్పకుండా ఉండటంవల్ల మీా కేమి లాభమో చెప్పగలరా? ఒకవేళ నేను చెప్పినా ఈమెను ప్రశంసించటంమాత్రమే జరుగుతుందిగదా!

యోగి:—మీామధ్య ప్రశంస పొందేమాట వాస్తవమే గాని యీామె తల్లితండ్రులకు తెలిస్తే యెంత దుఃఖం కలుగుతుందో ఆలోచించారా? ఒక ఉన్నత కుటుంబానికి చెందిన పిల్ల పరపురుషునికి ప్రేమలేఖలు వ్రాయటం, అతన్ని కలుసుకోవటం, వివాహం చేసుకుందాం అనుకోవటం ఎంత చెడ్డో మీారు తెలుసుకోవాలి.

యువరాజు:—అదును నిజమే. ఈమె తల్లిదండ్రులు ఎవరో ఎక్కడున్నారో చెప్పగలరా?

యోగి:—ఆ విషయంకూడా మీాకు సురేంద్రసింహ జయసింహ మహారాజులు ఇక్కడికి వచ్చినప్పుడే తెలుసుకోగలరు.

యువరాజు:—అయితే వారిని తీసుకొని రావటానికి అనుజ్ఞ ఇవ్వండి.

యోగి:— ఈ రాత్రివేళ ఏమి వెళ్ళుతారు కాని, రేపు ఉదయం వెళ్ళండి.

యువరాజు:—మీ యిష్టం.

లోపల గాలి లేనందువల్ల యువరాజు ఆరుబైటనే శయనింపగోరాడు. అందరికీ శయ్యలు ఏర్పాటైనాయి. ఆ తర్వాత యోగి తన గదిలోనికీ, వసకన్య మణిలాకచోటికి వెళ్ళిపోయారు. మిగిలిఉన్న రాత్రికూడా వీరి సంభాషణలతో గడచిపోయింది. తెల తెలవారుతుండగానే యోగి యువరాజుదగ్గఱకువచ్చి "రాత్రి నీకొక విషం చెప్పటం మఱచిపోయాను. నీవు వారినిద్దరినీ ఒకేసారి తీసుకొనివచ్చి యీ గుహ వాకిలిదగ్గర ఉంచి నీవు నీ ఐంద్రజాలికులతో ముందు ఇక్కడకురా. ఆ తర్వాత వారిని తీసుకొనిరావచ్చు. ఇక మీరు స్నాన సంధ్యావందనాదులు ముగించుకొని బయలుదేరండి" అన్నాడు.

యువరాజు ఆవిధంగానే చేశాడు. కాని యోగి తమను ముందుగా ఎందుకు రమ్మని ఉంటాడో అని ఆశ్చర్య పడసాగాడు. అప్పటికే అల్పాహారం సిద్ధమైంది. యువరాజు తన ఐంద్రజాలికులతో తిని త్రేన్చి యోగిదగ్గరసెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. గుహావిడచి బైటికి వెళ్ళినతర్వాత దేవీసింహుడు యువరాజుకు గుఱ్ఱము తేపటంకోసం నౌగధానికి వెళ్ళాడు. సాయంకాలం కాకమునుపే గుఱ్ఱం వచ్చింది. అందఱూ నౌగధానికి వెళ్ళిపోయారు. నౌగధంలో వీరేంద్రుడు తల్లిదండ్రులను కలుసుకున్నాడు. తనవిషయం ఎవ్వ

రికి చెప్పలేదు. పన్నాలాల్ ద్వారా జాలింఖాన్ అనే క్రొత్త శత్రువు తయారయ్యాడనీ, అతని కారణంగా విజయగఢ మంతా వణకిపోతున్నదనీ, అతన్ని పట్టుకోవటానికి బదరీ నాథ పండితుడు వెళ్ళాడనీ తెలుసుకొన్నాడు. బదరీనాథుడు వెళ్ళినతర్వాత, అఫల్ ఖాన్ అనే మఱొక శత్రువు తయారయ్యాడని, అతడు బదరీనాథుని శిరస్సుతో రాజ మహలులో ప్రవేశిస్తాననీ, తనను ఎవరు పట్టుకుంటారో చూస్తాననీ అన్నాడని తెలిసింది.

ఈ విశేషాలు తెలుసుకొని యువరాజు తన ఐంద్ర జాలికులతో కలిసి విజయగఢం చేరుకోవాలని అనుకొన్నాడు. ఆవిధంగా వెళ్ళి కష్టసమయంలో జయసింహమహారాజుకు సహాయపడకపోతే, చంద్రకాంతకు శాశ్వతంగా దెప్పిపొడిచే అవకాశం చేజిక్కుతుందనీ ఆమెఎదుట ముఖము ఎత్తుకొని తిరిగే పరిస్థితి లేకుండా పోతుందనీ అనుకొన్నాడు.

ఆ తర్వాత జీతసింహుడు పదహారురోజులపాటు సెలవు తీసుకొని వెళ్ళాడని తెలిసింది. ఈ వార్త తేజసింహునికి చాలా కష్టం కలిగించింది. తేజసింహుడికి తన తండ్రి ఎక్కడికి వెళ్ళిందీ అర్థంకాలేదు. బదరీవనానికి వెళ్ళవలసిన అవసరం తండ్రికి లేదని అతనికి తెలుసు. అయినప్పుడు ఆ వంకతో సెలవు తీసుకొని ఎక్కడికి వెళ్ళాడా అని ఆలోచించ సాగాడు.

తేజసింహుడు ఇంటికివెళ్ళి తల్లిని 'నాన్న ఎక్కడికి వెళ్లా'డని అడిగాడు. ఆమె అమాయికంగా "నాయనా

ఐంద్రజాలిక పత్నికి తన యజమాని సరిగా ఎక్కడకు వెళ్ళిందీ చెప్పగలిగే అర్హత ఉంటుందా" అని తిరిగి ప్రశ్నించింది. అంతటితో తేజసింహుడు మౌనం వహించాడు. మఱునాడు సురేంద్రుడు అడిగినమీదట తేజసింహుడు తాము రాజకుమారిని వెతకటానికి గుహలోనికి వెళ్లామనీ, అక్కడ ఒక యోగి కనుపించి జయసింహ, సురేంద్రసింహులను తీసుకొనివస్తే చంద్రకాంతను అప్పగిస్తానన్నాడని మాత్రం చెప్పాడు. అందుచేత తాము తిరిగివచ్చామన్నాడు.

సురేంద్రసింహుడు సంతోషించి "మేము ఇప్పుడే వెళ్ళటానికి సిద్ధం. కాని జయసింహుడు చాలా కష్టాలలో చిక్కుకొని ఉన్నాడు. నీవు వినే ఉంటావు; మన బదరీనాధుడు వెళ్లాడు కాని, ఏమైందీ తెలియదు" అన్నాడు.

తేజసింహుడు:- "నేను అన్నివిషయాలు తెలుసుకొన్నాను. మేము అక్కడికివెళ్ళి సహాయపడటం అవుసరం" అన్నాడు.

సురేంద్రుడు:- నేనే ఆ విషయం స్వయంగా చెప్పుదామనుకొన్నాను. వీరేంద్రుని ఉద్దేశం ఏమిటి? అతనికి వెళ్ళటం ఇష్టమేనా?

తేజసింహుడు :- యువరాజును యముడుకూడా భయపెట్టలేడని మీకు తెలుసుగదా? అయినప్పుడు జాలింఖాన్‌ది ఒక లెక్కా?

సురేంద్రుడు:- అవును; కాని వీరులను యెదిరించటం మా క్షాత్రధర్మం. దొంగలనూ, వంచకులనూ ఎదుర్కొనే

పని మీది. ఒకవేళ ఆ దొంగ చాటుమాటున దాగి వీరేంద్రునిపై దెబ్బ తీస్తాడేమో!

తేజసింహుడు:- మీరు చెప్పింది నిజమే కానీ, వాడు దొంగైనా బందిపోటువాడైనా మేముండగా వీరేంద్రుని తల పూవు గూడా తాకలేదు.

సురేంద్రుడు:- మేము కీర్తిముందు ప్రాణాన్ని ఒక లెక్కలోనిదిగాతీసికోము. అయినా దుర్మార్గులకు దూరంగా వుండవలసిన అవసరం కూడా ఉన్నది. అందుచేత తప్ప యువరాజు అక్కడికి వెళ్ళటానికి నాకేమీ అభ్యంతరం లేదు. కనుక మీరు వెళ్ళి జయసింహమహారాజుకు సహాయ పడటం మంచిది. జాలింఖాన్ పట్టుబడినతర్వాత జయసింహ మహారాజును ఇక్కడికి తీసికొనివస్తే యిద్దరం కలసి గుహ లోనికి వెళ్ళుతాం.

యువరాజును విజయగఢానికి పంపించటానికి మహా రాజు ఇష్టపడటంలేదని తెలుసుకొని తేజసింహుడు అంత టితో మానం చాల్చాడు. తానొక్కడే విజయగఢానికి వెళ్ళటానికి రాజాజ్ఞనుపొంది మహారాజుదగ్గఱనుంచి ఉత్త రాన్ని తీసుకొని బయలుదేరాడు. సరిగా అర్ధరాత్రివేళకు విజయగఢ రాజమహాలును చేరుకున్నాడు. సరిగా అదే సమయానికి మహాలులో శూరాగ్రేసరుల గుంపొకటి సంసి ద్ధమై ఉన్నది. అందఱూ అదిరిపడినట్లు, దిక్కులు వెతుకు తున్నారు. అప్పుడే ఆఫత్ఖాన్ బదరీనాథుని శిరస్సు పుచ్చుకొని ఆరుగురు మనుష్యులతో కప్పుమీదనుండి దూకాడు.

అప్పటివఱకూ తేజసింహుణ్ణి ఎవరూ చూడలేదు. వెంటనే కవ్వించి "పట్టుకోండి ఈ నీచుణ్ణి" అని తన తాడుచుట్టను వాళ్ళమీాదకు విసిరాడు. వాళ్ళు క్రిందకు పడిపోయారు. కాని వాళ్ళ చేతుల్లోఉన్న వుండలను నేల మీాద విసరికొట్టారు. అవి తుస్సుమనికూడా ప్రేలలేదు. మట్టిముద్దలతో వాళ్ళు వంచితులైనారు అందఱూ బంధితులయినారు.

ఇప్పుడే తేజసింహుణ్ణి అందఱూ చూచారు. ఆఫత్ ఖాన్ తేజసింహుణ్ణి చూచి 'తేజ్‌సిబద్రీ' అన్నాడు. తేజసింహుడు అతనిచెయ్యి పుచ్చుకొని మిగతావాళ్ళల్లోనుండి వేఱుగాతీసి కౌగలించుకున్నాడు. ఆ సంఘటనను చూచి ప్రతివారు "అయ్యో, అదేమిటి! అతడే అసలు పెద్ద దురాత్ముడు. బదరీనాథుణ్ణిచంపి చేత్తో పుచ్చుకొన్నాడు. వాడితో స్నేహం ఏమిటి?" అన్నారు.

"నోరు ముయ్యండి. బదరీనాథుణ్ణి చంపటం ఆట అనుకున్నారా?" అన్నాడు తేజసింహుడు. తేజసింహుణ్ణి వ్యతిరేకించే సాహసం అక్కడెవరికీ లేకపోయింది. అఫత్‌ఖాన్‌ను అతని అధీనంలోనే విడిచి మిగతా ఐదుగురను కట్టిపడేశారు.

ఆఫత్ ఖాన్ చేతిని తేజసింహుడు వదలేశాడు. ఇద్దరూ మహారాజుదగ్గఱకు వెళ్ళారు. ఆఫత్ అనుయాయులను బంధించినప్పటికీ జనంలో ఇంకా కోలాహలం తగ్గలేదు. జయసింహుడు ఈ తమాషా అంతా దూరాన్నుండిచూస్తూ తన సమీాపానికి ఆఫత్ ఖాన్ రావటం గమనించి ఒరనుండి

కత్తి దూశాడు. "భయపడకండి, మేమిద్దరం మీ శత్రువులం కాము ఈయన మన బదరీనాథపండితుడు" అని కేక వేసి చెప్పాడు తేజసింహుడు. అతడే ఆఫత్ ఖాన్. గడ్డం గట్టిగా ఊగించేసరికి అది ఊడి బదరీనాథుని రూపురేఖలు బయటపడ్డాయి.

"బదరీనాథుడు వారితోపాటు ఎందుకున్నాడు?" అని అడిగాడు మహారాజు.

బదరీనాథుడు:- రాజా! నేను వాళ్ళతోపాటు లేకపోతే ఇక్కడవరకు తీసుకొనివచ్చి ఎవరు పట్టుకుంటారు!

మహారాజు:- అయితే ఏ చేతిలోని ఆశిరస్సు ఎవరిది?

బదరీనాథుడు:- మైనంతో తయారైనది.

అప్పుడు జాలింఖానును బదరీనాథుడు పట్టుకొన్నాడని జనం జయజయ ధ్వానాలు చెయ్యసాగారు. బదరీనాథుణ్ణి అక్కడిజనము చుట్టుముట్టారు. అతికష్టంమీద బదరీనాథుణ్ణి ఆ గుంపులోనుంచి వేరుచేయ సాగారు. జాలింఖాన్ నుకు కూడ కృపానిధానుడైన ఆఫత్ ఖాన్ బదరీనాథుడే నని తెలిసింది. తాను పొందిన మోసానికి అతిలజ్జితుడైనాడు. కాని ఏమిచేయ గలడు? కాళ్లూ చేతులూ స్వాధీనంలో లేవు. వివశుడై బదరీనాథుణ్ణితిట్టటంతప్ప మరేమీ చేయలేకపోయాడు. ప్రాణాపాయ స్థితిలోనున్న ఆ అయిదుగురు అంతకంటె చేయగలిగిం దేమీ లేదు. బదరీనాథుడు మాత్రం తనకు తగిలే, దూషణలకు మందహాసము చేయటం తప్ప అంతగా పట్టించుకోలేదు. అతనితోపాటు మహారాజు సైతం

బందీలైన దుండగీంద్ర విషమపరిస్థితులకు నవ్వుకున్నారు. రాజాజ్ఞచేత భటులు ఆ దొంగలను బయటకు పంపించి వేశారు, అక్కడ ఒకచీకటికొట్టులో వాళ్ళను కట్టిపడేశారు. నీళ్ళుతెప్పించి బదరీనాథుడి ముఖం కడిగారు. ఆ తరువాత బదరీనాథుడు వాళ్ళందరిని కూర్చోబెట్టి తాను చేసిన ఘన కార్య విశేషాలు విశదీకరించాడు.

బదరీనాథుడు:- రాజా! నేను జాలింఖానును కలుసుకోటానికి మొట్టమొదట ఒక ఉపాయం ఆలోచించాను. ఆ ఉపాయం ప్రకారం అఫత్ ఖాన్ పేరుతో ఒక ప్రకటన వెలువరించాను. ఆ ప్రకటనలో నన్ను కలుసుకొనే చోటు కూడా ఉదహరించాను. ఆచోటు కేవలం ఐంద్రజాలికులకు మాత్రమే తెలిసేభాషలో ఉండటం మీరు గమనించే ఉంటారు. నేను చెప్పిన 'ఛేటీ' శిఖరాన్ని గుర్తించగలిగే వాళ్ళు ఇక్కడ ఎవరూ లేరు.

మహారాజు:- అవును. నీవు చెప్పిన 'ఛేటీ' శిఖరానికి అర్థం యేమిటి?

బదరీనాథుడు:- ఇంద్రజాలభాషలో 'ఛేటీ' శిఖరానికి భయంకరమైనకాలువ అని అర్థం.

ఆతర్వాత బదరీనాథుడు జాలింఖానును కలుసుకొన్న సంగతి, అతనికి ఉండలు చూపించిన ఘట్టాన్ని వివరంగా చెప్పాడు. మహారాజు బదరీనాథుడికి పెక్కు బహుమానాలు ఇవ్వటానికి సిద్ధపడ్డాడు. గానీ అతడు తన యజమాని ఆజ్ఞ లేనిదే తీసుకోనన్నాడు.

"నా యజమాని నన్నీ పనికి నియోగించాడు. నేను దీన్ని పూర్తిచేశాను" అని అన్నాడు.

మహారాజుకూడా అవకాశం చిక్కినప్పుడు బదరీ నాథుణ్ణి ఘనంగా సత్కరించవచ్చునని అప్పటికి విరమించు కొన్నాడు. తేజసింహుడూ బదరీనాథుడు జయసింహ మహా రాజువద్ద సెలవుతీసుకొని హరదయాళ మంత్రి ఇంటికి వెళ్ళి పోయారు.

# 14

ఆ తెల్లవారి జయసింహమహారాజు ఆనందాతిరేకంతో దర్బారు తీర్చిఉన్నాడు. తేజసింహ బదరీనాథులకు ప్రత్యే కాసనాలు ఏర్పాటుచేశారు. భటులు జాలింఖాను ముఠాను బేడీలువేసి దర్బారులో ప్రవేశపెట్టారు. తేజసింహుడు జాలిం ఖానుతో "నీ పేరు నిజంగానే జాలింఖా నేనా?"

జాలిం:- దీనికి సమాధానం నేను తర్వాత చెబుతాను. కాని మొదట మీరు ఇక్కడ ఐంద్రజాలికుల్ని చంపే రివాజు ఉన్నదేమో చెప్పండి.

తేజసింహుడు:- ఇక్కడే కాదు. యావద్భారతంలో కూడా ధర్మపరాయణుడైన హిందూరాజు ఐంద్రజాలికులను చంపడు. కాని ఏ ఐంద్రజాలికుడు తన హద్దుల్ని మించి ప్రవర్తిస్తాడో అతడు తప్పకుండా వధార్హుడు.

జాలిం:- అయితే మమ్మల్ని వధిస్తారా?

తేజసింహుడు.- అది మహారాజు ఇష్టం. కాని ఈ విధంగా మాట్లాడేవారు మీరు అసలు ఐంద్రజాలికులేనా?

జాలిం:- అవును మేం ఐంద్రజాలికులం.

తేజసింహుడు:- రామ రామ ! నీవూ ఐంద్రజాలికుడ వేనా ? బందిపోటు దొంగవు. నీకూ ఐంద్రజాలికులకూ సంబంధం ఏమిటి ?

జాలిం:- తరతరాలనుంచీ మాది ఐంద్రజాలిక కుటుంబం. ఇవ్వేళ నేను క్రొత్తగా ఈ వృత్తి అవలంబించిన వాణ్ణి కాదు.

తేజసింహుడు:- నీ తండ్రీ తాతలు ఐంద్రజాలికు లయితే కావచ్చు. నీవుమాత్రం అతిదుర్మార్గుడవయినావు. బందిపోటు దొంగవు.

జాలిం:- మీరు నా పేరు బందిపోటు దొంగగా పెట్టి నప్పుడు ఇక నాకు జీవించే ఆశ ఇంకేముంది చెప్పండి ?

తేజసింహుడు:- నిజానికి నీవెవరవో చెప్పు?

జాలిం:-మరణశిక్ష పడనున్నప్పుడు ఇంకా పేరుకూడా చెప్పుకొని అగౌరవం పొందటం దేనికి ? ఒకవేళ మీరు నా ప్రాణం తీయనని మాటయిస్తే నా పూర్తివివరాలు చెబుతాను.

తేజసింహుడు:- అటువంటి వాగ్దానమేమీ లభించదు. నీవు నీ పూర్తి వివరాలు చెప్పక తప్పదు.

జాలిం:— ఎప్పటికీ నేను చెప్పను.

తేజసింహుడు:_ చెప్పకపోతే నిన్ను ఉపేక్షించం.

జాలిం:— ఏమైనాకానీ.

బదరీనాధుడు:—అయితే చెప్పు దెబ్బలు తప్పవు.

జాలిం:— (బదరీనాధుడితో) గురూ! మీరు నన్ను బలే మోసంచేశారు. మీ మాట ఒప్పుకొని తీరవలసిందే?

బదరీనాధుడు:— నీవు ఒప్పుకొనే దేమిటి? ఇవేళ గాకపోయినా మీ అందరి తలలూ నరికి చూపిస్తాను.

జాలిం:— అవును. పాపం ఏమీ చేయలేకపోయావు.

ఎంత నిర్బంధించినా జాలింఖాను తన రహస్యం బైట పెట్టడని తేజసింహుడు గ్రహించాడు. మఱొక ఉపాయం ఆలోచించటం మంచి దనుకొన్నాడు. మహారాజుతో "ముందు వీళ్ళను చెరసాలకు పంపించండి" అని, ఆ అయిదుగురిలో ఒకరిని వేలెత్తిచూపి "అతనొక్కణ్ణే ఇక్కడ ఉంచండి" అన్నాడు. మహారాజు ఆవిధంగా అతన్ని అక్కడ ఉంచాడు. జాలింఖాను వెళ్ళిపోతూ "తేజసింహా! నీవు బలే తాంత్రికుడివి. నీవు ముఖాన్నిబట్టి మనుష్యుల హృదయాన్ని తెలుసుకోగలుగుతావు. ఒక పిరికివాణ్ణే ఏరి ఉంచుకొన్నావు. అతనితో నీపని వెళ్ళమారిపోతుంది" అన్నాడు.

తేజసింహుడు చిరునవ్వుతో "ఏడిసంగతి తెలుసుకున్న తర్వాత మిమ్మల్నికూడా ఒక్కొక్కర్ని రప్పిస్తాము" అన్నాడు.

జాలింఖానూ్న అతనితో మఱి ముగ్గురినీ చెఱకు పంపించారు. ఒకడు దర్బారులోనే ఉండిపోయాడు. నిజానికి

అతను పిరికివాడు. ఒంటరిగా తనను అక్కడ ఆపటంచూచి వణకిపోసాగాడు.

తేజసింహుడు ఒక కాపలా వాణ్ణిపిలిచి బొగ్గులపొయ్యి వెలిగించి రెండుమూడు ఇనుపకడ్డీలను కాల్చి తెమ్మన్నాడు. ఆ కాపలా వాడు పట్టుకోటానికి కొయ్యపిడులున్న ఇనుప కడ్డీలను కాల్చటానికి వెళ్లాడు.

దర్బారులో ఉన్నవా ళ్ళందరూ తేజసింహుడి మాటలు విని భయపడసాగారు. కాపలా వాడు ఇనుపపొయ్యి తెచ్చాడు. కడ్డీలు కాలుస్తున్నారు. ఆ దొంగ వణికిపోతూ ఇలా అన్నాడు. "తేజసింహా! వాటిని కాల్చి ఏంచేస్తావు?"

తేజసింహుడు:- రెండు కళ్ళలోనూ, ఒకటి నీ పొట్ట లోనూ ప్రవేశపెడతాను.

దొంగ:- మీరు దయగలవారుగదా? అట్లా చేయ వచ్చునా?

తేజసింహుడు:- (నవ్వి) నీవు బ్రతికిఉంటే వేలకొలది ప్రజలకు ప్రాణాపాయం. అందుకు నిన్నే లేకుండా చెయ్యటం మంచిది.

దొంగ:-అయితే మమ్మల్ని బ్రతకనియ్యరన్నమాట.

తేజసింహుడు:- ఒక పద్ధతిలో మీరు బ్రతకకలుగు తారు.

దొంగ:- ఎట్లా?

తేజసింహుడు:- నీ తోడి దొంగలసంగతి చెబితే.

దొంగ:- చెబుతాను.

తేజసింహుడు:- నీవు నిజమే చెబుతున్నావని నమ్మక మేమిటి.

దొంగ:- ఋజువుపరుస్తాను.

తేజసింహుడు:- అయితే చెప్పు?

దొంగ:- చెబుతున్నాను వినండి.

ఈసమయంలో దర్బారంతా గుసగుసలాడిపోతోంది. అందరూ 'ఈ దొంగ ఎవరు? వీడు నిజమే చెబుతాడా?' అనే జిజ్ఞాసతో దొంగవైపు చూస్తున్నారు.

అతడు చెప్పటం ప్రారంభించేసరికి ఆ జనంలోనుండి ఒక యువకుడు ఒరనుండి కత్తిలాగి ఆ దొంగ తల నరికివేశాడు. అదే కత్తితో ఆ జనాన్ని గాయపరచుకుంటూ బయటికి పోయాడు. అతన్నెవరూ పట్టుకోలేకపోయారు. బదరీనాధుడు వెంటపడ్డాడు. బదరీనాధుడు వెళ్ళినతర్వాత వంద లాది మనుష్యులు అతన్ని అనుసరించారు.

తేజసింహుడూ అక్కడే ఉన్నాడు. అతడు లేచి కారాగారం దగ్గరికి వెళ్ళాడు. అతనికి జాలింఖాను ముఠాలో ఎవరన్నా తప్పించుకొనిపోయారేమోననే అనుమానముంది. కాని అందరూ చెఱసాలలోనే ఉన్నారు. తేజసింహుడు తిరిగి దర్బారులోకి వచ్చాడు. జనసమ్మర్దం మరీ ఎక్కువైంది. మహారాజు తేజసింహుణ్ణి "నీవు ఎక్కడికి వెళ్లావు" అని అడిగాడు.

తేజసింహుడు:— జైలుఖానాదగ్గరికి, జాలింఖాన్ ముఠా పారిపోయారేమోనని చూడటానికి వెళ్ళాను. కాని వాళ్లు నలుగురూ ఖైదులోనే ఉన్నారు.

మహారాజు:- బదరీనాథుడు ఏం చేసుకొని వస్తాడో చూద్దాం.

తేజసింహుడు:—అతడు త్వరగానే వస్తాడు.

ఆనాడు జయసింహమహారాజు మామూలు కంటే ఎక్కువసేపు దర్బారులో కూర్చున్నాడు.

తేజసింహుడు "ఇవ్వేళ దర్బారులో రాజుగారు చాలాసేపు ఉన్నారు" అన్నాడు.

రాజు "బదరీనాథుడు తిరిగివచ్చేవరకూ ఇవ్వేళ ఇక్కడే ఉంటాను" అన్నాడు.

# 15

రెండు గంటల తర్వాత బైట పెద్దగా కలకలం విన వచ్చింది. అందరిదృష్టీ అటువైపు మళ్ళింది. కాపలావాడు 'ఆ హంతకుణ్ణి బదరీనాథుడు పట్టుకొన్నా'డని చెప్పాడు. బదరీనాథుడు తాడుచుట్టతో అతన్ని బంధించి తీసుకొని వచ్చాడు.

మహారాజు:- ఎవరో తెలిసిందా ?

బదరీనాథుడు:- ఎవరో చెప్పనంటున్నాడు.

మహారాజు:- అయితే ఎట్లా ?

బదరీనాథుడు "మారువేషంతో వచ్చినట్టు కన్పిస్తోంది" అని నీళ్ళు తెప్పించి అతని ముఖం కడిగించాడు. అతని నిజస్వరూపం మరోకవిధంగా బైటపడింది.

ఆ జనమంతా అతన్ని చూచారు. వారు గుర్తుపట్టినట్టుగానే ఉన్నారు. మహారాజు తేజసింహునితో "అవును. వీడు నాజీం బావమరిది. జాలింఖాన్ మొదలైన వాళ్ళుకూడా నాజీం అహమ్మదల బంధువులనే తెలుస్తుంది. వాళ్ళ నిక్కడికి పిలవాలి" అన్నాడు.

వెంటనే జాలింఖాన్ ప్రభృతుల్ని రాజభటులు దర్బారులోనికి తీసుకొని వచ్చారు.

బదరీనాథుడు జాలింఖాన్‌తో ఇలాఅన్నాడు: "మీరు నాజీం అహ్మదుల చుట్టాలని మీ అనుయాయి చెప్పాడు"

నాజీం ఏదో చెప్పబోయేసరికి హంతకుడు "జాలిం నీవు బదరీనాథుని వలలో పడబోకు. ఆయనచెప్పేది అబద్ధం. నేను నీ అనుయాయికి చెప్పే అవకాశం ఇవ్వలేదు. వాడు పట్టి పిరికివాడు. వాణ్ణి నేను చంపేశాను. మనసంగతి యేదియేమైనప్పటికి రహస్యాలు ఏమాత్రం పొక్కరాదు."

జాలిం గొంతెత్తి "అవును చెప్పకూడదు" అన్నాడు. వాళ్ళమాటలు మహారాజుకు కోపకారణమయ్యాయి. తేజసింహుణ్ణి బదరీనాథుణ్ణీ చూచి ఇప్పుడు మనం వీళ్ళ సంగతి సందర్భాలు తెలుసుకోవలసిన అవసరంలేదు. "వీళ్ళ నిక్కడే తలలు నరకటం మంచిది" అన్నాడు.

రాజు ఆజ్ఞాపించటమే ఆలస్యంగా అక్కడ చేరిన జనం వాళ్ళమీదపడి చావమోదారు. అందరి శవాలూ బయట పారవేయబడ్డాయి. మహారాజు లేచి నిలబడ్డాడు. తేజ సింహుడు చేతులు జోడించి "రాజా! అసలు నేనిక్కడకు వచ్చినపని చెప్పటానికి అవకాశమే దొరకకుండాపోయింది" అన్నాడు.

మహారాజు:- అవసరమైతే నాతోపాటు లోపలికిరా!

తేజసింహుడు:- చాలా తొందర విషయం. మీరు చూస్తే చాలా కోపంలోఉన్నారు. నా మనసుకూడా ఏమీ బాగుండలేదు. అయినా ఈసమయంలోనే మీకు సంతోషం కలిగించే ఆవార్తను చెబుదామనుకొంటున్నాను.

తేజసింహుని మాటలకు మహారాజు చాలా సంతోషించి అతన్ని చేయిపుచ్చుకుని తన మహాలులోనికి తీసికొని వెళ్ళాడు. బదరీనాథుడుకూడా వారివెంట వెళ్ళాడు. అక్కడ రాజుగారు కూర్చున్నమీదట తేజసింహుడు "ఇప్పుడు మీరూ సురేంద్రసింహుడు గుహకువెళ్ళి సిద్ధనాథయోగి కృపాపాత్రులై చంద్రకాంతను తీసుకొని రావలసిఉన్నది." అన్నాడు.

అతని మాటలకు రాజు బ్రహ్మానంద భరితుడైనాడు. తేజసింహుణ్ణి కౌగలించుకొన్న మీదట "నువ్వు వెంటనే హారదయాళ సింహుని దగ్గరకువెళ్ళి మా ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చెయ్యి. నేను ఈ సంతోషవార్తను రాణీకి తెలియజేస్తాను" అన్నాడు.

తేజసింహుడు మహారాజు నొగధానికి వెళ్ళే ఏర్పాట్లు చేశాడు. ఆనాడు తెల్లవారుజామునే బయలుదేరటానికి నిశ్చయం జరిగిందికూడా.

## 16

అక్కడ గుహ లోపలిభాగాన ఒకనాడు సుందర వనంలో అప్పటివఱకూ గోరింటాకుకోసి అలసిపోయిన వన కన్య తన యిరువురు చెలికత్తెలతో కలసి ఒక శిలావేదిక మీాద శయనించిఉన్నది.

వనకన్య:- చాలా అలసట కలిగింది.

ఒక చెలికత్తె:- తిరగటం సామాన్యమా ?

రెండవ చెలికత్తె:- నీవుకూడా అలసిపోయావా ?

ఒకటవ చెలికత్తె:- నే నెందు కలసిపోతాను! ఐదేసి కోసులు తిరిగినప్పుడే అలసిపోలేదు.

రెండవ చెలి:- అవును. ఆ రోజుల్లో చాలా తిరగ వలసివచ్చింది.

మొదటి చెలి:- చివరకు యువరాజు ఐంద్రజాలికులు మనల్ని తెలుసుకోలేకపోయారు.

రెండవ చెలి:- జ్యోతిష్కులవారి గవ్వలే మనమీాద పనిచెయ్యలేక పోయాయి; ఇక మిగతావాళ్ళ సంగతి ఏం అడుగుతావు ?

వనకన్య:- సిద్ధనాధయోగి మనకు కట్టిన యంత్రాల వల్ల జ్యోతిషికులవారి గవ్వలు ఏమీా పనిచెయ్యలేకపోయేవి. ఇప్పటికీ మన మీా యంత్రాలను కట్టుకొనే ఉన్నాముగా:

మొదటి చెలి:- ఆ తాయెత్తుల్లో ఏమి గొప్పతన ముందో ?

వనకన్య:- నే నీ విషయాన్ని ఒకసారి యోగీశ్వరుని అడిగాను. అప్పుడు ఆయన నాకేం చెప్పాడో గుర్తులేదు. కాని ఆ గవ్వలు తయారైన ధాతువునూ ఆ గవ్వల ద్వారా తెలుసుకోదగిన గ్రహాలూ నక్షత్రాలయొక్క మూలధాతువుల్నీ మొత్తంగా కలిపి తాయిత్తు తయారు చేశాడనీ గుర్తుంది. అందుచేత ఈ యంత్రాలు కట్టుకున్న వారి సంగతి ఆ జ్యోతిష్యులవారు తెలుసుకోలేకపోయారు.

రెండవ చెలి:- అవును. నేను సూరజముఖి వేషం వేసుకొని వెళ్ళినప్పుడు జ్యోతిషికులవారు నన్ను కనుక్కో లేక పోయారు.

వనకన్య:- అప్పుడు యువరాజును బాగా మోస గించాము.

రెండవ చెలి:- మోసగించటమేమిటి ? పిశాచమైవచ్చి ఏమి పరతు పెట్టావని నామీద నిప్పులు క్రక్కితే !

మొదటి చెలి:- నీవు వెళ్ళటానికి కొద్ది ముందుగానే నేను యోధవేషం వేసుకొని వెళ్ళాను. దేవీసింహుణ్ణి నా మిత్రుణ్ణిగా చేసుకొన్నాను. అక్కడ ఉన్నవారి కెవరికీ నేను దేవీసింహుణ్ణి ఎరుగుదునని తెలియదు.

రెండవచెలి:- శివదత్తుని మాయాపులు ఇంద్రజాలం పుస్తకం దొంగిలించి అడవిలో ఒకగొయ్యితీసి పాతిపెట్టబో తున్నారు. సరిగ్గా అ దేసమయానికి మేము కొద్ది దూరానఉండి

చూస్తూ ఉన్నాము. వాళ్ళు వెళ్ళిన తర్వాత పోయి చూచాంగదా అది ఇంద్రజాల పుస్తకం!

వనకన్య:- చాలా కష్టంమీద సిద్ధనాధయోగి మనం తిరగటానికి అనుమతిచ్చాడు. అక్కడికీ ఆయన మనల్ని యువరాజుదగ్గరకు వెళ్ళకుండా దూరదూరంగా ఉండి వారిని చూడమన్నాడు.

రెండవ చెలి:- ఆయన ఏది చెప్పినా నీ మేలుకోసమే.

వనకన్య:- అవును. నిజమే! కాని మనస్సు తొందర పెడుతుంటే ఏంచెయ్యను చెప్పు.

మొదటి చెలి:- మాయిద్దరితోకూడా యోగీశ్వరుడు 'యువరాజుకి యెల్లప్పుడూ సహాయ పడుతుండం' డని చెప్పాడు. అందుకేగా మాలినివేషం వేసుకున్న బదరీ నాధుని వలలోనుంచి యువరాజును రక్షించింది.

రెండవ చెలి:—ఐంద్రజాలికులు జాడలు తీయటానికి తక్కువ ప్రయత్నాలు చేస్తారా? కాని ఇక్కడ మనకు ఐంద్రజాలిక గురుసింహుడు సిద్ధనాధుడు ప్రతిక్షణం సహాయ పడుతుండేవాడు. అందుకనే వాళ్ళేమిచేయబోయినా జరగ కుండా పోయింది. గంగానదిలో దూకినప్పుడు దేవీసింహుణ్ణీ, జ్యోతిషికుణ్ణీ, తేజసింహుణ్ణీ ఎట్లా మోసగించామో! మనం వాళ్ళ బట్టలుకూడా దొంగిలించాము.

మొదటి చెలి:- అసలు మనం వాళ్ళను తెలుసుకోనే మనవెంట రానిచ్చాం.

వనకన్య:- వాళ్ళల్లో తేజసింహుడు బలేగట్టివాడు.

రెండవ చెలి:- ఎంత గట్టివాడై తేమాత్రం మన సిద్ధ నాథుని ముందు ఎంత?

వనకన్య:- (నవ్వి) అతనిసంగతి నీకే తెలియాలి.

రెండవ చెలి:- మీారు వేళాకోళం ఆడుతున్నారు.

మొదటి చెలి:- సిద్ధనాథయోగి మనచేత చిన్న యింద్రజాలాన్ని భేదింపజేసి యువరాజునూ ఆ ఐంద్రజాలికులను బలే మోసంచేశారు.

రెండవ చెలి:- గుహ వాకిలిని లోపలినుండి వేసుకొని చిన్న యింద్రజాలాన్ని భేదిస్తున్నప్పుడు తేజసింహుడు బదరీనాథుణ్ణి తీసుకొని గుహ వాకిలివద్దకువచ్చి తలుపుతియ్యటం చేతగాక తిరిగి వెళ్ళిపోయాడు.

వనకన్య:—అప్పుడతడు లోపలినుంచి తలుపువెవ్వరు వేశారా అని చాలా ఆశ్చర్యపోయి ఉంటాడు.

రెండవ చెలి:— నిజంగా ఆశ్చర్యపోయే ఉంటాడు. ఇవేగాక నేను సూరజముఖి వేషంలోని శివదత్తుని విడుదల చేస్తానని అతనితో యువరాజుతో మైత్రిగావుండే ఏర్పాటు చేసి విడిపించాము. సూరజముఖినికూడా బహుశః వాళ్ళు పెద్దదయ్యము అనుకొని ఉంటారు.

వనకన్య:- కానీ ద్రోహియైన శివదత్తుడు ప్రమాణం చేసికూడా యువరాజుమీాద తిరిగి దండెత్తాడు.

రెండవ చెలి.- అందుకనే వాడిని తిరిగి బంధించి, ఇంద్రజాల పుస్తకాన్ని యువరాజు కిచ్చాము. ఒకసారి మనల్ని క్రూరసింహుడు గుర్తుపట్టినప్పుడు ఇక వీడు బ్రతికి

ఉంటే మన బండారంకాస్తా బయలుపెట్టివేస్తాడని వాణ్ణి చంపేశాము.

మొదటి చెలి:- వాడికి ఇంద్రజాలాన్ని భేదించి ధన రాసుల్ని కాజేద్దాం అని ఆశ ఉండేది పాపం.

వనకన్య:— ఆ రెండవ చిన్న ఇంద్రజాలం నేను భేదించినందుకూ చాలా సంతోషపడుచున్నాను.

రెండవ చెలి:—సిద్ధనాథయోగి సహాయమున్నప్పుడు అదిమాత్రం ఎంతపనిలే!

వనకన్య:— అయినా యింకా కావలసినది చాలా ఉన్నదికదా!

# 17

జయసింహామహారాజు తన స్థానంలో హారదయాళ సింహుని ఉంచితే జయసింహా, బదరీనాథులను వెంటబెట్టు కొని విజయగఢనుండి నాగఢానికి ప్రయాణమైనాడు. రెండు రోజులలో నాగఢం సరిహద్దులకు చేరి డేరా వేసుకొని విడిది చేశారు. మహారాజ సురేంద్రసింహుడు ఈవార్త తెలిసికొని సామంత, మంత్రి పురోహితులతో జయసింహామహారాజు దగ్గరకు వెళ్ళి స్వాగతం చెప్పి పట్టణంలోనికి తీసుకొని వచ్చాడు.

జయసింహ మహారాజు బసనిమిత్తం మొదటే ఒక భవనం ప్రత్యేకించారు. ఆ భవనం ఆవరణలో ఒక పెద్ద డేరావేసి విందు ఏర్పాట్లు చేశారు. జయసింహుడు విందు

ఏర్పాట్లను తన వ్యతిరేకతను చెప్పి ఎందుకు విందు వద్దం టున్నానో ఇప్పుడు అగడవద్దనికూడా విన్నవించుకొన్నాడు. ఆయన ఎందుకు విందు వద్దంటున్నాడో సురేంద్రుడు గ్రహించి సంతోషించాడు. ఆరాత్రి వీరేంద్రసింహుడూ మిగిలిన ఐంద్రజాలికులూ జయసింహ మహారాజును కలుసు కున్నారు. మహారాజు యువరాజును ఇంద్రజాలం సంగతి అడిగి తెలుసుకొన్నాడు. తెల్లవారుజామున బయలుదేరి ఇంద్రజాలం గుహకు వెళ్ళటానికి నిశ్చయమైంది. ఆ ప్రకారం జయసింహుడు, సురేంద్రసింహుడు, యువరాజు, తేజ సింహుడు, బదరీనాథుడు, పన్నాలాలూ, రామనారాయణ, చున్నీలాలూ, మొదలైన వారంతా చీకటి గుహదగ్గఱకు వెళ్ళారు.

యువరాజు, జయసింహ సురేంద్రసింహులను వాకిలి దగ్గర నిలిపి యోగిచెప్పిన పద్ధతి ప్రకారం తాను ముందు లోనికి వెళ్ళాడు. వీరేంద్రుని వెంట తేజసింహుడుకూడా వెళ్ళాడు. వారు తోటలో అడుగుపెట్టగానే అక్కడే నిలబడి ఆలోచిస్తున్న యోగి వారిని కలుసుకున్నాడు.

యువరాజు:- మీరు చెప్పినట్లు జయసింహ మహా రాజుని, సురేంద్రసింహ మహారాజుని బైట ఉంచి వచ్చాను.

యోగి:- మంచిపని చేశావు. ఇవ్వేళ మీరు చంద్ర కాంతను కలుసుకుంటారు.

తేజసింహుడు:- మీ దయ.

యోగి:- విజయగఢంలోను నౌగఢంలోను అల్లరేమీ జరగలేదా?

తేజసింహుడు:- (ఆశ్చర్యంగా చూచి) జరిగింది. ఎవరో జాలింఖాన్ అనే శత్రువు తయారయ్యాడు.

యోగి:- వాళ్ళనుతాను చంపేశారటగా ! చాలా మంచిపని జరిగింది.

తేజసింహుడు:- మీకు విషయాలన్నీ తెలిస్తే జాలింఖాన్ కూడా ఎవడో తెలిసే ఉంటుంది.

యోగి:- అతను నాజిం, అహమ్మదుల బంధువై ఉంటాడు.

యువరాజు:- అవును వాళ్ళే.

యోగి:- శివదత్తుడు అడవికి వెళ్ళిపోయాడు.

యువరాజు:- అవును. మా తండ్రికిచెప్పి తపస్సుచేసు కోటానికి వెళ్ళాడు.

యోగి:- ఏమైనా శత్రువులను నమ్మకూడదు.

యువరాజు:— అయితే ఏదైనా ముప్పు తెస్తా డంటారా ?

యోగి:— ఎవరికి తెలుసు.

యువరాజు:— ఇకమీరు అనుమతిస్తే మా తండ్రి గారిని జయసింహమహారాజుని లోనికి తీసుకొని వస్తాను.

యోగి:— నిన్ను ముందుగానే ఎందుకు రమ్మన్నానో తెలుసా ?

యువరాజు:— తెలియదు చెప్పండి.

యోగి:— చంద్రకాంతను చూడాలని నువ్వు, నిన్ను చూడాలని చంద్రకాంతా చాలా ఆతురతగా

ఉంటారు. అటువంటి సమయంలో ఏకాయెకి పెద్దవాళ్ళ ముందర చంద్రకాంతను చూపిస్తే, మీ కిద్దరికీ పెల్లుబికి వస్తున్న ఆనందాన్ని వ్యక్తపరచుకొనే వీలుండదు. ఆ విధంగా వీలులేక మీరు దూరదూరంగానే ఉన్నప్పుడు వుద్వేగంవల్ల పెద్దవారిని లెక్కచేయకుండా ఒకరిదగ్గరకు మరొకరు వెళ్ళితే అదిచూచేవారికి సమంజసంగా తోచదు. అందుకని ఆమెనుముందుగా నీకు చూపిస్తాను, నా వెంటరా."

యోగి మాటలకు ఎన్నాళ్ళనుంచో చంద్రకాంత కొఱకు ఎదురుచూస్తున్న యువరాజు సంబరపడి అతని వెంట పోసాగాడు. గదిదిక్కుగా కొద్దిదూరం వెళ్ళేసరికి ఒక దాసి పువ్వులు కోస్తున్నది. ఆమెతో యోగి "నీవు చంద్రకాంత దగ్గరకువెళ్ళి వీరేంద్రసింహుడు వస్తున్నాడని చెప్పి చెలి కత్తెలతో తన గదిలోనికివచ్చి ఉండమనిచెప్పు" అన్నాడు. దాసి వెళ్ళిపోయింది. యోగి యువరాజు తేజసింహునితో తోటలో అటూఇటూ తిరగసాగాడు. తేజసింహుడికికూడా చపలను కలుసుకోవాలని కోరిక ఉన్నది. ఇద్దరూ తమ ప్రియురాండ్రకొరకు ఎదురుతెన్నులు చూస్తూ మౌనంగా మునివెనుక తిరుగుతున్నారు. ఆ తర్వాత యోగి వాటిద్దరినీ చంద్రకాంత చిత్రపటమున్న గదిదగ్గరకు తీసుకొని వెళ్ళి "ఈ గదిలో రాజకుమారి చంద్రకాంత తన చెలికత్తెలతో కలసి ఉన్నది. వెళ్ళండి. నేను ఇంకొకపని చూచుకుంటాను" అన్నాడు.

# 18

యువరాజు ఆ గదిలో ప్రవేశించాడు. దూరంగా చంద్రకాంత, చంపా చపలలతో కలిసి వాకిలి దిక్కుగా చూస్తూ నిలబడివుంది. చంద్రకాంతనుచూచి యువరాజూ, యువరాజును చూచి చంద్రకాంతా ఒకరికి మరొకరు ఎదురుగా పరుగెత్తుకొని వచ్చారు. ఇద్దరూ అతి సమీపానికి వచ్చి కలుసుకోవటానికి వీలులేకుండానే స్పృహతప్పి నేలపై పడిపోయారు.

తేజసింహునకు చపలకు కూడా దృష్టులు కలిశాయి. పాపం! చంప యువరాజునూ చంద్రకాంతను చూస్తూ వాళ్ళు పడిపోయేసరికి ఒక గదిలోనికివెళ్ళి ఒకచేత్తోకస్తూరి తైలండున్న కూజా, ఇంకొకచేత్తో జిగురు మట్టిగడ్డా పుచ్చుకొని పరుగెత్తుకొని వచ్చింది.

ఇద్దరి ముఖాలమీద తైలపు పట్టీలువేసి మట్టిగడ్డ మీద తైలంవేసి వాసన చూపింది. అంతలో తేజసింహుడూ చపలాకూడా చంద్రకాంతా వీరేంద్రసింహుల పరిస్థితిచూచి ఉపచారాలు చేయటానికి వచ్చారు.

యువరాజు వీరేంద్రసింహుడు, రాజకుమారి చపలా స్పృహలోనికి వచ్చారు. ఇద్దరూ ఒకరినొకరు చూచుకో సాగారు. ఎవరికి నోటనుంచి మాటరాలేదు. ఏమిఅడగాలి, ఏమనివంకలు చెప్పుకోవాలి, అసలు ఎక్కడనుంచి మాటలు ప్రారంభించాలి, ఇద్దరి మనస్సులలోను ఇదే ఆలోచన. పెగిలిన మాట పెగిలినట్లుగానే గొంతులోనే ఆగిపోతోంది. విషయ

భారంవల్ల గొంతులు స్తంభించాయి. ఇద్దరికళ్లనుండీ బాష్పాలు కాలువలు కట్టాయి.

గంటలుగడిచాయి. ఆయిద్దరి మనస్సులూ పరస్పరం చూచుకోవటంతో సంలీన మైపోయాయి. ఎక్కడ ఉన్నాం? ఏంచేస్తున్నాం? ఎదురుగా ఎవరున్నారు? అనే ఆలోచన కూడా ఇద్దరికీ లేకుండా పోయింది.

ఆ యిద్దరి మానసిక పరిస్థితి తెలిసినవారు చపలా తేజసింహులు మాత్రమే! ఇతరులెవ్వరూ వారి పరస్పర ప్రేమను లెక్కకట్టి చెప్పలేరు. అసలు వారిద్దరూ తమ్ము తాము మఱచిపోయారు. పరాకాష్ఠ చెందినవారి ప్రేమ సరిహద్దులను చూచి చంప భయపడింది. ఎక్కడ నాయకి నాయకులు ప్రేమోన్మాదములో పిచ్చివా రైపోతారోనని భయపడసాగింది; ఆమె వారిని ఈ లోకంలోనికి తీసుకొని రావడానికి, పరస్పరం సంభాషించుకొనే ఉపాయం ఆలోచించింది. రాజకుమారి చెయ్యిపట్టుకొని చంప "రాజకుమారీ! వనకన్య అని ఎవరికి పేరు పెట్టారో; యువరాజు కనిపించినప్పుడు అడుగుతానన్నారుగా? ఆమె ఎవరో; ఆమెకు యువరాజు ఏమి వాగ్దానం చేశారో; ఇప్పుడు ఎవరితో పెండ్లి చేసుకోవాలని అభిప్రాయ పడుతున్నాడో, ఆ విషయాలన్నీ యువరాజుని అడగండి మఱి" అన్నది.

ఎవరికైనా ఇతరులు వేరే ఆలోచనలు రేపినప్పుడే, ఏకాగ్రతనుండి విడిపోతారు. అందుచేతనే యోగులు ఏకాంతంగా ఉండటానికి ప్రయత్నిస్తారు. మన నాయకీ

నాయకుల ప్రేమ కేవలం కామాతురత కలిగినట్టిది కాదు. అతి పవిత్రమైనట్టిది. అందుచేతనే తాదాత్మ్యం చెంద గలిగారు. ఏకరూపం చెందినవారు నోరెత్తి మాట్లాడ నవసరం లేకుండానే ఒకరి వియోగబాధను మఱొకరు అర్థం చేసుకో గలుగుతున్నారు. చంప కలిగించిన తపో భంగంవల్ల ఇద్దరూ వేరు వేరు కాజొచ్చారు. విడిపోయిన వారి కన్నులు క్రిందికి చూచాయి. ఇద్దరూ కొద్ది కొద్దిగా మాట్లాడసాగారు. తలా తోకా లేని పొడి పొడిగాఉన్న వారి మాటల అర్థాలు ఇతరులు తెలుసుకోవటం కష్టం. ఇన్నాళ్ళ పాటు ఒకరిని విడచి మరొకరు ఉండవలసిరావటం; చంద్ర కాంత, యువరాజుని నీవల్లనే అని గానీ, యువరాజు, చంద్ర కాంతను నీవల్లనే అనిగానీ ఫిర్యాదు చేసుకో లేకపోయారు.

బహుశః వాళ్ళు కొన్ని ఝాములపాటు ఒకరికిఎదురు మరొకరు కూర్చుండిఉంటే ఏదైనా మాట్లాడుకోగలిగేవా రేమోకాని, సిద్ధనాధయోగి రెండు గంటలు గడిచేసరికే ఇద్దరినీ వేఱుచేశాడు.

"రాజకుమారా! ఆలస్యం చెయ్యకుండా మిమ్మల్ని బాబాజీ పిలుచుకొని రమ్మన్నాడు" అని ఒక దాసి వచ్చి చెప్పింది. యోగి గీచిన గీటు దాటటం యువరాజుకు శక్యం కాదు. తొందరగా బయటికి వెళ్ళటానికి సిద్ధపడ్డాడు. ఇద్దరి హృదయాలూ అన్యోన్య పరివర్తనం పొందాయి. యువ రాజు చంద్రకాంతకు ఏమీ చెప్పకుండానే తేజసింహునితో కలసి బైటికి వచ్చేశాడు.

యోగి:- యీ రోజంతా చంద్రకాంత ఎదురుగానే కూర్చోమని చెప్పానా రాజకుమారా? మధ్యాహ్నం అవుతోంది. గుహవాకిలిదగ్గఱ విడిచిపెట్టి వచ్చినవారు నీకోసం ఎదురుచూస్తూ వుండరూ?

యువరాజు:-(సూర్యుణ్ణిచూచి) అవునండీ; ప్రొద్దు...

యోగి:- ప్రొద్దేమిటి?

యువరాజు:— అవునండీ, అలస్యమైంది. ఇక మీరు అనుమతించారంటే నేను వెళ్ళి మా తండ్రిగారిని, జయసింహ మహారాజును త్వరగా తీసుకొస్తాను.

యోగి:- త్వరగా వెళ్ళి తీసుకొనిరా! కాని నేను చెప్పానని చెప్పి వారిని చంద్రకాంత ఎవరి ఎదుటికి రావటానికి వీలుంటుందో వారిని మాత్రమే తీసికొని రమ్మను.

యువరాజు:- నమస్కారం!

యోగి:— ఇప్పుడే తిరిగివచ్చేస్తావుగదా: ఇంతలో నమస్కారమెందుకు?

తేజసింహుడు:—అనేక వందనాలు.

యోగి:—నీవు జీవితమంతా వందనను చేయవలసి వుంటుందిలే! కాని మీ నోటిద్వారా గుహబైట ఉన్నవారెవరూ రాజకుమారుని చూచినసంగతి తెలుసుకోరాదు. వచ్చే సమయంలో కొద్దిగానే ప్రొద్దుంటే ఇవ్వేళరావద్దు.

తేజసింహుడు:—మేమెందుకు చెప్పుతామండీ.

పిదప ఇద్దరూ యోగిదగ్గఱ సెలవు తీసుకొని గుహ బైటికి వచ్చారు. మధ్యాహ్నం గడచిపోయింది. రాజ

కుమారుడు అంతవఱకూ స్నాన సంధ్యావందనాదులుకూడా చేయలేదు.

సురేంద్రసింహుని, జయసింహుని కలుసుకొని యువరాజు సిద్ధనాథయోగి సందేశాన్ని అందించాడు. వారిద్దరూ యువరాజును యోగి మొట్టమొదట రమ్మనమని పిలిచిన కారణం అడిగారు. దానికి ఉచితమనుకున్న సమాధానాన్నిచ్చి యిద్దరూ తమ తమ డేరాల వద్దకు వచ్చి స్నాన, పూజాదులు ముగించి కొద్ది కొద్దిగా భోజనంచేశారు.

తమవెంట ఎవరెవరిని గుహలోనికి తీసుకొనివెళ్లాలో మహారాజులిద్దరూ ఒకచోట కూర్చుండి ఆలోచించుకోసాగారు.

సురేంద్రుడు:—రాజకుమారి చాటుకు పోనవసరం లేకుండా ఉండేవారినే వెంటతీసుకొని రావలసిందని యోగి ఆజ్ఞ కదా!

జయసింహుడు:—మనమిద్దరమూ, యువరాజు, తేజసింహుడు తప్పకుండా వెడదాం. ఆ తర్వాత మీ కింకా ఎవరు ఇష్టులైతే వారిని వెంటపెట్టుకొని వెడదాం.

సురేంద్రుడు:—చాలామందిని తీసుకొని వెళ్ళవలసిన అవుసరం లేదు. ఐంద్రజాలికులనుమాత్రం తప్పకుండా తీసుకొని వెళ్ళాలి. వీరికి చాటుగా ఏవీ ఉండకూడదు. అది ఉచితంకూడా కాదు.

జయసింహుడు:- అయితే మనం గుహలోనికి తీసికొని వెళ్ళగూడని వా రెవరున్నారు?

వీరి ఆలోచన పూర్తి అయ్యేసరికి బాత్తిగా ప్రొద్దు గుంకే సమయమైంది. సురేంద్రసింహుడు తేజసింహుణ్ణి పిలిపించి "ఇక్కడనుంచి యోగి దగ్గఱకు చేరటానికి ఎంత సమయం పడుతుంది" అని అడిగాడు.

"అటూ ఇటూ చూడకుండా తిన్నగా యోగిఉన్న తోటలోనికి వెళ్ళాలంటే అయిదారు గడియలు పడుతుంది. అయినా ఈ సమయంలో బయలుదేరటం మంచిదికాదు, దారి బాత్తిగా బాగుండదు. చీకటి పడిందంటే ఒక్కడుగు కూడా ముందుకు వేయలేము."

జయసింహునికి కుమార్తెను చూడాలని చాలా ఆతురతగా ఉంది కాని అందఱూ జయసింహుని మాటకు ఎదురుచెప్పకుండా మఱునాటి ఉదయం గుహలో ప్రవేశించ టానికి నిశ్చయించుకొన్నారు.

# 19

మరునాటి ఉదయం ఐంద్రజాలికులతో కలసి అందఱూ గుహాద్వారంలో ప్రవేశించారు. తేజసింహుడు రెండు తాళాలను తియ్యటం చూచిన రాజు లిద్దరూ ఆశ్చర్యపడ్డారు. గుహాలో ప్రవేశించిన తర్వాత మరీ హెచ్చయిన ఆశ్చర్యంతో నలుదిక్కులనూ చూస్తూ ప్రశంసించసాగారు.

తేజసింహుడు వారిని అటూ ఇటూ తిప్పుతూ, చిత్ర విచిత్రాలను చూపుతూ సిద్ధనాథుడు ఉండే తోటయొక్క ముఖద్వారం దగ్గరకు తీసుకొని వచ్చాడు. అంతకుముందే

ద్వారం దగ్గరకు యోగి యీ మహారాజులకు స్వాగతం చెప్పటానికి వచ్చి ఉన్నాడు.

"అటు చూడండి, వారే, సిద్ధనాద యోగీంద్రులు" అని తేజసింహుడు మహారాజులను వేలెత్తి చూపించాడు.

ఇద్దరు రాజులూ మహాయోగిని సమీపించి సాష్టాంగ నమస్కార మాచరించాలని అనుకున్నారుగాని అంతకు ముందే యోగి గొంతెత్తి "నాకు నమస్కారం చేశారంటే జాగ్రత్త! నన్ను కలుసుకోలేరు! ఆ తర్వాత పశ్చాత్తాప పడవలసి ఉంటుంది" అన్నాడు. అందుమీదట ఎవరికీ యోగికి నమస్కరించే శక్తి లేకుండా పోయింది. కాని మాని ఆనతికి మహారాజులు కారణం తెలియక తికమకపడిపోయారు. దగ్గరికి వెళ్ళి చెయ్యి చెయ్యి కలపాలని చూశారుగాని యోగి "మహారాజా! మీరు నాకంటె ఎన్నోరెట్లు గొప్ప వారు. నేను మీతో చేతినికలిపే యోగ్యుణ్ణి కాదు" అని తన అసమ్మతిని ప్రకటించాడు.

సురేంద్రుడు:- యోగులకు మించినవారు ఇంకెవరున్నారు?

యోగి:- మీరు చెప్పింది వాస్తవమే, కాని నేను ఎటువంటి యోగినో మీకు తెలియదు.

సురేంద్రుడు:- యోగు లెటువంటివారైనా వందనీయులు.

యోగి:- ఎంటువంటి యోగిఅనేది తర్వాతచూద్దాం నే నసలు యోగిన్నై తేగదా!

సురేంద్రుడు:- అయితే మీ రెవరు ?

యోగి:- ఎవరూ కాదు.

జయసింహుడు:- మీమాటలు మాకు అర్థం కావటం లేదు సరిగదా పైపెచ్చు ప్రతిమాటా ఆశ్చర్యాన్నీ అనుమానాన్నీ కలిగిస్తున్నాయి.

యోగి:— (చిరునవ్వు నవ్వి) సరే! తోటలోనికి ప్రవేశించండి.

యోగి అందరినీ వెంటతీసుకొని ఆ తోటలోనికి వెళ్ళాడు. వారు ఆతోటలోని సుందర దృశ్యాలను చూస్తూ గతదినం రాకుమారుడు చంద్రకాంతను కలుసుకున్న గదిలో ప్రవేశించారు.

ఇప్పుడు ఆ గది లోగడ ఎప్పుడూ లేనంత అందంగా ఉన్నది. గదికి మధ్యగా అమర్చిన ఉన్నతాసనాలపై సురేంద్ర జయసింహ వీరేంద్రసింహులను యోగీశ్వరుడు కూర్చుండచేశాడు. వారికి ఇరువైపుల అర్హతానుసారంగా ఐంద్రజాలికులను ఉపవిష్టులను చేశాడు. తాను వారికి ఎదురుగా వ్యాఘ్రచర్మంమీద కూర్చుండి మాట్లాడటం ప్రారంభించాడు. మొదట ఆగంతుకుల కుశల సమాచారాలు అడిగాడు. మహారాజులు యోగి ప్రశ్నకు తమ దయవల్ల క్షేమంగానే ఉన్నామని ప్రత్యుత్తర మిచ్చాడు.

"మిమ్ములను ఇంతవరకూ రావలసివచ్చిన కష్టం కలిగించినందుకు క్షమించం"డన్నాడు యోగి.

జయసింహుడు:- ఇక్కడకు రాకుండా ఉండటంవల్ల నే చంద్రకాంతనుగూర్చిన చింత మమ్మల్ని నిరంతరం వేధిస్తుండేది. చంద్రకాంతను సంపాదించ గలిగినందుకు మాకీ కష్టం అసలొక లెక్కలోనిదేకాదు.

యోగి:- ఇక మీరు చంద్రకాంతాన్వేషణంకొఱకు బాధపడవలసిన అవుసరం వుండదు.

జయసింహుడు:- ఇవ్వేళ తప్పకుండా మీ దయవల్ల చంద్రకాంతను చూడగలమని ఆశిస్తున్నాం.

యోగి "ఏదైనా కారణాలవల్ల ఇవ్వేళ చంద్రకాంతను చూడలేకపోయినా రేపుమాత్రం తప్పకుండా చూస్తారు. ఇప్పుడు మీరు స్నాన సంధ్యావందనాదులు ముగించుకొని భోజనాలకు లేవండి. ఆ తర్వాత మాట్లాడుకుందాం" అని ఒక దాసిని పిలిచి అతిథులకు కోనేటిలో స్నానంచెయ్యటానికి ఏర్పాట్లుచెయ్యమని ఆజ్ఞాపించాడు.

ఆ మీదట అందఱూ స్నానభోజనాదులు ముగించుకొని భోజనశాల ప్రక్కగదిలో కూర్చున్నారు.

సురేంద్రుడు:- మీ రాజ్యంలోనే ఉన్న ఈ పర్వతప్రాంతంలోని ఉద్యానవన సముదాయాన్ని నేనెన్నడూ చూడలేదు. ఈ పర్వతాగ్రభాగంనుంచి బయటకు వెళ్ళే మార్గ మేదైనా ఉన్నదా?

యోగి:- ఈ ప్రదేశానికి రహస్యమార్గా లుండటంవల్ల ఎవరూ ఇక్కడకు రారు. అయితే ఎవరికి చిన్న ఇంద్రజాలం సంగతి తెలుసో; వారు రాగలరు. ఇక్కడకు రావ

టానికి మీరు ఇప్పుడు వచ్చినమార్గం ఒకటి; ఈ తోటలో నుండికూడా బయటికి లోపలకు రావటానికి మరొకమార్గం ఉన్నది. కాని అది చాలా రహస్యమైనది.

సురేంద్రుడు:- మీరు ఎన్నాళ్ళనుండి ఈ పర్వతంపై ఉంటున్నారు?

యోగి:- నేను చాలా కొద్దిరోజుల క్రిందటనే ఈ గుహలోనికి వచ్చాను. ఇదికూడా మా యజమాని పనివల్ల రావలసివచ్చింది గాని స్వయంగా రాలేదు.

సురేంద్రుడు ఆశ్చర్యంతో "మీరు ఎవరి కొలువులోని వారు?" అడిగాడు.

యోగి:- ఆసంగతికూడా మీకు త్వరలో తెలుస్తుంది.

జయసింహుడు:- ఈ మహారాజు అన్నదాన్నిబట్టి ఈ ప్రదేశం తన రాజ్యంలో ఉన్నప్పటికీ తనకు తెలియదనే అనుకోవలసియున్నది. అయినప్పుడు దీనికింకా యజమానులన్నవారు వేఱుగా ఎవరు ఉండిఉంటారు?

జయసింహమహారాజు ప్రశ్నకు యోగి సమాధానం ఇవ్వకుండానే వెనక్కి తిరిగి చూచాడు. ఇంతలో వనకన్య రావటం కనిపించింది. ఆమె ఇరువైపులా ఇద్దరు చెలికత్తెలూ వారివెనుక పదహారుమంది పరిచారికలూఉన్నారు. వనకన్యను చూపుతూ యోగి "ఈ ప్రదేశానికి యజమానురాలు ఈమె!" అని చెప్పాడు.

అందఱూ ఆశ్చర్యంగా వనకన్యదిక్కుగా చూచారు. వీరేంద్రసింహునికి చంద్రకాంతను దొంగిలించినవ్యక్తి వన

కన్యయేనని స్పష్టమయింది. అతడు తల వంచుకొని ఆలో చిస్తున్నాడు. 'చంద్రకాంతను నా సహాయం లేకుండా పొందలేవ'ని లోగడ వనకన్య వ్రాసిన ఉత్తరాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని తన అనుమానాన్ని మరింతగా దృఢపఱచుకున్నాడు. అటువంటి స్థితిలో వనకన్యను వీరేంద్రుడు సహజంగా ఆప్తురాలినిగా స్వీకరించలేడు. కాని వీరేంద్రుడు వనకన్యను చూడకుండా ఉన్నంతసేపే ఆమెపై శత్రుభావాన్ని నిలుపుకో గలిగాడు. గానీ యెప్పుడైతే ఆమె దివ్య మంగళ స్వరూపాన్ని ఆపాదమస్తకం అవలోకించాడో; ఆ క్షణంనుండి ఆమెపై తిరిగి అవ్యాజానురాగం పెనవేసుకోసాగింది.

"అయితే చంద్రకాంత పాపం; ఈమె చేతిలోనే బందీ అయిందన్నమాట!" అన్నాడు సురేంద్రుడు.

యోగి:- చంద్రకాంత ఈ గుహలో చిక్కిన నాటికి ఈమె ఇంకా యజమానురాలు కాదు.

జయసింహానికి, సురేంద్రసింహునికి ఈ చిత్రకథ అర్థంగాక "అయ్యా! తమరు మమ్మలను గాబరాపెట్టక సూటిగా ఈమె యెవరో? ఈ పర్వతప్రాంతానికి యజమాని యెవరో? చంద్రకాంత యెక్కడ ఉన్నదో? సమాధానం చెప్పండి" అన్నారు.

యోగి వనకన్యను దగ్గఱగా పిలిచి ఆమె ముఖాన కూర్పాసంవలె ఉన్న సన్నని అవకుంఠనాన్ని తొలగించి "ఇదుగో ఈ వనకన్యయే మీ చంద్రకాంత" అని జయ

సింహుని పాదాల ముందాల సమర్పించుకొన్నాడు. అందరూ ఆమెను చంద్రకాంతగా గుర్తుపట్టారు. జయసింహామహారాజు పునర్జన్మ పొందినట్లు దొరికిన తన కూతురిని హృదయానికి హత్తుకొని సంతోషభరితు డయ్యాడు.

సిద్ధనాథ యోగి ఆ యిద్దరు చెలికత్తెల ముఖాలపై ఉన్న పొరలనుకూడా తొలగించాడు. వారు చంపా చపలలే.

అందరూ జీవితంలో ఇంతవరకూ పొందని ఆనందాన్ని రుచిచూచారు. జయసింహుడు సురేంద్రసింహుణ్ణి చూపినమీదట చంద్రకాంత భక్తి పురస్కరంగా సురేంద్రుని చరణాలను స్పృశించింది. సురేంద్రుడు చంద్రకాంతను లేవనెత్తి శిరస్సు మూర్కొన్నాడు. వీరేంద్రుడు ఈ చిత్ర సన్నివేశాన్ని సంభ్రమాశ్చర్యాలతో తిలకిస్తున్నాడు.

జయసింహామహారాజుతో యోగి ఇక "మీరు రాకుమారిని తన చెలికత్తెలతో వెళ్ళనివ్వండి. నే నామె విచిత్ర కథను మీకు వినిపిస్తాను" అన్నాడు.

జయసింహుడు:- చాలా రోజులతర్వాత నా కడుపు పంట నా కన్నులపండుగ చేసింది. ఇంతలోనే విడిచి పెట్టాలంటే తిరిగి చూడగలగటం చిక్కులకు దారి తీస్తుందేమోనని భయపడుతున్నాను.

యోగి:-(నవ్వి) ఇక చంద్రకాంత మిమ్మల్ని విడిచి యెక్కడకూ వెళ్ళదు.

జయసింహుడు:- అట్లా అయితేసరే! ఈమె వృత్తాంతాన్ని ప్రారంభంనుంచి తెలియ జెప్పండి.

యోగి:- ఆవిధంగానే చెపుతాను.

# 20

సిద్ధనాథ యోగి పర్వతప్రాంతాన్ని గురించి ఇలా సవిస్తరంగా చెప్పటం ప్రారంభించాడు.

"ఈ పర్వతం ఒక చిన్న ఇంద్రజాలనిలయమని నాకు తెలుసు. చునారగఢ రాజ్యంలో కూడా ఒక ఇంద్రజాలం ఉన్నదని నాకు తెలుసు. చునారగఢ రాజ్యంలో ఉన్న ఇంద్రజాలం ఎవరిచేత భేదింపబడుతుందో అతనికి భార్యగా ఎవరు కాబోతున్నారో ఆమె పెండ్లికిచ్చే కట్నం కానుకల మీద ఇక్కడి చిన్న ఇంద్రజాలంనిర్మితమైంది. ఆమెకు వివాహం జరగటానికి పూర్వమే ఈఆస్తిపై యాజమాన్యం సిద్ధిస్తుంది."

అంతలో "అసలు ఇంద్రజాలమంటే ఏమిటి? ఏవిధంగా నిర్మిస్తారు!" అని అడిగాడు సురేంద్రసింహ మహారాజు. అందుమీదట యోగి ఆ వివరాలు చెప్పటం ప్రారంభించాడు.

"వారసులు లేకుండా ఉన్న గొప్ప భాగ్యవంతుడు ఇల్లాంటి ఇంద్రజాలగృహాన్ని నిర్మిస్తాడు. అతడు మహా పండితులైన జ్యోతిశ్శాస్త్రవేత్తలను రావించి ఉత్తరోత్తరా అతని వంశంలోగానీ, సహోదరుల వంశములోగానీ సమర్థుడూ ప్రతాపవంతుడూ అయినవాడు పుట్టబోతాడేమో తెలుసుకుంటాడు. ఆ ప్రకారం ఎవడైనా జన్మించేయోగ

ముంటే అతని జాతక పత్రాన్ని తయారు చేయిస్తాడు. అతని పేరిట అమూల్యములైన వస్తుసముదాయాన్ని ఒక చోట పెట్టి దానిమీద ఇంద్రజాల వ్యూహాన్ని నిర్మిస్తాడు.

"ఇప్పుడు కొద్దోగొప్పో ధనాన్ని ఒకచోట పెట్టి దానిని కాపాడటానికి బలులు ఇస్తే అది దయ్యంగానో, పాముగానో అయి దానిని రక్షించే ఇంద్రజాల పద్ధతి చెలామణిలో ఉన్నది. ఆ దయ్యంగాని పాముగానీ ఆ సంపదకు అర్హుడైన వానిని తప్ప ఇతరుల నెవ్వరినీ ముట్టుకో నివ్వకుండా చేస్తుంది. ఆ రోజులలో యీపద్ధతి లేదు. పూర్వకాలంలో ఇంద్రజాల గృహాన్ని తయారుచెయ్య వలసివస్తే రాజులు గొప్పగొప్ప వైద్యుల్ని శిల్పుల్ని, జ్యోతిశ్శాస్త్రవేత్తల్ని, వాస్తుశాస్త్రజ్ఞుల్ని పిలిపించేవారు. వారు చెప్పిన ప్రకారం భూమిని త్రవ్వి అక్కడ సంపదను పెట్టి దానిమీద ఇంద్రజాలభవననిర్మాణంచేసేవారు. తంత్రజ్ఞులూ, జ్యోతిషికులూ, శిల్పులూ, వైద్యులూ తమయావచ్ఛక్తినీ వినియోగించి ఇంద్రజాలాన్ని పటుతరంగా నిర్మించే టప్పుడు ఆ ఆస్తియెవరికి చెందవలసి ఉన్నదో అతనిని గురించి కూడా యోచిస్తారు. వీరేంద్రసింహుడు ఆ ఇంద్రజాలాన్ని భేదించినప్పుడు దర్శన శాస్త్రజ్ఞులూ జ్యోతిష్కులూ వైద్యులూ యెంత ఘనమైన శక్తియుక్తులో బయల్పడింది. ఆ విషయాలన్నీ మీరు యువరాజు ముఖతః వినేఉన్నారు!"

జయసింహుడు, "అవును ఆ సంగతి కొద్దికొద్దిగా విన్నాముగానీ మీ రిప్పుడు నాకుమాత్రై సంగతి, ఈ పర్వతం సం

గతి చెప్పండి. ఆ తర్వాత ఈ గుహనుండి శివదత్తుడు ఏ విధంగా విముక్తుడై తిరిగి ఏవిధంగా బందీ అయినాడో కూడా తెలియపర్చండి.

యోగి:- రాజకుమారి చునారగఢంలోని ఇంద్రజాలంలో చిక్కుకొని ఈ గుహలోనికి వచ్చిన రెండు మూడు రోజులు చాలా అవస్థలు పడింది. మూడవనాడు నాకీసంగతి తెలిసి రాజకుమారిని అక్కడనుండి, తీసుకొని వచ్చాను. ఈమె చిక్కుకొన్న చోటుకూడా తర్వాత మీకు చూపిస్తాను.

సురేంద్రుడు:-ఇంద్రజాలాన్ని భేదించటానికి బలంతో కూడా అవసరం వుందా?

యోగి:-బలంకూడా అవసరం అవుతుంది గాని మన రాకుమారి ఇంద్రజాలాన్ని భేదించ వలసివచ్చినప్పుడు బలం అవసరం యేమాత్రం కలుగలేదు. ఎందుచేతనంటే రాజకుమారి భేదించిన ఇంద్రజాలానికీ యువరాజు భేదించిన ఇంద్రజాలానికీ సంబంధముంది. మీరు చెప్పినట్టు యువరాజు గనుక అక్కడి ఇంద్రజాలాన్ని భేదించకపోయి నట్లయితే ఈ ఇంద్రజాలం మాత్రం భేద్యమయ్యేది కాదు.

యువరాజు:- రాజకుమారి ఈ గుహలోనికి వచ్చినప్పుడు మేము చూచాము. కాని ఆమెను విడిపించే మార్గం మాకేదీ కనిపించలేదు. మీరు రాజకుమారి దగ్గరకు ఎలా వెళ్ళగలిగారో చెప్పండి ?

యోగి:- ఇంద్రజాలాన్ని గురించి ఆలోచించినంత మాత్రాన మార్గోపాయం దొరకదు. మీరు ప్రయత్నాలు చేస్తున్నారనికూడా తెలుసుకొన్నాను. నేను ప్రయత్నిస్తే రాజకుమారిని బయటకు తీసుకొని రాగలను గాని ఆమె చేతనే ఇంద్రజాలాన్ని భేదింపజెయ్యా లనుకొనటంచేత ఆమెను **బయటకు** తీసుకొనిరాలేదు.

యువరాజు:-మీరు యోగీంద్రులు గనుక దివ్యదృష్టి తో ఎటువంటి పనులనైనా చేయించ గలుగుతారు!

యోగి:- మీరు నన్ను యోగిగా భావించకండి. మాయాజాలంవల్ల చెయ్యలేనిపని నేనుకూడా ఏదీ చెయ్య లేను. నేను రాజకుమారి దగ్గరకు వెళ్ళిన పద్ధతీ ఆమార్గాలూ చెప్పుతాను వినండి.

## 21

సిద్ధనాథ యోగీంద్రులవారు చెప్తున్నారు. "నేను మొదట గుహాద్వారం తెరుచుకొని లోనికివెళ్లాను. అక్కడ రాకుమారి పర్వతాగ్రాన వివశురాలై పరితపించటం చూచాను. ఈ గుహలో చిన్నచిన్న ఉద్యాన వనాలున్నా యని మా గురువుగారు చెప్పగా విన్నాను. ఆ తోటల లోనికి ప్రవేశించటానికి గుహాంతార్భగంలో ప్రవహిస్తున్న సెలయేటిలోనుంచి మార్గం ఉన్నదని కూడా మాగురువుగారి వల్ల తెలుసుకొన్నాను.

"నేను కాసె బిగించి, ఆ సెలయేటిలో అటూ ఇటూ తిరగటం ప్రారంభించాను. నాకు తూర్పుదిక్కుగా నీటిలోపల

ఒక వాకిలి వున్నట్లుగా తోచింది. లోపలకు దిగటం ప్రారంభించాను. ఎనిమిది పది చేతుల లోతువరకు నీళ్ళు తప్ప నాకేమీ కన్పించలేదు. ఆ తర్వాత నీళ్ళు తగ్గి పోయాయి. అక్కడ నుండి నాకు పైకి ఎక్కిపోవటానికి ఒక సొరంగం మాదిరిది కన్పించింది.

"ఒక అరగంట ఆ విధంగా నడిచిపోయిన మీదట నాకు మన మిప్పుడు కూర్చున్న తోట కనిపించింది. ఆ తోటలో అటూ ఇటూ తిరిగి ఈ గది కనుక్కున్నాను. అదిగో! ఆ గోడకు కనిపిస్తున్న అలమారా ఉన్నదే, అది వాస్తవానికి ఒక ద్వారం. గట్టిగా తన్నితే తెరుచుకుంటుంది. ఆ వాకిలి తెరిచి లోనికి ప్రవేశించాను. లోపల అంతా చీకటి. సుమారు రెండువందల అడుగులు వెళ్ళిన తర్వాత ఒక వాకిలి కనిపించింది. దానిని కూడా కాలితో తన్ని వాకిలి తెరిచి లోనికి ప్రవేశిస్తిని గదా; సరిగా చంద్రకాంత చపలా వివశులై పడి ఉన్న చోటికి చేరుకొన్నాను. నా ప్రక్కనుంచే మరొక త్రోవ చునారగఢ ఇంద్రజాలం దగ్గిరికి చేర్చేది ఉన్నది.

"నన్ను చూచి వాళ్ళిద్దరూ భయపడ్డారు. నేను 'భయపడకండి. మిమ్మల్ని విడిపించటానికే వచ్చాను' అని చెప్పాను. ఆ తర్వాత వాళ్ళిద్దర్నీ నేను వెళ్ళిన మార్గం ద్వారానే ఇక్కడకు తీసుకొచ్చాను. ఇదంతా చేయగలిగాను. అక్కడనుండి కూడా వీళ్ళిద్దరినీ బయటకి తీసుకొచ్చి ఇంటికి పంపించగలను కానీ ఈ చిన్న ఇంద్రజాలాన్ని రాకు

మారిచేత భేదింపచేసి అక్కడి సంపద ఈమెకు లభింప చెయ్యాలని నా అభిలాష.

"నాకే కాదు; మీతోపాటు చాలామందికి కూడా చంద్రకాంతను విడిపించటానికి యువరాజు చునారగఢపు ఇంద్రజాలాన్ని భేదిస్తున్నాడని తెలుసు. యువరాజుకు ధనాపేక్ష కూడా లేదని తెలుసు. ఇటువంటి సమయంలో నేను చంద్రకాంతను తీసుకొని వెళ్ళి ఆయనకు అప్పగిస్తే యువరాజు ఇంద్రజాలాన్ని భేదించటం మానివేస్తాడు. ఇంద్రజాలాన్ని భేదించటం మానివేస్తే అమూల్యమైన సంపద దొరక్కుండా పోతుందికూడా.

"నేను ఎల్లప్పుడూ మీ అభివృద్ధిని ఆకాంక్షించేవాణ్ణి నాకు ఇంద్రజాలంలో దాచిఉంచిన సంపదంతా నిరర్థకం కావటం ఎప్పుడూ ఇష్టముండదు. యువరాజు చంద్రకాంతను కలుసుకోకుండా ఉన్నా నేను భరించలేను.

"నా మనస్సులో ఉన్న అభిప్రాయాన్ని రాకుమారికీ చపలకూ చెప్పాను. నా అభిప్రాయం ప్రకారం నడచుకోనక పోతే ఈ తోటలోనే విడిచిపెట్టిపోతానని కూడా భయపెట్టాను. రాకుమారి ప్రమాణంచేసి నేను చెప్పినట్లుగా చేస్తానంది.

"నాకు ఇక్కడవున్న ఇంద్రజాలంలోని సంపదకు చంద్రకాంత అధికారిణి కాగలదని తెలుసుగాని ఆ ఇంద్రజాలాన్ని ఏవిధంగా భేదించాలోమాత్రం తెలియదు. తాళం చెవులు ఎక్కడఉన్నాయోకూడా తెలియదు. ఇదే ఆలో

చనలో రెండుదినాలు గడచిపోయాయి. ఇక్కడఉన్న రెండు మూడు ఫలవృక్షాలవల్ల మా ఆకలి యేదో ఒకవిధంగా తీర్చుకున్నాం.

"మూడవనాడు పూర్ణిమ. నేను కోనేటి ఒడ్డున కూర్చుండి యేదో ఆలోచిస్తున్నాను. చంద్రకాంతా చపలా అటూ ఇటూ తిరుగుతున్నారు. ఇంతలో నా దగ్గరకు చపల పరుగెత్తుకొనివచ్చి 'ఈ తోటలో ఒక విచిత్రం చూపిస్తా పదండి' అన్నది.

"మేమిద్దరం కలసి తూర్పుదిక్కు గోడకు ఆనుకొని పరీక్షగా చూస్తూన్న చంద్రకాంతదగ్గరకు వెళ్ళాం. చంద్ర కాంత నన్నుచూసి 'బాబాజీ, ఈ గోడకన్నంలోనుండి పెద్దపెద్ద తెల్లని చీమలు వస్తున్నాయేమిటి?' అని అడిగింది.

"నా గురువుగారి ద్వారా తెల్లని చీమలు బయలు దేరినచోట తప్పకుండా ధనంగాని లేకపోతే తాళంచెవిగానీ వుంటుందని తెలుసుకొని వున్నాను. అందుచేత నా నడుంలో వున్న కత్తినితీసి చంద్రకాంతకిచ్చి ఆ ప్రదేశాన్ని తవ్వ మన్నాను. ఒకచెయ్యి లోతు త్రవ్వేసరికి గాజుపాత్ర ఒకటి మూతిమూసివున్నది కన్పించింది. రాజకుమారి చేతితో ఆ పాత్రను నేను బ్రద్దలుకొట్టించాను. అందులో ఒక రక మైన నూనెతోకలసి తాళంచెవుల గుత్తి ఒకటి మాకు లభిం చినది. మా కప్పుడు చాలా సంతోషం కలిగింది.

"ఆ మరునాడు నేను చంద్రకాంతను వెంటబెట్టుకొని మాకు దొరికిన తాళంచెవులతో యే తాళమన్నా తియ్య టానికి వీలౌతుందేమోనని చాలా తిరిగి చూచాం.

"ఇక నేను క్లుప్తంగా ఈభాగాన్ని చెప్పి ముగిస్తాను. తాళంచెవ్వుల గుత్తిలో ముప్ఫయి చెవులున్నాయి. చాలా రోజులు ప్రయత్నించి మేము ముప్ఫయితాళాలను తెరిచాం. మేము తెరచిన మూడు ద్వారాలు మాకు ఎటువంటివిగా కన్పించినవంటే; ఆ ద్వారాలగుండా మేము ఇంద్రజాలం పై భాగంనుండీ బయటికి వెళ్ళిపోవచ్చు. నాలుగు ఉద్యాన వనాలు కనిపించాయి. అమూల్యమైన వస్తుసం..., ఆభర ణాలూ, మణులూ, మాణిక్యాలతో నిండిన ఇరవైమూడు గదులు కనిపించాయి.

"ఇంద్రజాలంనుండి పైకిపోయే మార్గాలు కనిపించిన తర్వాత నేను నాయింటికి వెళ్ళాను. అనేక పరిచారికలనూ, ఇంకా అవసరమైన వస్తువులను తీసుకొని తిరిగి వచ్చాను. చాలారోజులకుగాని తాళాలన్నీ లొంగని కారణంగా రాజ కుమారి చాలా అలసిపోయి కులాసాగా బయటకువెళ్ళి తిరిగి వస్తానన్నది.

"ఆమె యెంతో మొండిపట్టు పట్టినమీదట నేను చివ రికి అనుమతి యిచ్చాను. నా నైపుణ్యంవల్ల నేను వారికి మాయువేషాలు వేశాను, రెండుమూడు గుఱ్ఱాలనుకూడా తెచ్చి యిచ్చాను. వాటిమీద వారు అప్పుడప్పుడు బయటికి షికారుకు వెళ్ళి వస్తూండేవారు. కాని రహస్యంగా ఉండే టట్లు ముందుగానే నేను వారిచేత వాగ్దానం చేయించు కున్నాను. చంద్రకాంత కూడా చివరివఱకూ నా కిచ్చిన వాగ్దానాన్ని పరిపాలించిందనే చెప్పాలి. ఈ లోపల అస్తవ్య

_స్తంగా ఉన్న ఈ ఉద్యాన వనాలనుకూడా తీర్చి దిద్దినట్లు చేశాం.

"యువరాజుకూడా అక్కడి ధనరాసులను చేజిక్కించుకొన్నాడు. ఇక్కడి సంపదకూడా రాజకుమారి హస్తగత మైంది. ఈ వేళవరకూ చంద్రకాంత నా కుమార్తెగాను, యజమానురాలుగాను వ్యవహరించింది. ఇప్పుడు నేను యీమెను మీకప్పగిస్తున్నాను.

"శివదత్తుని భార్యను చూచి జాలిచెందిన రాకుమారి వారినిద్దరినీ విడిచిపెట్టింది. వారిని విడిచిపెట్టినప్పుడు యువరాజుతో శత్రుత్వాన్నికూడా వదులుకొనే షరతు ఒకటి పెట్టింది. కాని అతను తన దుర్మార్గాన్ని విడిచిపెట్టలేక దుష్టమిత్రుల సహవాసంవల్ల తిరిగి యువరాజుకు హాని తల పెట్టాడు. అందుచేత తిరిగి నేను అతణ్ణి బాధించి ఎప్పటి చెఱలో పెట్టేశాను. ఇంకా మీకేమైనా అనుమానాలుంటే అడగండి. మీకు సరైన సమాధానం చెపుతాను."

సురేంద్రుడు:- అడగవలసిన విషయాలు చాలా ఉన్నప్పటికీ ఈ సంతోష సమయంలో ఏమీ గుర్తుకు రాకుండా పోతున్నవి. కాని మీ రెవరో, ఎక్క ఉంటారో రాజకుమారికి ఎందుచేత ఇంత సహాయం చెయ్యవలసి వచ్చిందో మాత్రం తెలియజేయండి?

యోగి:- సరే; ఈ విషయంకూడా చెప్పేస్తాను.

రాజకుమారిని జయసింహుడు "అమ్మాయీ, నీకు కూడా వీరెవరో తెలియదా?" అని అడిగాడు.

చంద్రకాంత చేతులు జోడించి "నాకు తెలుసుగాని; నేను చెప్పలేని పరిస్థితిలో ఉన్నాను. ఆ విధంగా వీరు నాచేత ప్రమాణం తీసుకొన్నారు."

యోగి:- మీరు తొందర పడతారెందుకు? నా విషయంకూడా మీకు అతి త్వరలోనే తెలిసిపోతుంది. మీరుమాత్రం ముందుగా చంద్రకాంతకు దొరికిన ధన రాసులను చూచిరండి.

జయసింహుడు:- మీ యిష్టం.

యోగి:- అందరినీ వెంటబెట్టుకొని రెండవ తోట లోనికి వెళ్ళాడు.

# 22

చంద్రకాంత హస్తగతమైన యావదాస్తినీ యోగి అందఱకూ చూపించాడు.

జయసింహుడు ఆ వస్తువులనన్నిటినీ చూచి "ఇంత ధనాన్ని ప్రోగుచేసినవా రెవ్వరోగాని వారి జీవితం ధన్య మైంది. మా తల్లికి కట్నంరూపకంగా ఇంత ధనాన్ని ఇవ్వాలంటే నేను నా రాజ్యాన్ని యావత్తూ అమ్మివేసినా నాలుగవవంతు కూడా పూడదు" అన్నాడు.

యువరాజు రాకుమారి చిత్రపటంతో దర్బారు జరిపి నప్పుడు చూచిన గదిలో అన్నిటికంటె ఎక్కువగా గుప్త ధనం లభించింది. రెండుమూడు రోజులపాటు యోగి తోట లను, గదులను, రస్తాలను విశదంగా అందరికీ చూపించాడు.

పనులన్నీ పూర్తి చేసుకొని అందరూ కూర్చున్న మీదట యోగితో జయసింహుడు "చంద్రకాంతను రక్షించటానికి మీరు తీసుకొన్న శ్రద్ధకు మేము జీవితాంతమూ కృతజ్ఞులంగా ఉంటాము. ఇక మీరు మీ వివరాలను తెలియజెప్పి మీ మనస్సులలో పేరుకొన్న అనుమానాలను దూరం చెయ్యండి" అన్నాడు.

యోగి "మీరు కొద్దిగా ఓపికపట్టితే నా సంగతికూడా మీ ముందు నివేదిస్తాను" అని ఒక ఈల ఊదాడు. ఆ వెంటనే ముగ్గురు నలుగురు పరిచారికలువచ్చి అక్కడ నిలబడ్డారు. తాను స్నానంచేసి తన నిజమైన దుస్తులు ధరించే యేర్పాట్లుచెయ్యండని యోగి వారిని ఆజ్ఞాపించాడు. వారు వెళ్ళి సిద్ధనాధయోగి స్నానంచేసే యేర్పాట్లుచేశారు.

"ఈ వేళ నేను నా పొడుగైన గడ్డానికి, మృగచర్మానికి తిలోదకాలిస్తాను" అని యోగి స్నానాలగదిలోనికి వెళ్ళాడు.

స్నానంచెయ్యటం పూర్తి అయిన తర్వాత సిద్ధనాధ యోగి బయటికి వచ్చాడు. ఇక సిద్ధనాధయోగిని ఆ విధంగా పిలవటానికి వీలులేదు. అతడిప్పుడు తేజసింహుని తండ్రియైన జీతసింహుడు.

వెంటనే ఉత్సాహాతిశయంతో నోట మాటకూడా రాకుండా సురేంద్రసింహ మహారాజు జీతసింహుణ్ణి అమాంతం కౌగలించుకొని "నీవు నా సహోదరుడికంటే కూడా ఎన్నో రెట్లు ఎక్కువ" అన్నాడు. ఆ వెంటనే తిరిగి "శివదత్తు

నికీ వీరేంద్రునికీ మధ్య పెద్ద యుద్ధం జరుగుతున్నప్పుడు నీవు కేవలం ఐదువందల సైన్యంతో వెళ్ళి రాజకుమారునికి సహాయపడ్డావు. ఇవ్వేళ యువరాజుకుకూడా మించిన కార్యం చేశావు. నీవు నాగధ విజయగఢాలకు చేసిన సహాయం తరతరాల వఱకూ కృతజ్ఞతాపాత్రమైంది." అని మంత్రిని కీర్తించాడు. జయసింహ మహారాజుకూడా జీతసింహుని కౌగలించుకొని ప్రశంసించాడు. తేజసింహుడు, దేవీసింహుడు మొదలైనవారంతా అతనిని పూజించారు.

జయసింహుడు సురేంద్రసింహునిపై గల విరోధ భావాన్ని పూర్తిగా మరచిపోయి తన కుమార్తెను యువ రాజుకిచ్చి వివాహం చెయ్యటానికి అనుజ్ఞ ఇవ్వవలసిందిగాను సురేంద్రసింహుని అర్థించాడు. సురేంద్రుడు జయసింహుని కౌగలించుకొని ముందుగా చంద్రకాంతను విజయగఢానికి తీసుకొని వెళ్ళి తల్లికి చూపించవలసిందిగా కోరాడు.

జీతసింహుడు "ఇక మనం వెళ్ళిపోదాం. ఇక్కడ దొరికిన వస్తువుల నన్నిటినీ మనం మన వెంట తీసుకొని వెళ్ళటం చాలా కష్టం. ఇదంతా చంద్రకాంతకు కట్న రూపంగా సిద్ధంచేసినట్టిది గనుక అంతా యిక్కడే ఉంచి పోదాం. ఇక్కడి వాతావరణం చంద్రకాంతకు చక్కని ఆరోగ్యాన్ని కూడా సమకూర్చింది. కాబట్టి వివాహమహోత్సవం పూర్తి అయిన తర్వాత ఆమె యిక్కడ కొన్నాళ్ళ పాటు ఉండటానికి వస్తుంది." అన్నాడు. అందరూ స్వస్థానాలకు ప్రయాణమైనారు. జీతసింహుడు పరిచారికలను పిలిచి

"మీరు మీ నిజమైన వేషాలు వేసుకొని చంద్రకాంతకు ఇంతకు ముందే తెచ్చిపెట్టిన పల్లకీని తీసికొని రండి" అని ఆజ్ఞాపించాడు. ఆ ప్రకారంగా వాళ్ళు తమ తమ నిజరూపాలతో పల్లకీని తీసికొని వచ్చారు. వీరేంద్రుడూ, తేజసింహుడూ, దాసీలను ఇప్పుడు గుర్తుపట్ట గలిగారు.

## 23

వీరేంద్రసింహ యువరాజు వచ్చిపోతూవుండే దారీ, జయసింహమహారాజు మొదలైనవారు వచ్చినదారీ ఏనుగుగాని, గుఱ్ఱంగాని, పల్లకీగానీ పోవటానికి అనువైనదికాదు. పై భాగాన ఉన్న దారిగుండా గుహాద్వారం దగ్గిరికి వెళ్ళటానికి కొంత చుట్టు తిరగవలసి ఉన్నది. అందుచేత జీత సింహుడు రాజకుమారి కొఱకు పల్లకీ తెప్పించాడు. మహారాజులిద్దరూ యువరాజూ దేనిమీద ప్రయాణం చేయాలా అని జీత సింహుడు ఇప్పుడు ఆలోచించ సాగాడు.

లోగడ రాజకుమారి స్వారీ చేయటానికి గుహాలోనికి రెండు గుర్రాలను తెప్పించటం జరిగింది గదా! జీతసింహుడు ఆ రెండు గుర్రాలనూ జయసింహ సురేంద్రసింహులకు ఒప్పగించాడు. యువరాజు కాలినడకనే ప్రయాణం చేయటానికి నిశ్చయించుకొన్నాడు.

ఆతోటకు దక్షిణ దిక్కున రెండువైపులా అందమైన లోహపు గూళ్ళుగల వాకిలి ఉన్నది. జీతసింహుడు ఎడమవైపు గూడుదగ్గరకు వెళ్ళి ఆ గూటి పడికంటిమీద

చేయ్యి వేశాడు. ఆ వెంటనే అది తలుపు తెరచుకొన్నట్లు తెఱచు కున్నది. దానిలోపల చక్రమొకటి ఉన్నది. దానిని జీతసింహుడు త్రిప్పటం మొదలెట్టాడు. దానిని త్రిప్పుతున్న కొద్దీ వాకిలి తలుపులు భూమిలోనికి దిగబడసాగాయి. ఆ వాకిలి బైట పచ్చని మైదానం కన్పించింది. జీతసింహుడు మిగతావారిని "ఆవాకిలిగుండా మైదానంలోనికి ప్రవేశించం" డన్నాడు. అందరూ మైదానంలో ప్రవేశించారు. తిరిగి జీతసింహుడు ఆ వాకిలిని మూసివేశాడు.

ఒక జాముకాలం గడచిన తర్వాత అందరూ గృహ ద్వారం ముంగిట విడిది చేసిన సైన్యంవద్దకు చేరుకొన్నారు. ఆ రాత్రి అక్కడే గడిపి ఉదయాన ప్రయాణమైనారు. రాజ కుమారి మాత్రం పల్లకీలో జయసింహుని వెంట విజయ గఢానికి ప్రయాణమైంది. ఇంత కాలమూ ఆమె వెంట ఉన్న పరిచారికలను సురేంద్రసింహుడు రాజకుమారి వెంటనే పంపించేశాడు.

సురేంద్రసింహ మహారాజు యువరాజుతో కలసి నాగఢం చేరుకొన్నాడు. యువరాజు రాజ భవనానికి చేరుకొనగానే ప్రప్రథమంగా తల్లిని కలుసుకొన్నాడు. ఆ మీదట కులదైవాన్ని ఆరాధించాడు.

ఎనిమిది రోజుల తర్వాత జయసింహ మహారాజు సురేంద్రసింహునికి లగ్నపత్రికను పంపించాడు.

ఆనందోత్సవాలు మిన్నుముట్టాయి. నౌగఢనుండి విజయగఢానికి వెళ్ళే మార్గమంతా పరిశుభ్రం చేశారు. మార్గమంతటా పన్నీరు చిలకరించారు. ఇరువైపులా దీప స్తంభాలు ప్రతిష్ఠించారు. ఇరుపక్షాల రాజులూ ఏకైక సంతానులు కావటంవల్ల పెండ్లికి జరిగిన యేర్పాట్లు అత్యం తాద్భుతంగా ఉన్నాయి. కేవలం వివాహమేగాక ఇంద్ర జాలాన్ని కూల్చి అమూల్య సంపదను వశపరచుకొన్న విజయోత్సవం ఇరుపక్షాలవారిని మరింత ఉత్సాహపరిచింది. ఒకానొక శుభలగ్నాన వీరేంద్రసింహుడు సపరివారంగా విజయగఢానికి ప్రయాణమైనాడు.

విజయగఢనగరంలో ప్రజానీకమంతా ఇళ్లూ వాకిళ్లూ అలంకరించుకొని పెండ్లివారికొఱకు ఎదురుచూస్తున్నారు. పెండ్లివారు ప్రవేశించగానే నగరవాసులు మేళతాళాలతో బ్రహ్మాండమైన స్వాగత మిచ్చారు. పెండ్లివారిముందు గుఱ్ఱమెక్కి ఉన్న శివదత్తుడు మణులు పొదగిన తలపాగచుట్టి చేతులో జండా పుచ్చుకొని పెండ్లిపందిరి ముఖద్వారం చేరుకొన్నాడు. యువరాజు వరవేషంతో పెండ్లి పందిరిలో ప్రవేశించాడు. అతడు పెండ్లిపందిరి ప్రవేశించగానే బయట కలవరం విన్పించింది. అంతలో ఇద్దరు శివదత్త మహా రాజులు అన్యోన్యజిగీషతో పోట్లాడుకోవటంచూచి అందఱూ నిశ్చేష్టు లయినారు. ఇద్దరి నోటినుంచీ "మాకు సాయంగా

ఎవరూ రాకండి. దూరంగా నిలబడి చూడండి'' అనే మాటలు విన్పిస్తున్నాయి. అందులో ఒకశివదత్తమహారాజు పెండ్లి వారిముందు గుఱ్ఱమెక్కి వచ్చినవాడు. రెండవ శివదత్తుడు సాధారణమైన దుస్తులు కట్టుకొని బ్రహాండంగా పోట్లాడు తున్నాడు.

కొద్దిసేపటికే మామూలుదుస్తులు ధరించివున్న శివదత్త మహారాజుని జెండాపట్టి గుఱ్ఱమెక్కివచ్చిన శివదత్తుడు బంధించి పెండ్లి పందిరిలోనికి ఈడ్చుకుపోయాడు. వారి వెనుక జనంకూడా పెండ్లి పందిరిలో ప్రవేశించారు.

పందిరిలో సాధారణదుస్తులు ధరించిన శివదత్తుని ఒక గుంజకు కట్టి రెండవ శివదత్తుడు యువరాజువద్దకు వచ్చి కూర్చున్నాడు. అక్కడనేఉన్న పన్నీటితో ఆ రెండవ శివదత్తుడు ముఖాన్ని కడుక్కొన్నాడు. అతడు తేజసింహుగా బయటపడ్డాడు. అందఱూ పొట్ట చెక్కలయ్యే టట్టు నవ్వారు. అతనా విధంగా తలపాగచుట్టి చేతిలో జెండాతో శివదత్తుని వేషం వేసుకుంది లోగడ ఒకసారి పంతెం పట్టినందువల్లనే. అటు స్తంభందగ్గఱ బంధితుడైన నిజమైన శివదత్తుడు అడవికి తపస్సు చేసుకోటానికి వెళ్ళి పోయినా యివాళ వీరేంద్రసింహుని వివాహం చూదామని వచ్చాడు. నిజానికతడు సన్యాసంపొందినా అతని మనస్సు లోని అసూయా ద్వేషాలు మాత్రం చావలేదు.

శివదత్తమహారాజు వైవాహికోత్సవాలను తిలకించటానికి వచ్చి అక్కడ తన వేషంలోవున్న ఒకనిని చూచి ఎవడో మాయావి దుశ్చేష్టితం అనుకొన్నాడు. ఆ వెంటనే అతని క్షాత్రరక్తం ఉవ్వెత్తుగా పొంగి కత్తిదూసి అతనితో యుద్ధానికి తలపడ్డాడు. దాని ఫలితాన్ని కూడా అనుభవించాడు. వీరేంద్రసింహ మహారాజు వివాహం రాజకుమారి చంద్రకాంతతో అత్యంత వైభవంగా జరిగిపోయింది.

